శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## రెండవ సంపుటము

ర చ యి త:

శ్రీ చాగంటి శేషయ్యగారు

హిందూ ధర్మశాస్త్రి గ్రంథ నిలయము

కపిలేశ్వరపురము (తూర్పుగోదావరిజిల్లా)

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

రెండవ సంపుటము

రచయిత:

శ్రీ చాగంటి శేషయ్యగారు

హిందూ ధర్మశాస్త్రి గ్రంథ నిలయము
కపిలేశ్వరపురము (తూర్పుగోదావరిజిల్లా)

# విషయసూచిక

శ్రీ రామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి



## రెండవ భాగము



## 9. జయదేవకవి

ఈ కవినిగూర్చిన చారిత్రాంశములేమియుఁ దెలియవు. లక్షణవేత్తలు కొందఱు జయదేవఛందమను ఛందోగ్రంథమునుండి తమ లక్షణగ్రంథములలోఁ గొన్ని యాంధ్రపద్యముల నుదాహరించి యుండుటచే నీతనిపేరు తెలియవచ్చినది. కవిజనాశ్రయమునం దీతనిపే రుదాహరింపఁబడి యుండుటచే నీతఁడు పదుమూఁడవ శతాబ్దికి పూర్వుఁడని యూహింప నగుచున్నది. ఈక్రిందిపద్యము జయదేవఛందములోని దని యానందరంగరాట్ఛందమునందు కస్తూరిరంగకవి యుదాహరించి యున్నాఁడు.

గీ. రహిఁగ లఘులకు లఘులకు బ్రాసయతు లొ
నరుప నవి యభేదప్రాసవిరతు లగును
గళల విలసిల్లు నీనిందునెల యనంగ
జాడ నేసె రాముఁడు సప్తతాళములను.

అప్పకవి యీ జయదేవఛందమును బేర్కొనలేదు.

కవిజనాశ్రియమున

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియరేచన సుకవిజనా
శ్రయుఁ డీఛందంబుఁ జెప్పెజనులకుఁ దెలియన్.

అని చెప్పియుండుటచే నీతఁడు కవిజనాశ్రయకర్తకుఁ బూర్వుఁడను టకు సంశయము లేదు. ఈ జయదేవుఁ డెవ్వరో, యెచ్చటివాఁడో తెలియలేదు. సంస్కృతభాషలోఁ గృతులను రచించిన జయదేవులు ముగ్వురున్నారు.

౧. ప్రసన్నరాఘవ మను నాటకమును చంద్రాలోకమను నలంకార శాస్త్రమును సంస్కృతభాషలో రచించిన యాతఁడొక జయదేవుఁడు. ఇతఁడు వంగదేశీయుఁడగు బ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు. సుమిత్రామహాదేవుల తనయుఁడు. ఇతఁడు పదునాఱవ శతాబ్దివాఁడని శివరామమహాదేవపరంగిపాయి బి. ఏ. గారును, అక్కిరాజు ఉమాకాన్తము గారును వ్రాసియున్నారు. క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమువాఁడని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగా రభిప్రాయపడియుండిరి.

౨. సంస్కృతమున గీతగోవిందమును రచించిన దింకొకజయదేవుడు ఇతఁ డుత్కలదేశీయుఁడు; భోజదేవునకును రాధాదేవికిని జనియించిన వాఁడు, క్రీ శ. ౧౦౮౦-౧౧౪౦ సంవత్సరముల నాఁటి వాఁడు.

౩. రాధామాధవమను సంస్కృతకావ్యమును రచించిన జయదేవుఁడు మఱియొకఁడు. ఇతనిని, చింతలపూడి యెల్లయకవి తన యాంధ్ర రాధామాధవమున నిట్లు నుతించియున్నాఁడు.

క. నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పినవిద్వ
చ్చతురానను శీలాచల
పతిహితు జయదేవు సుకవి పంచప్రదమున్.

రాధామాధవకర్తయు గీతగోవిందకర్తయు నొక్కఁడే యని కోరాడ రామకృష్ణయ్యగారును, వీరిరువురును భిన్నులని నడకుదుటి వీరరాజు పంతులుగారును. అక్కిరాజు ఉమాకాన్తముగారును వ్రాసి యున్నారు.

ఛందోగ్రంథమును వ్రాసిన జయదేవుఁ డీమువ్వురిలో నొక్కఁడో, వేఱొక్కఁడో చెప్పఁజాలము. ఉత్కలవంగదేశము లాంధ్రమున ఛందస్సును వ్రాసిరని తగినయాధారము లుండినఁగాని విశ్వసింపఁజాలము. రాధామాధవకర్తయైన జయదేవుఁ డెప్పటివాఁడో ఎప్పటి వాఁడో తెలియలేదు. ఈతఁడే ఛందోగ్రంథమును రచించినవాఁడని తోఁచుచున్నది. శృంగారమాధవీయమను సంస్కృత కావ్యమును రచించిన జయదేవుఁ డింకొకఁడుండెనని కొందఱు అనుచున్నారు. శృంగారమాధవీయమే, రాధామాధవమని కొందఱి యభిప్రాయము.

గంగేశపండితుని తత్త్వచింతామణి యను తర్కశాస్త్రమున కాలోకమును రచించిన జయదేవుఁడు పైనఁ జేర్కొనబడిన వారిలో నొకఁడో, భిన్నుఁడో తెలియదు.

ఎట్లయినను, నాంధ్రమునఁ ఛందస్సును రచియించిన జయదేవుని గూర్చి యింకను దెలిసికొనవలసియున్నది.



# 10. వాదీంద్రచూడామణి

ఇతఁడు జైనసమయావాహ్యుఁడు. కవిజనాశ్రయకర్త యని యనుకొనుచున్న రేచనకు గురువు ఇతనినామము వాదీంద్రచూడామణియని కొందఱనుచున్నారు. ఇతఁడాంధ్రమున నొక లక్షణగ్రంథమును రచించెనని చెప్పెదరు. ఆగ్రంథనామమును కవినామము నొక్కటియే. అప్పకవి యాపేరును తద్గ్రంథాదిని ఆంధ్రలక్షణ గ్రంథములలోఁ జేర్చియున్నాఁడు కాని యందలిపద్యముల నుదాహరించియుండలేదు. కస్తూరిరంగకవి తన యానందరంగరాట్ఛందమున మల్లన వాదాంగచూడామణి" యని యొక లక్షణగ్రంథమును జేర్కొని యందలిపద్యములను లక్ష్యములుగాఁ జూపియున్నాఁడు. అదియు నీవాదీంద్రచూడామణియు నొక్కటి గాదనుకొనియెదను. ఈతనిని గూర్చి యింక నేమియుఁ దెలియదు. ఇతనిని, రేచనకాలమువారిలో జేర్చుట సమంజసమని యట్లు చేయుచున్నాఁడను.

కవికర్పటిక యను నొక చిత్రకావ్యమును సంస్కృతభాషలో రచియించిన వాదీంద్రచూడామణి యొకఁడు కలఁడు అతఁడే యీతఁడేమో! అతనినిగూర్చి సంస్కృతవాఙ్మయమునందిట్లు చరిత్రము వ్రాసియున్నారు.

"కవికర్పటిక— అను నొక చిత్రకావ్యము కలదు. దీనికర్త వాదీంద్రకవి. దీని దేశకాలములు తెలియవు కాని, ఇది యర్వాచీనమే. దీనిప్రయోజనము కవియిట్లు తెలిపియున్నాఁడు.

శ్లో. యత్నాదిమాం కంఠగతాం విధాయ
శ్రుతోపదేశా ద్విదితోపదేశః ।
అజ్ఞాతశబ్దాదివినిశ్చయోఽపి
శ్లోకం కరోత్యేవ సభాసు శీఘ్రమ్.

ఈ గ్రంథములోఁ జూపిన పదవాక్యములను వల్లించియున్నచో ఆయా ఛందస్సులలో శ్లోకము చెప్పవచ్చును. ఆపదవాక్యములక్రమము జ్ఞప్తియందుంచుకొన్నఁ జాలును. ఇందుకుఁ జయదేవుఁడు వర్ణనకు కల్పించవలసినవి- ఐదక్షరముల పదములు. కర్పూరపూర- డిండీరపిండ- రజనీకర ఇత్యాదులు. వీని తరువాతఁ జేర్పవలసినట్లు వల్లించవలసిన మూఁడక్షరములపదములు - నీకాశమ్ - సంకాశమ్ - ఇత్యాదులు. ఇపుడు, కర్పూరపూరనీకాశమ్ అని యనుష్టుప్ఛందస్సులో నొకపాదము వచ్చినది. ఇట్లే నాలుగుపాదములకుఁ దగిన పదములపట్టిక లిందుఁ గలవు. ఈ విధముగా శార్దూల విక్రీడితాది వృత్తములకునుగలవు. "విఖ్యాతో గుణశాలినాం విద్యానయం రాజతే" ఇత్యాదులు.

వాగీంద్రచూడామణికవి, ఛందోగ్రంథమునే కాకుండ ఆదిపురాణమునుగూడ నాంధ్రమున రచియించెనని, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసియున్నారు. అప్పకవి వికల్పయతి కుదాహరణముగా నాదిపురాణములోనిదని "వికనాఁడిందుధరుండు" అనుపద్యము నిచ్చియున్నాఁడు. ఆపద్యము నాచనసోముని యుత్తర హరివంశములోనిది. ఈపద్య మాదిపురాణములోనిది కాకపోయినను అప్పకవి యాదిపురాణము నెఱింగియున్నాఁడనుట నిశ్చయము. కాని యాతఁడెఱిగిన యాదిపురాణము వాగీంద్రచూడామణి దగునో కాదో చెప్పుట కవకాశము లేదు. తెనాలి రామకృష్ణకవి ఆదిపురాణమును రచించెనని యొకప్రతీతికలదు. ఏయాదిపురాణమును నిప్పుడు కన్పించుట లేదు. వాగీంద్రచూడామణి యను ఛందోగ్రంథమును నిప్పుడు కన్పడకపోవుటచే నీకవినిగూర్చి వ్రాయుటకేమియు లేదు. ఈకవినిగూర్చి తెలిసికొనుటకింకను ప్రయత్నము జరుగవలసి యున్నది. ఇతనికాలము వేఱువిధమున స్థిరపడువఱకును పంద్రెండవ శతాబ్ది ప్రథమార్ధమని యనుకొందము.

స్థైర్యము నారపృష్టమియు వాలినఁ గర్కటరాశి మేషమా
నీకుఁ దగుయోని దేవగణ మీతగణంబున కిందుశేఖరా!

చ. కరివదనాధినాథమునఁ బరఁగ నాట్కలమున్ గుమవింద కాంతియున్
రవిగ్రహ మొప్పఁగా నతఁడు రక్తపువర్ణము సింహరాశియు
న్నవ వగు రోగమూషలము తారకయుత్తరఫేను యోని మా
నవగణమున్ దలంప జగణంబునకున్ ద్రిదశేంద్రవందితా!

ఉ. చంద్రుఁ డధీశ్వరుండు డగ్గృతసారము కాంతియు నిక్కలంబు త
ద్వంద్రమఁడే గ్రహంబతని చాయయుఁ దెల్పు వృషంబు రాశిభో
గీంద్రసుయోని దేవగణ మిప్సితసౌఖ్యము తత్ఫలంబిలన్
జంద్రసితార యొప్పఁగను జంద్రధరా భగణాన కెప్పఁగన్!

చ. గుణముల కెల్ల నాకరము కోరి కృతీంద్రునిడాసి యున్నదు
ర్గుణగణదోషముల్ చెఱచుఁ గోరినవస్తు వినూత్నరత్నభూ
షణముల నిచ్చుఁ గొప్పన లసత్కవిశేఖరు లెంచు సర్వల
క్షణములు గల్గియొప్పు బుధసన్నుతమై నగణంబు శంకరా!



# 11. రేచన

కవిజనాశ్రయ మనియు, భీమ ఛందస్సు, అనియు పిలువఁబడి యొడి లక్షణగ్రంథమును రేచన యనియెడు కవి రచియించెనని గ్రంథాంతపద్యగద్యాదులవలనఁ దెలియవచ్చుచున్నది. కాని యిది వేములవాడ భీమకవి కృతమని ప్రతీతి యుండుటచే నావిషయమును

గూర్చి భీమకవిచారిత్రమున విపులముగాఁ జర్చించి యీగ్రంథము వేములవాడ భీమకవికృతము కాదని నిర్ణయించియుంటిని. వేములవాడ భీమకవిగాక వేఱొకభీమన దీనిని రచియించియుండవచ్చునని యూహ కలుగుచున్నది. కాని యాభీమన యెవ్వరో తెలియకపోవుటచేఁ బ్రయోజనకరమైనను, దీనినుగూర్చి వ్రాసినచో భావిపరిశోధకుల కనుకూలముగ నుండునని యీచరిత్ర వ్రాసితిని. భీమకవిచారిత్రమున నుదాహరించిన పద్యగద్యములనుబట్టి యితఁడు జైనవైశ్యుఁడనియు, వాదీంద్రచూడామణి శిష్యుఁడనియు, కవిజనాశ్రయ శ్రావకాభరణాంక బిరుదములను వహించినవాఁడనియుఁ దెలియుచున్నది. ఇతనినివాసము, నిజామురాష్ట్రము.

శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు కాకతీయాంధ్రరాజయుగచరిత్రములో "భీమనపోషకుఁడైన గోకర్ణుఁడు వాదీంద్రచూడామణియను జైనసమయాచార్యుని శిష్యుడు. వర్ధమానపురాధీశ్వరుఁడు. ఇతఁడు భీమకవికిఁ గర్తృత్వ మారోపింపఁబడిన కవిజనాశ్రయమను ఛందోగ్రంథమును రచించి, కళ్యాణపురాధీశ్వరుఁడైన చాళుక్యజగదేకమల్లుని సేనాపతియగు రేచభూపాలున కంకితముచేసెను. ఈ రేచనకుఁ గవిజనాశ్రయుఁడనియు, గోకర్ణునకు శ్రావకాభరణాంకుఁడనియు బిరుదనామములు కలవు. కవిజనాశ్రయములో నాలుగాశ్వాసములును జైనకావ్యశాస్త్రముల ననుసరించి వాగ్దేవతాస్తుతితోఁ బ్రారంభింపఁబడినవి. వేములవాడ భీమకవి రచించినది నృసింహపురాణము గాని కవిజనాశ్రయము కాదు" అని వ్రాసియున్నారు. వీరభద్రరావుగారి యభిప్రాయము ననుసరించి కవిజనాశ్రయకర్త గోకర్ణుఁడనియు, రేచన కృతిపతియనియుఁ దేలుచున్నది. దీనినిబట్టి రేచన, కృతిపతియే గాని ప్రణేతకవి కాఁడనియు, రేచన రచించినట్లు కన్పట్టుచున్న గద్యపద్య

ము లన్నియుఁ బ్రక్షిప్తము లని వీరభద్రరావుగా రూహించినట్లు తోఁచుచున్నది. గన్నయ్యంకలి శ్రావకాభరణాంకబిరుదము గోకర్ణునిదని వారియూహ, కాని యదిసత్యము కాదు. కవిజనాశ్రయ శ్రావకాభరణాంకబిరుదము లోకయవ్యక్తికే సంబంధించినట్లు గన్నడుపద్యములనేకము లున్నవి. అందుచే వీరభద్రరావుగారి యూహలు సరియైనవి కావు. ఈ రేచన జగదేకమల్లుని సేనాపతి యనుట కాయన కెట్టి యాధారము లభించెనో తెలియదు. కవిజనాశ్రయమున రేచనను సంబోధించిన విశేషణములలో సేనాధిపతి యని యర్థమిచ్చు పదమొక్కటియును లేదు. కావున నీతనిని సేనాధిపతియని చెప్పరాదు. సేనాధిపతి రేచన, యీ రేచనకంటె భిన్నుఁడై యుండును. కవిజనాశ్రయకర్త గోకర్ణుఁడనుటయు వాస్తవము కాదు. కస్తూరి రంగకవి గోకర్ణుని ఛందస్సనియు, భీమన ఛందస్సనియు, వేఱువేఱుగా వ్రాసి వేఱువేఱు పద్యముల నుదాహరించి యున్నాఁడు. అప్పకవికూడ గోకర్ణఛందంబును, కవిజనాశ్రయంబునని వేఱువేఱుగా నుదాహరించి యున్నాఁడు. గోకర్ణుఁడు రెండు ఛందోగ్రంథములను వ్రాయుట యసంభవము. కావున కవిజనాశ్రయకర్త గోకర్ణుఁడు గాఁడనుట నిశ్చయము.

కవిజనాశ్రయ రచనాకాలమును నిర్ణయించుట కాధారములు లేవు. కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవి కాఁడనియు రేచన జగదేకమల్లుని సేనాపతి కాఁడనియు నిర్ణయించినప్పుడీకవి రేచన కాలమును జెప్పుట దుస్సాధ్యమైనది. అయినను సాధనాంతరము లభించువఱకును, రేచన భీమకవి కాలమువాఁడని ప్రస్తుత మూహించుట మంచిదని యట్లు చేయుచున్నాఁడను.

(బ్రహ్మశ్రీ) వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పట్టాభిషేక సంచిక యందు "నన్నయకుఁ బూర్వము ఛందస్సు" అను వ్యాసమున నిట్లు వ్రాసియున్నారు.

"ద్రావిడభాషలో 'యాప్పెరుంగలమ్' అను ఛందోగ్రంథము పదునొకండవ శతాబ్దిని కలదు. అందు సంస్కృత కర్ణాటాంధ్రఛందస్సుల ప్రస్తావన మున్నది. "వాంచియార్ శెయిదవడుగుచందవుం" అని యున్నది. అనఁగా వాంచియ రచించిన తెలుఁగు ఛందమును జూచి తానా గ్రంథమును రచించినట్లు గ్రంథకర్త చెప్పుకొనుటలోఁ గలదు. ద్రావిడనిఘంటు కార్యాలయమున విద్వాంసులుగా నున్న శ్రీ మూ. రాఘవయ్యంగా రిదిగుర్తించిరి. శ్రీరంగస్వామి సరస్వతిగారి వలన నిదివిని శ్రీ రాఘవయ్యంగారిని గలిసికొని సరిగా విచారించితిని. వాంచియ యను నాంధ్రఛందః ప్రణేత మనకుఁ దెలియరాకున్నాఁడు. ప్రాచీనప్రతుల లిపిరీతిని బరిశీలించినవారు "వాంచియార్" అనుపదము "రేచియార్"గా నుండనగు ననిరి. కొన్ని సంస్కృత శబ్దములు గూడ నందిట్లే వికృతిని బొందియున్నవి. రేచియార్ అని యగు రేని యాగ్రంథము రేచియ (రేచన) రచియించిన కవిజనాశ్రయ మగును. ఆద్రవిడ గ్రంథకర్త జైనుఁడు. ఈ రేచియయును జైనుఁడే. ఇది యొకపొందిక యగును. ఇట్లగునేని కవిజనాశ్రయము పదునొకండవ శతాబ్దికిఁ దర్వాతది కాకపోవును..." శ్రీశాస్త్రిగారు వ్రాసిన పై విషయము ధ్రువపడునేని (రేచనకృతమగు) కవిజనాశ్రయము నన్నయకు మున్నె పుట్టినదే యగును"

(భారతి సం ౧౧. భా ౧ పుట ౩౫౬-౩౫౭)

ఈవిషయమున నింకను బరిశోధన మావశ్యకమై యున్నది. "యాప్పిరుంగలమ్" అను ద్రావిడగ్రంథమును, ఆనాఁటి కర్ణాటకగ్రంథములను గవిజనాశ్రయమును బరిశీలించి చూచినఁగాని యితమిత్థమని నిర్ణయింపలేము.

కవిజనాశ్రయమున "మల్లియరేచా" యను సంబోధనము పలుతావుల నుండుటచే రేచనతండ్రి మల్లియ యనుట నిశ్చయము. కాని

యీవల్లియ యుదంతమును దెలియలేదు. కవిజనాశ్రయము, చిన్నకోట పెద్దన్నకృత కావ్యాలంకార చూడామణికిఁ దరువాతిదనియు, దీనికర్త వేములవాడ భీమకవియే యై యుండుననియు నిది పదునాల్గవ శతాబ్దియందు జన్మించి యుండుననియు, బ్ర. వ. చినసీతారామశాస్త్రులు గారు భారతి పత్రికలో వ్రాసియున్నారు. కాని వారితో నే నేకీభవింపఁజాలకున్నాఁడను.

కవిజనాశ్రయము పుట్టినదిపుట్టినట్లుగా లేదనియు, నందు తరువాతివారి పద్యములు కొన్ని కలసినవనియు, వప్పకవి చెప్పియున్నాఁడు. కొంతవఱకీవిషయమును బ్ర. జయంతి రామయ్య పంతులుగారు పరిశోధించియున్నారు. వారి పరిశోధనాఫలితమే యిప్పు డాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన కవిజనాశ్రయము. ఈగ్రంథమునుగూర్చియు నీకవి రచననుగూర్చియు నింకను బరిశోధన మావశ్యకమై యున్నది. ప్రస్తుతమున నీకవినిగూర్చి యింతకంటె నేమియు వ్రాయఁజాలను.



## 12. ఉదయాదిత్యుఁడు

ఇతఁడుదయాదిత్యాలంకార — మను గ్రంథమును రచియించెనఁట. ఇది కన్నడగ్రంథమో, ఆంధ్రగ్రంథమో తెలియదని గోలకొండ కవుల సంచికలో వ్రాసియున్నారు. గ్రంథము లభింపకపోవుటచే నీతని యుదంత మేమియుఁ దెలియుటలేదు. ఇతఁడు నిజామురాష్ట్రమందలి వర్ధమానపురమును బరిపాలించిన రాజనియు, ఇతనికి భీమచోడుఁడు గోకర్ణచోడుఁడు నను నిరువురు తనయులు గలరనియు నీగోకర్ణుఁడే

గోకర్ణఛందస్సు అను లక్షణగ్రంథమును రచియించెననియుఁ జరిత్రకారులు చెప్పుచున్నారు. గోకర్ణునిగూర్చి వేఱొకచో వ్రాసియుంటిని. ఉదయాదిత్యుఁడను పేరుగలవా రిరువురో ముగ్గురో యున్నారు. అందీతఁ డెవ్వఁడో తెలిసికొనవలసి యున్నది. ఈతఁడు రచించిన దాంధ్రగ్రంథమో, కన్నడ గ్రంథమో తెలియనవు డీతనినిగూర్చి పెంచివ్రాయుటవలన నుపయోగ ముండదని యింతటితో విడచివైచితిని. ఉదయాదిత్యుఁడు భీమ, గోకర్ణుల కగ్రజుఁడనియు, మైలాంబ కుమారుఁడనియు నొక శాసనమునం దున్నది. (హై. శా. సం. సంఖ్య ౩౬)

—*—

# 13. గోకర్ణుఁడు

"గోకర్ణఛందస్సు" అని పిలువఁబడియెడి లక్షణగ్రంథమున కీతఁడు కర్త. ఆగ్రంథమిప్పు డెచ్చటను గన్పట్టుట లేదు. అప్పకవి తన యప్పకవీయమున, గోకర్ణఛందస్సును స్మరించి యున్నాఁడు. కాని యందుండి పద్యములను లక్ష్యములుగా నీయలేదు. కస్తూరిరంగకవితన యానందరంగరాట్ఛందమున గోకర్ణఛందస్సులోనివని కొన్ని పద్యములను లక్ష్యములుగాఁ జూపినాఁడు. గ్రంథము లభింపకపోవుటచే నీతఁ డెప్పటివాఁడో, ఏకులమువాఁడో, ఎచ్చటివాఁడో, తెలుపుట కవకాశము లేదు. ఇతఁడు జైనుఁడని కొందఱనుచున్నారు. కొందఱీతఁడు సూర్యవంశక్షత్రియుఁ డనుచున్నారు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును చిలుకూరి వీరభద్రరావుగారును, వేములవాడ భీమకవి రచించి రేచన పేరుపెట్టెనని చెప్పఁబడియెడి కవిజనాశ్రయమను లక్షణగ్రంథమే గోకర్ణఛందస్సనియు, దాని నీగోకర్ణుఁడే రచియించెననియు వ్రాసియున్నారు

కాని యది సత్యమైనట్లు కన్పట్టదు. ఈవిషయమును భీమకవి చారిత్రమునను, రేచనచారిత్రమునను విపులముగాఁ జర్చించియున్నాఁడను.

ఈగోకర్ణుఁడు నిజామురాష్ట్రమందలి వర్ధమానపురమును బరిపాలించిన సూర్యవంశపు క్షత్రియుఁడనియు నితనికిఁ దండ్రి యుదయాదిత్యుఁడనియు, భీమచోడుఁ డగ్రజుఁడనియు, నీతఁడు కాకతి రుద్రదేవుని కాలములో నున్నవాఁడనియు, చిలుకూరి వీరభద్రరావుగారు కాకతీయాంధ్రరాజులచరిత్రమున వ్రాసియున్నారు. శ్రీరామకృష్ణకవిగారును అట్లే యభిప్రాయపడిరి. ఆకాలమున గోకర్ణచోడుఁడున్నమాట వాస్తవమే కాని, యాతఁడు ఛందోగ్రంథమును రచించెననుట కాధారములను వారు చూపలేదు. అట్టి యాధారములు లభించువఱకును గోకర్ణఛందస్సును రచించినవాఁడు, వర్ధమానపురపాలకుఁడగు గోకర్ణుఁడని తలంపవీలులేదు ఈ క్షత్రియగోకర్ణుఁడు వాగీంద్రచూడామణి యను జైనసమయాచార్యుని శిష్యుఁడని వీరభద్రరావుగారు వ్రాసియున్నారు. కాని యందులకును నాధారములేదు. ఆధారరహితములైన యట్టి సిద్ధాంతములనుబట్టి ఛందస్సును రచించిన గోకర్ణుని కులగోత్రకాలముల నిర్ణయింప వలనుకాదు. కాలము తెలియకపోయినను, రేచనతోను, వాగీంద్రచూడామణితోను సంబంధించిన కథయొకటి చెప్పఁబడియుండుటవలనను, గోకర్ణచోడుఁడు పండ్రెండవ శతాబ్దివాఁడగుటను వీతనిని పండ్రెండవ శతాబ్దియందుఁ జేర్చితిని. ఆనందరంగరాట్ఛందమున నుదాహరింపఁబడిన గోకర్ణఛందస్సునందలి పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

రుద్రదేవుని హనుమకొండ శాసనమున గోకర్ణచోడుని పేరుదాహరింపబడినది. కాని యాతఁడు పండితుఁడనిగాని, కవియనిగాని యందుఁ జెప్పఁబడలేదు. గోకర్ణచోడుని తల్లియైన మైలాంబ వ్రాయించిన పానగల్లుశాసనము (హై. శా. సం. నెం ౩౬ కు) లో గోకర్ణ

చోడునిపేర గలదు. ఇతఁడు కవియని యూహించుటకు దగిన యాధారము లందును లేవు. గోకర్ణచోడుఁ డిరువురు బ్రాహ్మణులకు దన మొసంగి వ్రాయించిన శాసనము (హై. శా. సం. నెం 32 రు) లో గూడఁ దాను పండితుఁడనని చెప్పుకొనలేదు. ఇతని కోడూరి శాసనమందును స్వప్రశంస లేదు. ఈ కారణములచే గోకర్ణఛందస్సును రచించినకవి గోకర్ణచోడుఁ డని నిశ్చయింపలేకున్నాము. సుప్రసిద్ధచరిత్రకారులగు శ్రీరామకృష్ణ కవిగారును, వీరభద్రరావుగారును. ఛందస్సును రచియించిన డీగోకర్ణచోడుఁడే యని చెప్పియుండుటచే వారి మాటలను గాదనరాదని తోఁచుచున్నను, దగినయాధారములు లభింపకుండుటచే, వాఁడే యితఁడని నిర్ణయించుట కవకాశము లేకపోయినది. ఈ యిరువురు నొకవ్యక్తియే యని నిర్ణయమగునెడల వీరని చారిత్రమున వ్రాయవలసిన యంశము లింకను జాలగలవు. వీరిరువురును భిన్నవ్యక్తులను నూహచే నావిషయములనిటఁ బ్రస్తావింపలేదు.

క. * నయలం జెప్పిన శుభ మగు
జయలం జెప్పినను బతికి జయకీర్తుఁ గుఱ్ఱ
రయలం జెప్పిన నెంతయుఁ
బ్రియ మగు మఱి మయలఁ జెప్పఁ జెంపొనరించుఱ్ఱ.

క. పతితారకుఁ బద్యము ఖ
స్థితతారకమునకుఁ జెలిమి తెలియక జనుఁడై
కృతి యొండెఁ బద్య మొండెను
విదితంబుగఁ జెప్పనతఁడు వీరిఁడి కాఁడే.

---

* కవిజనాశ్రయమునందు "నయలం జెప్పిన శుభమగు జయలం జెప్పినను బతికి జయకీర్తుఁ గుఱ్ఱ మయలం జెప్పిన సౌఖ్యము రయలం జెప్పినను జెట్ట రయమున వచ్చుఱ్ఱ" అనియున్నది.

సీ. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగ
బరఁగు సత్పురుషస్తుతిఁ బ్రాసమైత్రి
యక్షరప్రాసవిధి హాఁగని మొుకెట ననఁగ
సంభృతాశ్రితు డతఁడు శ్రోజ్జ్వలధి యనఁగ.

గీ. * యాదవశేషహావర్ణము లాదిబీదు
యుగము లై మవర్ణ విరామయుక్తి నలరు
మారుతాత్మజుఁ డెరిది సంయమి యనంగ
మదనజనకుఁడు దితిజసంహారుఁడనఁగ

క. వెలయఁగ వర్గువర్ణ శషసలు
గలసిన సరసవడి యండ్రు కవివరులెల్లన్
కలికావర్గువు తోఁటోఁ
గలపంగు పల్లకల్ల కందర్పవిభా!

క. ** మొదల నడుమంట లఘువులు
వదలవు యాంతలను వాని వరుసనె భజసల్
విదితంబులు గురువులు తుద
మొదల నడుమ మనల కెసఁగు మొగి గురులఘువుల్

వావిళ్ళవారు ప్రకటించిన సులక్షణసారమున నీక్రిందిపద్యము గోకర్ణ ఛందములోని దని చెప్పఁబడినది

క. కూర్చిరగ్రిహము క్రమ మగు
తారలు దిగ్గజములు భూమితంబులు వానిన్
జేరి యెదురెదుర నున్నవి
కూర్చిగతంబు లని యొతఁగికొను జ్వలితంబుల్

---

* ఈపద్యము అనంతుని ఛందమున అనంతుని దని యున్నది. అప్పకవియు ననంతునిదే యనినాఁడు. పెద్దిరాజుదని సులక్షణసార కర్త యనినాఁడు.

** ఇది రంగయ సర్వలక్షణసారములో నుదాహరింపఁబడినదని తంజావూరునందలి భాండాగార పట్టికలో నున్నది.

# 14. శ్రీపతిపండితుఁడు

(శైవమతవ్యాప్తికొఱకు పాటుపడిన పండితత్రయములో నీతఁడు మొదటివాఁడు.) శైవమతమును బోధించుచు నీతఁడు సంస్కృతాంధ్రములయందుఁ గొన్ని గ్రంథములను రచించెనని ప్రతీతికలదు. ఈతని యాంధ్రగ్రంథము లేవియు గాన్పించుటలేదు. కాని ముందెప్పుడైన నీతని గ్రంథములు బయలుపడునేమో యనియు, భాషాభిమానులీతని గ్రంథములకై ప్రయత్నింతురనియుఁ దలంచి యాతనిచరిత్రము నిందుఁ జేర్చితిని. ఇతఁ డారాధ్యనియోగి బ్రాహ్మణుఁడు ఈతని నివాసము కృష్ణామండల మందలి బెజవాడ ఇతఁడు వేదవేదాంగములను జదివి పండితుఁడై, తపశ్శాలియై, శైవమతాభిమానియై యుండెడివాఁడు. ఒకనాఁడాయన కృష్ణానదికేగి స్నానముచేసి వచ్చుచుండఁగా వాన యేనుఁగెనుగన్యెను. పెనుఁగు వెడలిపోయిన పిదపఁ బోవచ్చునని యాయన యాప్రక్కనున్న యింటియరుగుపై కెక్కెను. ఆయిల్లొక గొడగరిది. (గొడగరి-గొడారి; మాదిగవాఁడు) ఇంతలో నాగొడగరి లోపలినుండివచ్చి "అయ్యా! నేను ప్రతిదినము నాల్గురు శివభక్తులకు భోజనమిడువాఁడను, నేఁడయిదుగురు మాత్రమే వచ్చియున్నారు. కావున మీరివాఁడు నాయింటభుజించి, నావ్రతభంగము కాకుండఁ గాపాడవలయును." అని ప్రార్థింప వల్లెయని యాపండితుఁడు వాని యింట భుజించెను. అదిచూచి బ్రాహ్మణులు శ్రీపతిపండితుని శిష్యుఁడైన యనంతభూపాలుని యొద్దకేగి యావృత్తాంతమును జెప్పి బ్రాహ్మణులందఱును పండితుని వెలివైచి యాతనికి నగ్ని నీయరైరి. పండితుఁడూరు వెలుపల నున్న శమీవృక్షమున నొకబట్టను ముడివైచి బెజవాడయందున్న యగ్ని యంతయునందుండునట్లు శాసించెను. బెజవాడయందగ్ని కఱవయ్యెను. ఆతని మాహాత్మ్యమున కచ్చెరువంది

ప్రజ లనంతపాల సహితముగ వచ్చి యాతనిఁ బ్రార్థించి వినమితులై క్షమాపణలు చెప్పుకొని యాపచ్ఛదమునుండి యగ్నిని గైకొని చనిరి. ఈకథను పాలకురికి సోమనాథుఁడును మల్లికార్జున పండితారాధ్యులు నీక్రింది పద్యగద్యములలోఁ గీర్తించి యున్నారు.

"భక్తుండు శ్రీపతిపండితుం డీశు
భక్తుని కిలఁ గోటిబ్రాహ్మణులైన
నెనయన్న నాలుగనేఁ గోసివైతు
ననుచు ననంతపాలుని సభాస్థలిని
నెక్కొనఁగాఁ జంద్రనిప్పులు గాదె
చక్కన పాత్రిపచ్ఛడమున ముడిచె" బసవపురాణము.

క. ఒక్కఁడె దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు పేరన్
సుక్కిక శ్రీపతిపండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా!

క. అతులిత శివభక్తునితోఁ
బ్రతి సేయఁగ రాదు కోటిబ్రాహ్మణులని శ్రీ
పతిపండితయ్య నిప్పులఁ
గుతుకమ్మతి న్మూటఁగట్టెఁ గొంగునను శివా!

శివతత్త్వధారము

ఈ శ్రీపతిపండితు వంశమున, కాశీనాథుఁడను నొకమహాపురుషుఁడు జన్మించి ఖ్యాతిగాంచుటచే నప్పటినుండియు నీవంశమువారు కాశీనాథునివారైరి. ధర్మాభ్యుదయ భద్రాయుశ్చరిత్రములను రచించిన కాశీనాథుని వీరారాధ్యుఁ డీశ్రీపతివంశములోనివాఁడే. ఈ శ్రీపతిపండితుని కథను వీరారాధ్యుఁడు తన ధర్మగుప్తాభ్యుదయమున నీక్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

గీ. అనఘుఁ డప్పండితేంద్రుని నిజాంశభూతి
భవ్యులు శ్రీపతి మంచెన పండితులును
మల్లికార్జునపండితుఁ డెల్లజనులు
వినుతు లొనరింప వెలసి సత్కీర్తులమున!

గీ. వారు భువి వీరశైవ ప్రవర్తనంబు
బ్రాహ్మణాచార మగునంచుఁ బత్యమాన
వేద వేదాంత సిద్ధాంతసమ్మతముగఁ
దెలియఁ జేయుచు విలసిల్లి రలఘుమహిమ!

క. ధీరుఁడు శ్రీపతిపండితుఁ
డారయఁ బ్రాచీనదేశికాహ్వయుఁడు మహో
దారశివాద్వయమార్గ
స్ఫారధురంధరుఁడు లోకపావనుఁ డెన్నన్.

క. ఆగురుఁడు విజయవాటిని
భోగోజ్జ్వలమందిరమున బుధయుతుఁడై శై
వాగమనైగమబోధా
యోగమునఁ జరింపుచుండి యొకనాఁడనియెన్.

క. శివుఁడే దైవము ధరలో
శివభక్తులె సత్కులీనసిద్ధాంతపరుల్
శివమంత్రమె మనురాజము
శివునిప్రసాదంబె భోగశేఖర మరయన్.

వ. అని శపథంబుగాఁ బలుకుచు ననంతపాలదండనాయక మహీధ రాది ద్వ్యతతిసేవాయత్త చిత్తంబులం బ్రవర్తింపుచుండఁ బరవాది కోలాహలుండై జయవాటీపురంబున విజయధ్వజంబెత్తి మహోత్తర శైవాచార్యుండనఁ జెలంగుచుండి యొక్కనాఁడు.

ర్పడ మీఁగుకు వెజ్జగు నని
కడుఁ దోఁచక యుంటి మిపుడు కలఁగుచు నధిపా!

సీ. అని యిట్లు విప్రులాడిన పలుకుచు సభ్యు
లా పండితులఁ జూచి యనఘచరిత
యిది యెట్టిదగునని మదలింపఁ జెలువున్న
సెలవుల శైవాటి చెలువు దనర
నింతయు నిజము మే మొనయ మున్నొనరించు
ప్రతిన యిట్టిద యసత్ప్రాజ్ఞులాక
మొనసి యాత్మాద్వైతమున శివాద్వైతము
నను జెందువారలఁ గినిసి జాతి

భేదమెంచఁగ రాదని పృథులశాస్త్ర
రీతులును మానివర్గంబు నీతి దెలియుఁ
డరసి జాబాలశతపథద్వయాదులందుఁ
బలుకు పలుకులు వినుఁడు విభ్రమము మాని.

సీ. వేదవేదాంతార్థవిధులచే సాధింప
గా లేక మూర్ఖులై కదిసి మీర
లగ్నిమీఁకిడమని యూర్పుల దిమీకుఁ
గలిగియుండినఁ గదా కడమమాట
అని కోపశిఖిపీక్షణాగ్రప్రచారినై
గరిగాని విస్ఫులింగములఁ దనువ
రోమలు గంటిడ ధరాభ్రమణంబుచే దిశల్
తుమ్మరిపారె చందమ్మ నెఱప

నగసభాగంబునం దిరుల్ గ్రిమ్ముకొనఁగ
సర్వశివాఘమును సభావదులు మూర్ఛ
వొందఁ వప్పుండితేంద్రుఁ డత్యుగ్రవేగ
పరణి లఘించెఁ దన్మహోస్థాపసిద్ధి.

వ. అప్పండితేంద్రుఁడు జయవాటికాపుర మల్లిఖార్జునాగ్నేయభాగం
బున నున్న శమీశాఖాసమీపంబునకు నరిగి యగ్నిదేవుని కభివందనంబు
ను బ్రమథగణస్తోత్రంబును గావించి వీరహోత్రు సాక్షింపుమఁ దన
మీఁది పట్టుపచ్చడంబునం గట్టి యిట్లనియె.

మ. వినుమీ పావక! శైవగేహములలో విశ్రాంతిఁ జక్కఁగాఁ బురం
బున నెందుఁ వసియింప కీ ఘనవిస్ఫూర్జన్మహంబుగా హరిం
ప్ర నగేంద్రాలయునాజ్ఞ దప్పి చనయుంబున్ మీఱితేని వీరభ
ద్రునిచే నీకగుభన్నముఁ దెలియుఁగా దోర్దాడ నింకేటికిన్.

ఏడుదినములు గడచినపిదప అనంతపాలాది దండనాథులతోఁగూడ వచ్చి ప్రజలు శరణని వేఁడఁగా పండితుఁడాయగ్నిని విడిచిపుచ్చె నఁట!

ఇతఁడు బ్రహ్మసూత్రములకు శివపరముగా నొక వ్యాఖ్యను వ్రాసి దానికి శ్రీకరభాష్యమని పేరిడియెను. ఈతఁడింకను గొన్ని సంస్కృతగ్రంథములను రచించెనని చెప్పుదురు. శ్రీకరభాష్యమునకు శివదీపికయని పేరుపెట్టెనని కొందఱందురు. శివదీపిక యనుగ్రంథము నాంధ్రమున వ్రాసెనని కొందఱనుచున్నారు. యుద్ధమల్లుని బెజవాడ శాసనము నందున్న మధ్యాక్కరల నీతఁడే రచించెనని కొందఱు చెప్పుచున్నారు. ఆయక్కరలలోఁ గొన్నిటి నిటనుదాహరించుచున్నాఁడను.

౧. స్వస్తినృపాంకుశాత్యంతవత్సల సత్యత్రిణేత్ర
వి స్తర శ్రీయుద్ధమల్లు డనవద్యవిఖ్యాతకీర్తి
ప్రస్తుతరాజాశ్రయుండు త్రిభువనధరుణుండు సకల
వస్తుసమేతుండు రాజసల్కిభూవల్లభుం డర్థి.

౨. పరగంగ బెజవాడ గొమరుస్వామికి భక్తుఁడై గుడియు
నిరుపమమఠి నృపధాము డెత్తిచ్చె నెగిదిర్చె మఠము

గోరఁగట్టి గోరు లిఁదవిడిసి బ్రహ్మాండంబు గొని యుండువారు
పరిగాక యగ్నాహితాసిప్రవచ్చిన పాపంబు గొండ్రు.

౩. వేయంగ నిమ్మైట్టు డప్పి మలినులై విడిచిన బ్రోలి
గేతానసతులును రాజు పట్టముం గట్టినపతియు
నలయం బయ్యార్వల వెల్గించిన నశ్వమేధంబు
ఫల మపేక్షించి నాలింగదాసిన పాపంబు దవాను.

౪. జనవుత చేబ్రోలునుండి బెజవాడ జాత్రకువచ్చి
త్రిణయనసుతుఁ డొందుచోట మెచ్చక తివిరి యున్నలవ
యానఘుండు చేకొని యందు ప్రత్యక్షమైయున్న నచ్చ
గని మల్ల డెత్తించె గుడియు మఠమును గార్తికేయునకు.

౫ సమణలో బెజవాడ కెల్లవెడగుచు రక్షయుగాను
దమతాత మల్లపరాజు పెద్దలు దాను గట్టించె
క్రమమున దాని కలశమిడ్డెంగా మొగమాడు
సమరంగ శ్రీయుద్ధమల్లుఁ డెత్తించె నమితతేజుండు.

ఈపద్యములు శ్రీపతిపండితకృతము లైనచో, నీశాసనము పదియవ శతాబ్దిలో వ్రాయఁబడినది. కావున నీపండితుఁడు నన్నయకుఁబూర్వుఁ డని చెప్పవలసివచ్చును. కాని యందు సత్యము లేదని తోఁచుచున్నది. పైన చెప్పిన యగ్నిహోత్రమును బట్టియుందు కట్టిన కథ సత్యమయ్యెనేని యాతఁ డనంతపాలుని కాలమువాఁ డగును. అనంతపాలుఁడు పశ్చిమచాళుక్య వంశములోనివాఁడైన యాఱవ విక్రమాదిత్యుని దండాధిపతియై కొండపల్లిరాజ్యమును పాలించిన యుత్తమ బ్రాహ్మణుఁడు. ఆఱవ విక్రమాదిత్యుఁడు క్రీ శ. ౧౦౭౫–౧౧౨౬ వఱకు రాజ్యము చేసినవాఁడు. అనంతపాలుని శాసనము చేబ్రోలులో నున్నది. అనంతపాలుని యల్లుఁడు చక్రరాజదండనాయకుని శాసన

మొకటి ద్రాక్షారామ యాలయమునందున్నది. (ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౨౫౫-౧౩౨౧) ఇది చాళుక్య విక్రమసంవత్సరములు ౪౭- క్రీ.శ ౧౧౨౨ నాఁటిది అనంతపాలుని కాలమును నిర్ణయించు శాసనము లింకను చాలఁగలవు (ద హిం. రా. సం. ౯ భా ౧.) వీనినిబట్టి శ్రీపతిపండితుఁడు క్రీస్తుశకమున పదునొకండవ శతాబ్ది తుది పాదమునను పండ్రెండవ శతాబ్ది నాదిపాదమునను నున్నవాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కావునఁ బైవఁజెప్పిన యక్కర లీతనివి కావు.

పోతరాజు వీరశకవి తన విభూతి రుద్రాక్ష మాహాత్మ్యమును ఈ శ్రీపతిపండితున కంకితము చేసెను. కాని యందుమూలమున వీరిరువురును సమకాలికులని తలంపరాదు. పండితుని యందుఁగల భక్తిచే వీరశకవి తన గ్రంథము నీతనికర్పించియుండెనని తలంపవలసియున్నది.

ఈ శ్రీపతి పండితునివంశము తాముతంపరయై బహుముఖముల వ్యాపించియున్నది. గ్రంథవిస్తరభీతిచే నావంశవృక్ష మిటనీయ లేదు.

—*—

# 15. దేసటిపండఁడు

ఇతనితండ్రి భీమనృపాలుఁడు తల్లి ఎరియాంబ; తాతపండఁడు బూరము పితామహి; గండఁడు ప్రపితామహుఁడు; మేకమ ప్రపితామహి.

ఈకవి గుంటూరుమండలములోని చేబ్రోలునందున్న కుమారి స్వామికి, అఖండదీపదానము చేసి యాంధ్రపద్యాత్మకమైన యొక శిలాశాసనమును వ్రాయించెను. దానినిబట్టి యీతఁడు కవిత్వము

చెప్పఁగలవాఁడని తెలియుచున్నది. ఈతఁడు రచియించిన గ్రంథము లేవియో తెలియలేదు. ఆశాసనము నీక్రింద వ్రాయుచున్నాఁడను. ఇప్పటి పాఠకుల సౌకర్యముకొఱకు శాసనము నందలి యుచ్చారణను గొంత సవరించితిని.

శా. శ్రీనారీపతి నాభిపంకజభవ శ్రీపాదజాతోత్తమ
క్ష్మానాథాంబుజభాస్కరుండు నిజవంశంబెల్ల దీపింపఁగా
దీనానాథ కవీంద్రగాయకులు గీర్తింపంగఁ గీర్తిస్థుఁడై
భూనాథాగ్రణి బుద్ధవర్మ ప్రభతోఁ బుట్టెన్మహాశౌర్యుఁడై ౧.

స్రగ్ధర. శ్రీరమ్యాత్మీయధామా కాం
చికి నెన యగు కాంచీపురీనాథు నుగ్రా
కారుణ్ లాలాటనేత్రుణ్
గవిజనహితు ముక్కంటి కాడువెట్టిం బుణ్యా
చారున్ దద్ముక్తివక్త్రే
క్షణగుఁడు గొలిచి మనుశాసనం బొందఁ గణ్వో
దారుం డొంగేరుమార్గ
త్రిశాఖము వసెసె నాతారచంద్రార్కలీలన్. ౨.

ఉ. ఆవిభునవ్వయంబున గుణౌఘ్యుఁడు గంధఁడు పుట్టె వానికిన్
దేవమహీజదాని యగు దేసటిపండఁడు పుట్టె షట్సహ
స్రావని నీవెఁ దత్సుతుఁ డుదగ్రుఁడు విల్లవభీముఁ డంధ్రుల
క్ష్మావని తేఁకుచేఁ బడసెఁ జెల్వుగుపంచికుఱ్ఱు వృత్తిగాన్. ౩

ఉ. ఆతని కుద్భవించె నధిపాగ్రణి గండఁడు వానికిన్ గుల
స్త్రీతిలకంబు మేడమకు ధీరుఁడు పండఁడు పుట్టె వానికిన్
శీతకరాస్య బూరమకు సింధురవైరి బలుండు రాజమాం
ధాతుఁడు పుట్టె భీముఁడు వదాన్యుఁడు ధన్యుఁడు పుణ్యమూర్తియై.

చ. ..................................................
......................దీక్షితి శ్రీ వరేణ్యవిఖ్యాతకో
హలయానఁ జెంపుఁగన్న సొంతి యాంబకు నుత్పాదమర్త్య భారతీ
నిలయుఁడనంగఁ బండధారిణీపతి సర్వకలా ప్రవీణుఁడై. ౫

చ. తలఁపు సదర్థభావమునఁ దగ్గితసూక్తులఁ గూడ వర్ణనల్
గొలుసుగొనంగఁ బ్రౌఢులు గోరినభంగిని వచ్చి ముట్టఁగో
మలగతి దేసిమార్గములు మ్రుచ్చుపడం గలనంబుచొప్పు నా
ద్యులక్రియఁ జెప్పనేర్చు నృపధూర్జటిభీమయపండఁడిమ్మహిన్. ౬

మ. స్వరతర్కాంబర చంద్రసంఖ్యఁ జనుశాబ్దాబ్దచైత్రామలే
తరపంచాదశి సౌరివాసరసముద్యద్భేషసంక్రాంతి సు
స్థిరతం బొల్చుమయూరవాహనునకుం జేకోలఁ బెట్టించె భా
స్వరదీపం బతిభక్తిఁ బండనృపుఁడాచంద్రార్కతారంబుగాన్. ౭

స్వస్తి శకవర్షంబు ౧౦౬౭ గు నేఁటి చైత్రబహుళ పంచాదశియు శనైశ్చరవారమున శ్రీకుమారస్వామిదేవరకు మహామండలేశ్వర పండయ దమతండ్రి భీమరాజునకు ధర్మార్థముగా నఖండదీపమునకు కిచ్చిన ఎద్లు ౫౫. వీనిం జేకొని నల్లంగాలయబోయుని కొడుకు కొండబోయుండు దన పుత్రపౌత్రిక మాచంద్రార్కము మహాసేవమున నిత్యం మానెడు నేయి వోయంగలవాఁడు శ్రీ శ్రీ శ్రీ

ఈశాసనము ద. హిం. శా. సం. ౬ సంఖ్య ౧౦౩ గా ప్రకటింపఁబడినది. పై పద్యములలోని ౬ వ పద్యమునుబట్టి యీతని దేసి మార్గములు రెండింటియందును జక్కని కవిత్వము చెప్పఁగలవాఁడని తెలియుచున్నది. ఇతఁడాంధ్రమున నేమేని గ్రంథములు వ్రాసియుండు నని యూహింపవగును. పై పద్యము లితనివే యైయుండును. రెండవ పద్యములోని "దేసటి" యీతనయింటిపే రైనట్లూహించి యీతనిని

దేసటివంశజుఁడని పేర్కొన్నాఁడను. మొదటిపద్యమును బట్టి యితఁడు కూడఁ డనుట నిశ్చయము. కొండవీటి రెడ్డిప్రభువుల యింటిపేరు కూడ దేసటివారే. కాని యంతమాత్రముచే నితనిని రెడ్డికులజుఁడని నిశ్చయింపలేము. "దేసటి" యను గ్రామమునుబట్టి యిరువు రుభయు లకును గూడ "దేసటి" యను గృహనామ మేర్పడిన నేర్పడియుండును. పై శాసనమునుబట్టి యీకవి క్రీ. శ. పండ్రెండవ శతాబ్ది మధ్యభాగము వాఁడని తెలియుచున్నది. ఈకాలముననే వెలనాటిగొంకమహీపతికి మేనమామయగు పండఁ డొకఁ డున్నాఁడు ఆతఁ డీతఁడే మోయని సంశ యించితిని గాని విమర్శించిచూడఁగల నీయిరువురు నొక్కరు గారని తేలినది. ఆపండనినామ ముదాహరింపఁబడిన శాసనములు పెక్కు లున్నవి. వానియందాతనిని కవియని చెప్పలేదు. ఆతనితల్లి మల్లాంబ. మనకవి పండనితల్లి యెఱియాంబ.

ఈకవి పండనివంశమునకు మూలపురుషుఁడు బుద్ధవర్మ యైనట్లును, అతఁడు ముక్కంటికాడువెట్టిని సేవించి, వంగేరుమార్గత్రయము నాతని వలనఁ బడసినట్లును పైపద్యములలోని మొదటి రెండుపద్యములవలనఁ దెలియుచున్నది. ఈ ముక్కంటికాడ్వెట్టి కాంచీపురనాథుడనియు లలాటమందు నేత్రము గలవాఁడనియు నీ పద్యములో నున్నది. కొందరు చరిత్రకారు లీముక్కంటికాడ్వెట్టియే త్రిలోచనపల్లవుఁడని నిశ్చయించి యున్నారు. త్రిలోచనపల్లవుఁ డాఱవ శతాబ్దివాఁడని చెప్పవచ్చును. కొండపడమటిరాజుల మూలపురుషుఁడయిన బుద్ధవర్మ యొకఁడున్నట్లును నతఁడు తూర్పుచాళుక్యుల వంశకర్తయైన కుబ్జవిష్ణు వర్ధనునికడ సేవకుఁడైనట్లును కొన్నిశాసనముల వలనఁ దెలియుచున్న ది. (ద. హిం. శా. సం. ౧ సం. ౯౦౩) ఈ బుద్ధవర్మకూడ శూద్రుడే. కవిపండనివంశకర్తయైన బుద్ధవర్మయు, కొండపడమటిరాజుల మూల

పురుషుఁడైన బుద్ధవర్మయు నొక్కఁడుగాకపోయినను, నీవంశములో బుద్ధవర్మలు పెక్కురుండుటచే, నీయిరువురి వంశములు నొకబుద్ధవర్మ నుండి యుత్పన్నములైన శాఖలేమోయని తోఁచుచున్నది.

మన కవిపండనికిఁ బితామహుఁడైన పండని ప్రపితామహుఁడు "ఆఱువేలనాఁ"డను దేశమును బరిపాలించినట్లు శివ పద్యమువలన దెలియుచున్నది. చరిత్రకారు లితనిని గుర్తించిన ట్లగపడదు. ఇతని కాలము క్రీ శ. ౮౫౦—౮౮౦ ప్రాంతమగును. ఈవిషయామున నింకను బరిశోధనము కావలసియున్నది.

ఈ పండనికుమారుఁడైన బిల్లనభీముఁడు "పంచినికట్టు" అను గ్రామము నాంధ్రదేశాధీశ్వరునిచేఁబడసినట్లు పైపద్యములోనే యున్నది ఈ గ్రామమెచ్చటిదో, ఈయాంధ్రేశ్వరుఁడెవ్వఁడో తెలియలేదు. ఈ బిల్లనభీముని కాలము క్రీ శ. ౧౦౦౦ ప్రాంతమగును. ఆకాలమున నాంధ్రదేశాధీశ్వరులని చెప్పఁదగినవారు చాళుక్యులును గాకతీయులునై యున్నారు. క్రీ. శ. ౧౦౦౦ నాఁటికిఁ గాకతీయులు స్వతంత్రప్రభువులుగా లేరు. కావునఁ బశ్చిమచాళుక్యులుగాని తూర్పుచాళుక్యులుగాని పంచినికట్టు నిచ్చియుందురు. పంచినికట్టును గుర్తింపఁగలిగిన యెడల దాతయెవ్వరో తెలిసికొన వీలుగలుగును ఈ భీముని తండ్రియైన పండఁడు, ఆఱువేలనాఁడునకుఁ బరిపాలకుఁడై యుండఁగా నీభీముఁడాపాలకత్వమును బోఁగొట్టుకొని యొకగ్రామమునువృత్తిగాఁ బడయవలసినస్థితి లోనికేలవచ్చెనో తెలియకున్నది.

కవిపండనివంశమునకు మూలకర్తయైన బుద్ధవర్మ ముక్కంటికాడువెట్టిచే ఒంగేరుమార్గాశ్రయమును బడసెనని పైస్రగ్ధరావృత్తము నందున్నది. "ఒంగేరుమార్గ" శబ్దము మఱికొన్ని శాసనములయందును గలదు. ఇది యొక దేశముయొక్కనామము.

పై శాసనమునుబట్టి యీకవిపండఁడు క్రీ శ. ౧౧౪౫ వ సంవత్సరమున నున్నాఁడనుట స్పష్టము.

—*—

# 16. మల్లికార్జున పండితారాధ్యులు

శైవమతవ్యాప్తికై తమ జీవితములను ధారవోసిన పండితత్రయములో నితఁడొకఁడు. తక్కినవారు శ్రీపతిపండితుఁడును మంచనపండితుఁడును. ఈ శైవమత మనునది వీరితోఁ గ్రొత్తగా వచ్చినది కాదు. క్రీస్తుశకారంభమునకు పూర్వమే ద్రావిడులు శైవమతావిష్టులై యుండిరనియు, నెన్నికేశ్వరులఁ బ్రతిష్ఠించిన నాగమతమును విడనాడలేదనియు. ద్రావిడార్యులు శైవమతము నొకమతముగా నంగీకరించి యనార్యులను దమతోఁ గలుపుకొనిరనియు నొక ప్రతీతి కలదు. బసవారాధ్యుఁడు శైవమతకర్తయని కొందఱందురు కాని యది వాస్తవము కాదు. శివుఁడు త్రిమూర్తులలో నొకఁడు. ఈ శివునిగూర్చిన వాక్యములు వేదములందును గలవు. శైవవైష్ణవ సంప్రదాయపురాణములలో ననేకములున్నవి. వేదవిహితకర్మములను విడనాడకుండ శివుఁడే దైవమని, శివుఁడే మోక్షప్రదుఁడని నమ్మి ప్రత్యేకముగ శివునారాధించినవారు శైవులు. అట్లే విష్ణువు నారాధించినవారు వైష్ణవులు. ఈ మతవిభేదము హెచ్చినకొలఁదిని బరస్పరద్వేషము పెరుగఁ జొచ్చినది. ఈ శైవులును గొలఁదిగనే యుండిరి. ప్రజాసామాన్యము శివకేశవులయందు సమానభక్తిగలవారై యున్నారు.

ఒకవారు దేవత్వమును విడచి బ్రహ్మమొకటియే సత్యమనియు జగత్తు మిథ్యయనియు, నా బ్రహ్మమే దానని యనుకొనుచు, ప్రతిమానపూజను విస్మృతధర్మమనియు, బోధించు నుపనిషన్మతమును గౌరవించువారనేకు లున్నారు. యజ్ఞయాగాది విహితకర్మల నాచరించుచు జన్మసాఫల్యము గావించుకొనుట ధర్మమని వాదించు కర్మవాదులును గలరు. కాలక్రమమున నీమతము లన్నిటిలోను నంతర్భేదము లేర్పడినవి. శైవులలో, పాశుపతులు, కాలాముఖులు, కాపాలికులు, భైరవులు

శాక్తేయులు ననుభేదము లేర్పడినవి. ఇట్లే వైష్ణవులలోను గొన్ని యంతర్భేదములు వచ్చినవి. వీరు తమలోఁదాము గలహించుచుండిరి. ఈమతవివాదము లిట్లుండఁగా నాకాలముననీదేశమున జైనబౌద్ధ మతములు బయలువెడలినవి. ఇవి వేదమతమునకు విరుద్ధములైనవి. జైనులును బౌద్ధులును నాస్తికులు; భగవంతుని యునికి నంగీకరింపరు. వర్ణాశ్రమాచారధర్మముల నొప్పుకొనరు. సర్వజనసమానమును బోధించుచుండుటచే నీమతము లతిసులభముగాఁ బ్రజాసామాన్యమున నలుముకొన సాగినవి. పరస్పర వైషమ్యములతో నున్న శైవ వైష్ణవాదిమతము లీకాలమునఁ దమ ప్రాబల్యమును గోల్పోయినవి. జైన బౌద్ధమతముల దాడినుండి సంరక్షించుకొనవలసిన భారము శైవవైష్ణవ మతావలంబుల కావశ్యకమయ్యెను. అందులకుఁ గావలసిన మహాపురుషు లప్పు డుద్భవించిరి. శైవమతోద్ధారణమునకై బసవనారాధ్యుఁడును, పండితత్రయము నుద్భవించిరి. ఇందులోఁ బసవన మత సంస్కర్త. పండితులు మువ్వురును మత వ్యాపకులు.

బసవన యాంధ్రభాషయందుఁ గావ్యరచనము చేయలేదు. అందుచే నాతనిచారిత్రమును వేఱుగా వ్రాయుటకు నాకావశ్యకము లేకపోయినది. కాని యాతనిచారిత్రముతో సంబంధించిన గ్రంథములను రచియించిన వారిలో నాంధ్రకవులు కొందఱుండుటచే నీ బసవఁడెవ్వరో తెలిసినఁగాని, యాకవులచరిత్రములలో నీతనిని గూర్చి వ్రాసిన వాక్యములు సులభముగా బోధపడవు. అందుచే బసవని చారిత్రమును క్లుప్తముగా నిట వ్రాయుచున్నాఁడను. ఇతనినిగూర్చి విశేషముగాఁ దెలిసికొనఁ దలఁచినవారు పాలకురికి సోమనారాధ్యకృత బసవపురాణమును, శ్రీనాగేశ్వరరావుగారును శ్రీప్రభాకరశాస్త్రిగారును రచించిన పీఠికలలో నున్నదానిని జూడవలయును.

బసవన మండగిమాదిరాజను బ్రాహ్మణుని కుమారుఁడు. ఇతని తల్లి మాదమ్మ. వీరినివాసము కర్ణాటదేశమందలి హింగుళేశ్వరభాగవాటియను నగ్రహారము. ఇది శ్రీశైలమునకుఁ బశ్చిమభాగమున నున్నది. నందీశ్వరుని యంశచే నీబసవన జనించెనని యప్పటివారి విశ్వాసము. కూడలిసంగమేశ్వరుఁ డీతని జననకాలమునఁ దపసిరూపమున నాగ్రహారము వచ్చి యీశ్వరనివేదనముగాని పదార్థమేమియు నా శిశువున కీయరాదని తల్లితోఁ జెప్పెనఁట! తలిదండ్రులాతనికి బసవేశ్వరుఁడని నామకరణముచేసిరి. గర్భాష్టమ వత్సరమున నాతని కుపనయనముఁ గావింపఁ దలిదండ్రులు ప్రయత్నించిరి. బసవన యందులకంగీకరింపలేదు. శివునిపై భక్తిగలవానికిఁ గర్మతోఁ బనిలేదనియు, శివభక్తియే మోక్షదాయక మనియుఁ జెప్పి యుపనయనము చేసికొనలేదు. సరికదా! వర్ణాశ్రమధర్మములను ద్యజించి, వర్ణేతరులైన శివభక్తులతో సహభోజనాదులను జేయ నారంభించి, తలిదండ్రులను వీడి నాగాంబ యను సహోదరీ సహితుఁడై తనమేనమామయున్న కల్యాణకటకమునకు వచ్చెను. ఈ కల్యాణకటక మంతకుపూర్వము పశ్చిమచాళుక్యుల రాజధాని. వారినిజయించి కాలచుర్యులు కల్యాణకటకము నాక్రమించుకొనిరి. బసవన యక్కడకు వచ్చునప్పటి కాపట్టణమును బరిపాలించుచున్నది. కాలచుర్య వంశజుఁడగు బిజ్జలుఁడు. బసవన మేనమామ యగు బలదేవ దండనాయకుఁ డాబిజ్జలునికడ దండనాయకుఁడుగ నుండెను. ఈబలదేవుఁడు కూడ శివభక్తుఁడు. ఆతనికి గంగాంబయను నొకతనయ గలదు. ఆమెను భవునకీయనని యాతఁడు ప్రతిన పూనియుండెను. భవుఁడనఁగా వీరశైవుఁడు కానివాఁడు. ఇంతలోఁ దనమేనల్లుఁడే తనయొద్దకు రాఁగా వీరశైవుఁడయిన యాతనికిఁ దన కుమార్తెనిచ్చి వివాహముచేసెను. తరువాతఁ గొన్నాళ్ళకు బలదేవ దండనాయకుఁడు చనిపోయెను. బిజ్జలుఁడు బలదేవుని స్థానమును బసవన కొసంగెను. బసవన అధికారములోనికి వచ్చినపిదప శైవమత

వ్యాప్తికై విశేషప్రయత్నములు చేయఁజొచ్చెను. ఆరాజ్యమున నది
వఱకు జైనమతవ్యాప్తి యాధిక్యముగ నుండెను. బసవన జైనులనందఱిని
బాధపెట్టుచుండెను. ఆబాధలకు భయపడి జైనమతమున నెవ్వరును
చేరలేదు సరిగదా! అదివఱకు జైనమతమును స్వీకరించినవారుకూడ
లింగధారణ మొనర్చి వీరశైవ మతమును గైకొన నారంభించిరి. రాజ
భాండారమునందలి ద్రవ్యమును యథేచ్ఛముగా జంగముల కొసఁగుచు
వీరకు వీరశైవమతము నభివృద్ధి చేయుచుండెను. వీరశైవమతమునకు
లింగధారణము ముఖ్యము. అదివఱకున్న శైవమతమునకు లింగధారణ
మావశ్యకము కాదు. బ్రాహ్మణధర్మమును విడువకుండగనే శైవులుగా
నుండుట కర్హతను కలిగియుండెడిది. బసవన శైవమతమును సంస్క-
రించి నూతన నియమముల నేర్పరచినాఁడు. ఆనియమములలోఁ బ్రధా
న మయినవి రెండు. మొదటిది లింగధారణము వీరశైవమతమును
గైకొనిన ప్రతివ్యక్తియు లింగధారణ మొనర్చి తీరవలయును. రెండవ
ది వర్ణాశ్రమాచార పరిత్యాగము. లింగధారణ మొనర్చి వీరశైవమత
మును గైకొన్నవాఁడు చండాలుఁడైనను బ్రాహ్మణులతో సహవాస
సహపంక్తుల కర్హుఁడు. కర్ణాటదేశమున నవతికాలములోనే యీ
మతము విశేషముగా వ్యాప్తమయ్యెను. బసవన సహాయ్య ముండుటచే
మతముపేరిట నత్యాచారములు జరిగినను వినువారు లేకపోవుచుండిరి.
బిజ్జలుఁడు శైవజైనమతములయందు సమానాదరము చూపువాఁడు.
అతఁడు జైనుఁడని కొందఱనుచున్నారుకాని, యతడు శివాలయముల
కొసంగిన ధర్మములను బట్టి చూచినచో శివమతద్వేషి కాఁడనియు,
వీరశైవుఁడై జైనులను హింసించు స్వభావము కలవాఁడు కాఁడనియు
తేలుచున్నది. శైవమతనింద యొనర్చువారిని వీరశైవులకు ద్రోహ
మొనర్చువారిని జంపివేయుటకుఁ గూడ బసవన యంగీకార మొసంగి
యుండెను. వీరశైవ మతధర్మములలో నది యొకటిగా నా కాలమున

బ్రాహ్మణ ప్రభువుచుండెను. ఇట్లుండగా బిజ్జలుడొకనాఁడు వీరశైవులును బసవనమతములోఁ జేరినవారునగు యల్లయ, మధుపయ్య యనువారల కండ్లు కారణము తెలుపకుండగనే పెరికించెను. అందుపై బసవనకు జాలఁగోపము వచ్చెను. శివద్రోహము పెరిగిపోవు చున్న యీ రాజ్యము పురమునం దుండ నిష్టములేనివాఁడై యనుచరులతోఁగూడ నాగ్రామ మును విడిచి వెడలిపోవుచు బిజ్జలుని శిక్షించుటకుఁ దగిన యేర్పాటు లను గావించి మఱిపోయెను. జగదేవుఁడను బిజ్జలుని దండనాయకుఁడు బసవనచేఁ బ్రేరితుఁడై బసవన యనుచరుల యిరువుర సాహాయ్యముగా గొని యర్ధరాత్రమునఁ గోటలోనికేఁగి బిజ్జలుని పొడిచిచంపెను. బిజ్జలుని కుమారులు పగఁబూని బసవనామాత్యుని నొక సంవత్సరము దాఁటకుండ వధించిరని కొందఱందురు. బిజ్జలుని కుమారులు వచ్చు చున్నారని విని యొకతటాకములోఁ బడి యాత్మహత్య గావించుకొనె నని కొందఱందురు. కొందఱాతఁడు స్వాభావికముగానే లింగైక్యము జెందెనని చెప్పుచున్నారు. ఇతఁడు గో. దఱు క్రీ శ ౧౧౬౭ వఱకు జీవించియుండెనందురు. కాని యది విశ్వసింపదగినది కాదు. బసవన జన్మస్థానము బొంబాయి రాష్ట్రమున బీజాపూరు మండల బాగేవాడి మంగోలి గ్రామమై యుండెననియు నాగ్రామములోని క్రీ. శ ౧౧౬౧ నాఁటి యొకశాసనములోఁ బసవన యనునాతఁడొక యాలయమును నిర్మించెననియు, హారితగోత్రుఁడైన మాదిరాజను నాతఁడాగ్రామ మునకుఁ బ్రభువనియు వ్రాసియున్నదనియు ప్రభునామమును దరువాతి వారు తండ్రినామముగా భావించి యుందురనియు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్య చరిత్రపీఠికలో వ్రాసియున్నారు.

“దానిలో (ఆశాసనములో) ఆలయనిర్మాతయైన బసవని గురించి ఉన్న వృత్తాంతమిది:— మణిగవల్లి ఏనూరిలో కశ్యపగోత్రాబ్ధి చంద్రుఁ డయిన గోవర్ధనుఁ డుండేవాఁడు. అతనికొడుకు రేవదాసు. రేవదాసుకు నలుగురుకొడుకులు. వారిలో కడపటివాఁడు మహాప్రఖ్యాతి వహించిన

చంద్రధరుండు. అతని కొడుకు బసవడు అతడసాటిలేని మహేశ్వర భక్తుడు; ఈ బసవభాస్కరుని వల్ల మునిగవల్లిలోని ఏనూరు బ్రాహ్మణుల హృదయగ్రంథులను వికసించినవి ప్రపంచమంతా అతనికి తద్రి ఆరు ఘోరముల మీద దోసిలొగ్గి నమస్కరించడము చేత అతడు లోకపిత న్నైవాడు. మూడు వేదముల సారమితడే. ఆద్యంత హితుడితడే. జ్యోతిర్లింగస్వరూపుడితడే" అని అందరున్న జయపెట్టుతూ ఉండగా మునిగవల్లికి కీర్తిపరిమళములను తెచ్చినాడు"

పండితారాధ్య చరిత్రపీఠిక ౭౮.

చరిత్రకారులు వ్రాసిన యంశములనుబట్టి బసవనారాధ్యుని సంక్షిప్తచరిత్రమిది. "బండారు బసవన్న" యని బసవపురాణాది గ్రంథముల యందీతనిని వ్రాసియున్నారు. 'బండారు' అనునది బసవన యింటి పేరు కాదు. బిజ్జలరాజువద్ద కోశాధ్యక్షుడుగా నుండుటచే నీతని నిట్లు పిలువజొచ్చిరి. భాండాగారాధిపతిని 'బండారువు' అని పిలచెడివారు. బండారువే క్రమముగా 'బండారు' అయినది. యేది యెట్లున్నను బసవడు వీరశైవ మతవ్యాప్తికై జీవితమునంతను ధారవోసిన ప్రతిభాశాలి. ఇతడు గొప్ప సంస్కర్త. ఈతనికాలమున, నిజాము రాష్ట్రమునందును కర్ణాటకమునందును లింగాయత మతమేర్పడి యాకాలమున గొంతయభివృద్ధి చెందినది. కాని తరువాత నది యంతగా వ్యాప్తము కాలేదు.

బసవనకాలములోనే మన మల్లికార్జున పండితారాధ్యుడును శైవ మతవ్యాప్తికై తన జీవితమును ధారవోసిన వాడు. కాని, బసవారాధ్యునకు మల్లికార్జునారాధ్యునకును, ఒక్క విషయమున భిన్నాభిప్రాయము కలదు. బసవనారాధ్యు డుపనయనము చేసుకొనక బ్రాహ్మణత్వమును విడనాడి వర్ణాశ్రమాచార ధర్మములను త్యజించి వీరశైవమతమును గైకొనియుండెను. మల్లికార్జునారాధ్యుడు శైవ

మతమునఁ దైష్ణవ సమ్మతము కలవాఁడై లోకమున శైవమతము దప్ప వేఱొక మతముండరాదను నాస కలవాఁడే కాని వర్ణాశ్రమాచార ధర్మములను గర్హించుట కిష్టపడనివాఁడు. "భక్తియాఁదిఁ బలపు బ్రాహ్మణ్యంబుతో బొత్తు, బావ లేను సెట్టి జంగలింగ" యని యాతఁడు చెప్పెనని యందురు.

ఈతని జన్మదేశకాలాదులను దెలుపు నాధారములు లేవు కాని యొక చిన్నపుస్తకమున నితఁడు గోదావరిమండల మందలి దక్షారామ వాసుఁడనియు నందలి భీమేశ్వరస్వామి పూజారియగు భీమనయ యాతని తండ్రి యనియు కోటిపల్లి యారాధ్యుని కితఁడు శిష్యుఁడనియు వ్రాయఁబడి యున్నదఁట. పండితారాధ్యచరిత్రమునఁ గూడ నిట్లే యున్నది.

"నాసంగెద వేంగిమహోర్వీస్థలమున
ససమానలీల దక్షారామ మొప్పు
నప్పురంబున సముద్యన్మహాభిమాను
నొప్పు శ్రీభీమేశ్వరోరులింగంబు
రూఢిఁ దద్దేవు పురోహితశ్రేష్ఠుఁ
డీడిత విద్యాసమీహాస్పదుండు పర
భక్తిసత్తముఁడు సద్బ్రాహ్మణోత్తముఁడు
వ్యక్తవాసవవంశవర్ధనకరుఁడు
వాతుండు భీమన పండితేంద్రుండు
పుత్రార్థియై మమ్ము భువి భజించుచును
సన్నిధి నాకప్పురశ్వరుఁ గొలిచి
చున్న వాఁడతనికి నుదయింపుమనుఁడు
సమరశక్తి సాష్టాంగుఁడై యేగుదెంచి
జనియించె భీమాఖ్య సాధ్వి గర్భంబు
మల్లికార్జునదేవు మహాసీయనామ

నగుచు బండితమల్లికార్జునుండనంగ
ననఘుఁడు గోటిపల్లారాధ్యదేవ
దేవుని సత్కృపాదృగ్విలోచన సు
ధావార్ధి మధ్యగతక్రీడవలన"

ఈ గ్రంథము పండితునితరువాతఁ గొలఁది కాలములోనే సోమనాథుఁడు వ్రాసియుండుటచే నిందలి విషయములు సత్యములని తలంపవచ్చును. పూజారిఁ బురోహితుఁడుగా నిందుఁ జెప్పియుండవచ్చును. ఈ దేశమున శివాలయములలో సామాన్యముగా "శివార్చకు" లను తెగవారు పూజారులుగా నుందురు. ద్రాక్షారామ భీమేశ్వరస్వామికిఁ బూర్వమునుండియు వెలనాఁటిబ్రాహ్మణులు పూజారులుగానున్నారు. కావున మల్లికార్జునారాధ్యులు వెలనాటిబ్రాహ్మణుఁడై యుండునని యూహకందుచున్నది. ఆంధ్రదేశమున వెలనాఁటి బ్రాహ్మణులలో శివభక్తిగలవారు పెక్కురున్నారు. కాని యారాధ్యులమనిపించుకొని పరమత ద్వేషమును గలిగియున్నవారు గన్పడరు. అందుచేనితఁడేశాఖా బ్రాహ్మణుఁడో నిశ్చయింపలేము. ఈ పండితారాధ్యుని వంశములోని వారమని చెప్పుకొనెడివారిప్పు డారాధ్యనియోగి బ్రాహ్మణులలో నున్నా

ఈ మల్లికార్జునారాధ్యు లాంధ్రమున "శివతత్త్వసార" మను నొకగ్రంథమును రచియించెను. గ్రంథమంతయుఁ గంద పద్యములు. ఎన్ని పద్యముల నీతఁడు రచించెనో తెలియదు. ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించిన ప్రతిలో ౪౯౦ పద్యములున్నవి. ఈ పుస్తకమునకు బ్ర. శ్రీ. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు విపులమగుపీఠికను వ్రాసియున్నారు. ఈ గ్రంథము నీతఁడు రచించెననుట కీక్రిందిపద్య మాధారము.

రహిఁ నయేవాగ్గోచరం బను నప్రాప్త
మనసాసహ యనుమాట నిజము
యెద్దియుఁగాఁ దనియెడి పరమేశుఁడే
కొంతయు నని యెగ్గి సొలుఁగ నవక
యొప్పులనుచు సంశయింపక శివతత్త్వ
సారగద్యపద్యసమితి శివుని
మహిమఁ దెలిసినట్టి మల్లికార్జునపండి
తయ్యగారి దలఁతు ననుదినంబు.

పండితయ్య రచించిన శివతత్త్వ సారము గద్య పద్యాత్మకమని యీపద్యమునఁ జెప్పఁబడినది. కాని యీగ్రంథమున పద్యములే కాని గద్యలు లేవు.

సీ. వేదముల్ ధరసన్నివేదేష్వధీతోభవ
యనఁగ బరగు లింగమతశయిల్లు
నెఱి శ్వపచోపి మునిశ్రేష్ఠ సమోస్తు లిం
గార్చ నేరత యన నట్లు నమ్మి
ప్రీతి సరుద్రైవభూతలేయపిత్ర
సన్నిహితశ్శివయన్న యదియు
తగ నచపూజ్యోయథాహ్యహంబనె యని
నేత్రాంగవిక్రయాపాత్ర మగుచు
జంగమంబు గాంచి చని లింగపరవశ
భాతి నుభయలింగభక్తి యుక్తి
మహిమఁ దనరి నట్టి మల్లికార్జునపండి
తయ్యగారి దలఁతు ననుదినంబు.

సీ. ఆదిరుద్రేశాత్త మశ్నంతి రుద్రేణ
పీతం పిబతి ప్రవ్యాప్తిశ్రుతులు
తన్నిగమాంతార్థ మతికిల్బిషంశ్వాన
పర్ణితం బసియు సిద్ధాంతములను
అవికల సిద్ధాంత వివహోక్తిలో భాన్న
ధాదయేత్తను శివధర్మములను
శివధర్మశాస్త్ర ద్వస్తి ప్రసాద మేవభో
క్తవ్య మను పురాణకాండములను
సిద్ధ మనుచు వేదసిద్ధాంతశాస్త్ర పు
రాణతతుల మలహర ప్రసాద
మహిమఁ దెలిపినట్టి మల్లికార్జునపండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు.

ఒకప్పుడు బ్రాహ్మ్యధర్మమును విడిచి వీరశైవమతమును జైకొనుమని మల్లికార్జునపండితునకు బసవన వర్తమానమంపెనఁట! అందుపైని పండితుఁడు పైవివ్రాసిన్లు "భక్తియీఁడివలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు బాయలేను నేను బసవలింగ" యని ప్రత్యుత్తరమంపి, బసవనతోఁ జర్చించి, యాతని నెట్లయినను దనమార్గమునకుఁ ద్రిప్పవలయు నను నుద్దేశముతో బసవనను దర్శించుటకై పయనమై వెళ్లెనఁట. పండితారాధ్యుఁడు దనరావతిలో నుండఁగా బసవేశ్వరుఁడతనికి భస్మము నంపెను. అప్పుడే యాతఁడు కర్ణాటమునఁ గవిత్వము చెప్ప మొదలిడెనఁట. పండితారాధ్యులవారి మాహాత్మ్యమును దెలుపు పెక్కుకథలను శైవులు చెప్పుచుందురు. వాని నిట చెప్పుటకు దొంకొంటి నేని యదియెంతయో గ్రంథమగును. అందులకు పండితారాధ్యచరిత్రము మొదలగు గ్రంథము లున్నవి. అందుచే నాకథలను విడిచి, శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు

పంతులుగారు శివతత్త్వసార పీఠికలో వ్రాసిన యొకటిరెండు కథలను వారిమాటలలో నిట నుదాహరించెదను.

"నవనవోలు (చందవోలు) అను గ్రామమునందు వెలనాటి చోడుఁ డను రాజు రాజ్యము చేయుచుండెను. చందవో లిప్పుడు గుంటూరుజిల్లా తెనాలితాలూకాలో నున్నది. పూర్వము వెలనాటి రాజుల రాజధాని. ధనదపురమని దానికి నామాంతరము. పండితారాధ్యుఁ డాగ్రామమునకుఁ బోయి తనమతమును బోధింపసాగెను. అప్పటి రాజగురువు బౌద్ధుఁడు. అతనిపేరు బౌద్ధపరవాదాచార్యుఁడు. ఈతఁడు బ్రహ్మవంశజుఁడట! తాను రాజునకు గురువుగా నుండఁగా నన్యమతస్థుఁ డారాజధానిలో మతబోధచేయుటచూచి సహింపనోపక యాబౌద్ధుఁడు రాజుతోఁ జెప్పి యొకగొప్ప సభచేయించి మల్లికార్జున పండితారాధ్యు నాసభకు రప్పించెను. ఆసభకు నద్వైతులు జైనులు సాంఖ్యులు చార్వాకాది నానామతములవారు వచ్చియుండిరి. పండితుఁడు బౌద్ధమతము నితరమతములను దనపాండిత్యమహిమచే ఖండించి తనమతమును స్థాపించెను. ఇంతియకాక శివుఁడు శ్రేష్ఠుఁ డనుటకుఁ దనతల యిచ్చెదననియు, మంటలో దుమికెదననియుఁ జెప్పి శివుని కంటె నెక్కుడు దైవముకలఁడని యెవ్వరైనను జెప్పినయెడల, వారితల తనకాలితోఁ దన్నెదనని ప్రతిజ్ఞచేసి తన సిద్ధాంతమును నిలుపుకొనుటకై 'రుద్రమహిమ' యను కృతిని రచించెను. అంత బౌద్ధుఁడేమియు ప్రత్యుత్తర మీయఁజాలక పండితుని నిందించెను. అందఱును వెడలి పోయిరి.

కాని బౌద్ధుఁడు పండితుని నిందించినందున నాతనిశిష్యులకు మిక్కిలి కోపమువచ్చెను. 'అట్టి నిందకుని జంపకున్నయెడల నతఁడు ద్రోహి కాఁడు; తామే దోషులగుదుమని వారుతలంచిరి. పండితుని శిష్యులలో కేమయ్య దేవయ్య లనువా రీపనికిఁ బూనుకొనిరి.

సముద్రములోని యొకలంకలో (సముద్రము చందవోలున కుఁదొమ్మిది మైళ్ళు మీఁదనున్నది.) నౌకబౌద్ధాలయ ముండెను. అచ్చటి కాబౌద్ధుఁడు ప్రతిదిన మొక్కఁడు వెళ్లి వచ్చుచుండును. ఆసంగతి తెలిసినవాఁడు గావున నౌకనాఁడుదగుమునసె రేవయ్య దేవయ్య లాలంకకు నెవరికిఁ దెలియకుండఁ బోయి దేవుని మఱుఁగున దాగియుండి బౌద్ధుఁడు వచ్చి బుద్ధ విగ్రహమునకు జాఁగిలి మ్రొక్కుచుండఁగ వానిని జంపి, వికృతరూపునిఁ జేసి వెడలిపోయిరి. ఈసంగతి తెలిసి రాజుమిక్కిలి కోపించి పండితయ్యను బిలిపించి యడుగఁగా నతఁడు 'నేనే చేయించి యుంచితిని నేనే చంపించితి' నని దోషమంతయుఁ దనమీఁద మోపుకొనియెను. అంత రాజు పండితుని కనులు తీయింపఁగా నతఁడు రాజునకు శాపమిచ్చి యచ్చటనుండి శిష్యయుక్తముగా నమరావతికి వెడలిపోయెను.

చందవోలులో నున్నప్పుడే యీతఁడు "లింగోద్భవగద్య" యచ్చటి దేవునిపైఁ జెప్పెను. (లింగోద్భవుని దేవాలయ మిప్పటికిని జందవోలులో నున్నది.) "చందవోలు కైఫియతు" అను పుస్తకమునందు నీకథయే యిట్లున్నది. పండితారాధ్యుఁడు శ్రీశైలమునకుఁ బోవుచు చందవోలునకు వెళ్లి పాండీశ్వరస్వామి గుడిలో దిగెను. కొండపడమటి బుద్ధరాజునకు గురువైన బౌద్ధుఁడు బుద్ధాం అను గ్రామ మందుండెను. వాఁడు పండితుని మహిమనుజూచి యోర్వలేకపోయెను. పండితుని ప్రతిదినశివపూజలోఁ గావలసిన యొక పూజాపాత్రను బౌద్ధుని శిష్యుఁడైన చెఱుఁడనువాఁ డెత్తుకొనిపోయెను. పండితుని శిష్యులు వానిని బట్టుకొని చంపిరి. ఈసమాచారము వారు తమ గురువునకుఁ జెప్పలేదు. అంత బుద్ధరాజు పండితునివద్దకు మనుష్యులను బంపి నరహంతకున కేమిశిక్ష శాస్త్రీయ మని యడుగఁగాఁ గనులు తీయుటయే తగినశిక్ష యని పండితుఁడు చెప్పెనఁట దానిపై బుద

రాజు పండితుని కనులు తెరపించెను. పండితుఁ డాతనికి శాపమిచ్చి యిఁకమీఁద శైవులెవరును చంద్రవోలులోఁ దీర్థము పుచ్చుకొనఁగూడ దని నియమించి వెడలిపోయెను.

అమరావతి చేరగనే పండితుఁడు చోడునితో భాషించిన పాపము పోవుటకును శివనింద విన్న పాపముపోవుటకును శివభక్తుల సహస్రనామగనామాలిక పఠించెను. అమరేశ్వరాష్టకముఁ జెప్పెను.

కన్నడభాష తనకు రావలయునన్న కోర్కెతో నీతఁడు కల్యాణమునకు బసవేశ్వరుని యొద్దకు వర్తమానమంపెను. అంత నాతఁడు భస్మ మంపెను దానిని ధరింపగనే పండితునకుఁ గన్నడభాష వచ్చెను. అతఁ డాభాషలోఁ గొన్నిగీతములను చెప్పెను. తరువాతఁ బండితుఁడు బసవేశ్వరుని జూడవలయునని కల్యాణపురమునకు బయలుదేరెను. త్రోవలో సారంగేశ్వరుఁడు దేవుఁడు గాఁగల నిడుగుడుములను చోట (1) తనముఖ్యశిష్యుఁడగు దోచయ్యగారికి నన్నయైన వీరచాకిరాజయ్యగారిచే గౌరవింపఁబడి పానుగంటికిఁ (2) బోయెను. అప్పట నుదయుఁడను రాజుకొద్ద నున్న పింగళి గోవిందప్రధాని పండితుని

(1) 'నిడుగుడుములు అను నది యిప్పుడు కృష్ణాజిల్లా నందిగామ తాలూకా మానగాల జమీందారీలోని ముఖ్యగ్రామమగు 'నడిగూడెము' అని నా తాత్పర్యము. మదమున నిడుగుడుములకు నేతెంచి సదమలాత్ముఁడు వీరచాకిరాజయ్య ప్రవ్యక్తభక్తి సారంగేశునందు (మహిమ. పుట ౨౯౭) అని చెప్పఁబడి యున్నది. ఇప్పుడు నడిగూడెము అనఁబడు గ్రామమునకు 'నడికుడుములు' అని పూర్వము లెక్కలలోఁ బేరుగలదు. ఇచ్చటిదేవుఁడు సారంగేశ్వరుఁడు. ఇది అమరావతినుండి పానుగంటికిఁ బోవు త్రోవలో నున్నది.

(2) నైజాము రాజ్యమునందు రెండు పానగల్లులున్నవి. ఒకటి నల్లగొండజిల్లాలోను వేఱొకటి మహబూబ్‌నగరుజిల్లా నాగర్ కర్నూలు తాలూకాలోను కలదు. ఉదయచోడుని స్థలమునుబట్టి నాగర్ కర్నూలు తాలూకాలోనిదే పండితుఁడు వెళ్లినపానుగల్లని నిశ్చయింపవచ్చును. ఇంకొక పానుగల్లు (హానగల్లు) బొంబాయిరాజధానియందు ధార్వారుజిల్లాలో కలదు.

భక్తుఁడు. కావున వానిని మిక్కిలి మర్యాదతో నెదుర్కొని తన యింటికిఁ దోడ్కొనిపోయెను. అచ్చట ధనశేఖనామయ్య యను భక్తుఁడు కలఁడు. ఇతఁడు రాజునొద్ద స్వంతసేవకుఁడు (ఖాసా) వండి తఁడా గ్రామమునకు వచ్చినప్పటి నుండియు వాని భజనలోనుండి రాజసేవ సరిగఁ జేయకుండెను. అంత రాజునకుఁ గోపమువచ్చి యాతనిని శిక్షించి కోపపడఁగా దేహమాత్రము మీదిగాని ఆత్మ మీది కాదు. మీ దేహమును మీరు తీసికొండని గుడిశిఖరము మీఁది కెక్కి యురిపెట్టుకొని చచ్చెను. అంతఁ బండితుఁ డారాజునకు శాపము పెట్టి వెడలిపోయెను.

వసిపురములో శంకరయ్య యను భక్తుని సహాయ్యఁగొని కల్యాణమునకు బయలుదేఱగా నంతకుఁబూర్వ మెనిమిది దినములక్రిందట బసవేశ్వరుఁడు లింగైక్యముఁజెందె నన్న సమాచారము త్రోవనేఁ దెలిసి పండితున కమితఖేదము కలిగి యాతఁడు బసవనిఁ బొగడుచుఁ బ్రలాపించెను.

అంత బండితుఁడు శ్రీశైలపర్వతమునకుఁ బోయెను. వెల్లటూరు (1) నొద్దకువచ్చి యచటనె యుండి తన ప్రియశిష్యుఁడైన దోనయ్యను గిరి ప్రదక్షిణము చేసి శివరాత్రికి శ్రీశైలము పైకిఁ బోయి తన వ్రతమును బూర్తిచేయుమని చెప్పి యతనికి పర్వతవర్ణనము నుడివెను. అతఁడు గిరిప్రదక్షిణము చేసివచ్చిన తరువాతఁ బండితుఁడు తానువచ్చినపని నైనదనియు, బసవేశ్వరుఁడును బోయెను గనుక దానుండనక్కఱ లేదనియు, నీశ్వరుని బ్రార్థనచేసి భార్యాపుత్రులతో వెల్లటూరులోనె లింగైక్యముఁ జెందెను.

---

(1) గుంటూరుజిల్లాలో రెండు వెల్లటూళ్ళుకలవు. ఒకటి రేపల్లెతాలూకాలోను, ఇంకొకటి వినుకొండ తాలూకాలోను, నైజామురాజ్యమున నల్లగొండజిల్లాలోఁ గూడ నొక వెల్లటూరుకలదు. కాని శ్రీశైలమునకు సంబంధించినది వినుకొండ తాలూకాలో నిదియే. ఇది వినుకొండనుండి శ్రీశైలమునకుఁబోవు త్రోవకు కాలుమైళ్ళు ప్రక్కగ నుండును.

లేక, తనపితామహుఁడు మూఁడుకాండములను రచించినాఁడు అవి కెప్పు యంచనితో వదలివేసి తాను, ఉత్తరరామాయణమును రచించెనని చెప్పినచో నది సహజముగ నుండునా? లోకము శంకించునా? తిక్కన, యాతనివ్రాతి భాగము నందుకొని రామాయణము నేల పూర్తిచేయ లేదు? అని శంకింతురేమో! మహాత్ముల హృదయములు దురవగాహములు ఆయన మనసులో నప్పుడేమికలదో యెవరు చెప్పఁగలరు? ఎంతటి వైదుష్యవంతునకైనను ఒక్కమారు చదివి నంతనే హృదయాకర్షకవిధానముగ భాసించు శ్రీ పద్యాదులను రచించిన తిక్కనసోమయాజి, భారతరచనానంతరమున గూడ నాయుష్యవశేషమును బూనింపలేమ దీనికి గారణ మేమగును? కొంతభాగమును రచించి ముగించిన తన పితామహుని కావ్యము పూర్తిచేయుట కాతనికి మనసు గొలుపకయుండును.

పైనిఁ జెప్పిన "ఎత్తఱికైనను" అను పద్యములో నింతయర్థ మిమిడియుండలేదనియు. ఎప్పుడైనను ధీరోదాత్తనాయకుఁడైన రామచంద్రుని వృత్తము పూజనీయమే కావున నుత్తరరామాయణమును రచించితి" నను సామాన్యార్థము మాత్రమే యందుఁ గలదనియు, లోకము శంకించునను నూహాగాని యనుమల కుత్తర మీయవలయునను భావముగాని తిక్కనకు లేదనియు, నట్లే దాని తరువాతిపద్యములో నెట్టిసూచనయు లేదనియు నీయూహాలన్నియు మంత్రిభాస్కరుఁడు రామాయణమును రచించెనను భావము గలిగియుండుటచే నుద్భవించెడి భ్రాంతిమూలకములగు నూహలనియుఁ గొంద ఱనవచ్చును.

ఆ పద్యమున కెంతయర్థముండెనో, లోకమున కేమి తెలుపఁగోరి యాతఁ డాపద్యములను రచియించెనో, యను విషయములను గూర్చి తిక్కన కవితారహస్యమును గ్రహింపఁగలిగిన రసజ్ఞులు తమకుఁ దోఁచినరీతిని నిర్ణయించెదరుగాక! తన పితామహుఁడు రామా

యణ భాగమును రచించియుండెనని తెలుపుటకే తిక్కన యాపద్యము
లను రచించెనని వారితలంపు.

ఉ. భూరివివేక చిత్తులకుఁ బోలునవం దలఁపఁగ దళంబులన్
సౌరభ మిచ్చు గంధవహుచందమునం బ్రకటంబు జేసి యం
పారెడువల్కులం బసయు నప్పులుకు ల్పొగుచున్నట్లుగాఁ
దేరుప నేరఁగావలయుఁ జేసెద సంస్కృత యన్నవారికిన్.

నిర్వచనోత్తర రామాయణము

స్కరరామాయణమను పేరెట్లు వచ్చినది?

భాస్కరరామాయణ మను పేరు కవి యుంచెనని చెప్పఁజాలము. కవి తన పేరును జేర్చి నామమిడిన గ్రంథములు కొన్ని కలవు కాని యిట్టి వివాద విషయములలోఁ గవియే తనపేరుతో గ్రంథనామము నుంచెనని తలంచుట న్యాయము కాఁజాలదు. రామాయణమను పేరు గ్రంథమో, గ్రంథములో యుండుటచేఁ గొంతకాలమునకుఁ బిమ్మట లోక మీగ్రంథమునీపేరనఁబిలవఁ జొచ్చెననితలంపవలసియున్నది. ఎప్పుటినుండి యీపేరు లోకమున వాడుకలోనికి వచ్చినదో చెప్పఁజాలము. క్రీ శ. ౧౨౦౦-౧౩౨౦ నడుమ నీపేరున్నదని ధ్రువపడినచో తప్పు, నీనామము మంత్రి భాస్కరున కన్వయించునని నిర్ణయించుట కవకాశము లేదు. ఆమధ్యకాలములో నీపేరు వాడుకలోనుండె ననుటకు సాక్ష్యము లేదు. కావున గ్రంథనామమునుబట్టి మంత్రిభాస్కరుని కర్తృత్వము స్థిరపడఁజాలదు. కాని యాతనిపేరుతోనే యీరామాయణమును బిలుచుచున్నారని తలంచుట కొంతయవకాశము గన్పడుచున్నది.

ఇప్పుడు మనకులభించుచున్న భాస్కర రామాయణ మందలి గద్య పద్యములను బట్టి రామాయణకవు లైదుగురని తెలియుచున్నది. బాల, కిష్కింధ సుందరకాండములను రచించినవాఁడు మల్లికార్జునభట్టు, అయోధ్యాకాండమును రచించినది కుమారరుద్రదేవుఁడు ఆరణ్యకాండ

మును రచించినవాఁడు భాస్కరుఁడు. యుద్ధకాండమునఁ గొంతభాగ మును రచించినవాఁడు హుళక్కిభాస్కరుఁడు. మిగిలిన భాగమును రచించినది అయ్యలార్యుఁడు. గ్రంథమును ప్రారంభించినవారి పేరును బట్టి గ్రంథనామ మేర్పడుట న్యాయము. అట్లుగాక గ్రంథాంతకాండము లోఁ గొంతభాగమును రచించిన హుళక్కిభాస్కరునితో గ్రంథనామ మేర్పడిన దనుట సమంజసము కాదు.

ఈసూత్రము నన్వయింపఁజేసి చూచినచో, నీగ్రంథమునకు మల్లికార్జునరామాయణ మనుపేరు రావలసియున్నది. అట్లు రాలేదు. భాస్కరరామాయణ మనిపేరువచ్చుటకు, అరణ్యకాండగద్యలే కారణ మైయుండవలయును. అరణ్యకాండ భాస్కరవిరచిత మని యీగద్యల వలన స్పష్టముగాఁ దెలియుచున్నది. యుద్ధకాండాంతమున నయ్యలార్యుని గద్యయే కాని భాస్కరుని గద్యలేదు. కావున నీరామాయణమునకు భాస్కరరామాయణమని పేరుపెట్టినవారు, అరణ్యకాండాంతగద్యనే యందుల కాధారముగాఁ గొనియున్నారని తలంపవలసి యున్నది. యుద్ధకాండములోఁ గొంతభాగమును హుళక్కిభాస్కరుఁడు రచియించియుండుటచే నాతనిని బట్టియే యీపేరు వచ్చినదని కొందఱనవచ్చును. యుద్ధకాండ భాగమును హుళక్కి భాస్కరుఁడు రచియించెనని యయ్యలార్యుఁడు చెప్పిన:-

"చ. అమర హుళక్కిభాస్కరమహాకవి చెప్పఁగనున్న యుద్ధకాం
డము తనువాయి చెప్పెఁ బ్రకటప్రతిభాషణుఁ డప్పలార్యస
త్తమసుతుఁ డయ్యలార్యుఁడు కృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా,
హిమకరతారకారవిమహీవలయస్థిరలక్ష్మి వేడుకన్"

అను పద్యమువలన మాత్రమే మనకుఁ దెలియవచ్చుచున్నది ఈపద్యము లేకపోయినచో మనకు హుళక్కిభాస్కరుఁడు లేనేలేఁడు.

స్పష్టముగా రెండుగడ్డలమీఁదను దెలియుచున్న భాస్కరుని విడచి, హుళక్కి భాస్కరునకుఁ దరువాతఁ జాలకాలమునకు యుద్ధకాండము రచియించినవాఁడగుటచే నెట్లుఁగవచ్చిన హుళక్కిభాస్కరుని బట్టి గ్రంథనామ మేర్పడుట సమంజసము కాదు. ఇందుల నారణ్యకాండ కర్తయు, యుద్ధకాండాది భాగ కర్తయు నొక్కఁడే యగుటయు, నాతఁడే హుళక్కిభాస్కరుఁడని యీ ప్రతివాదము రావచ్చును. ఆవాదమున కవకాశమున్నమాట నిక్కువమే కాని కారణాంతరములచే నారణ్యకాండ కర్త భిన్నుఁడని ధ్రువపడియెనేని యాతనిని బట్టియే యీగ్రంథమునకు భాస్కర రామాయణమను పేరు వచ్చెనని నిశ్చయింపవలసి యున్నది. ఇంతేకాదు. అట్టిభిన్నకర్తృత్వము స్థిరపడిన పక్షములో మొట్టమొదట మంత్రిభాస్కరుఁ డరణ్యకాండమువఱకునో, కాక యింకను పయికొంతభాగమునో కాక పూర్తిగనో రచియించియుండె ననియు, నాతనిపేరుతోడనే భాస్కరరామాయణ మనుపేరు వచ్చెననియుఁ గాకతాళీయముగ హుళక్కి భాస్కరుఁడు కూడఁ గొంతభాగము నిందు రచియించియుండుటచే నాతనిబట్టి పేరువచ్చెనని లోకము భ్రమించుచున్నదనియుఁ దలంచుట కూడ సమంజసమగును.

బ్ర॥ శ్రీ వీరేశలింగము పంతులుగారు మున్నుగు కొందఱు హుళక్కిభాస్కరునిబట్టియే భాస్కరరామాయణమను పేరు వచ్చెనని వ్రాసియున్నారు. ఆవిషయమునుగూర్చి హుళక్కిభాస్కరుని చారిత్రమున వర్ణించెదను. ఒకవేళ యుద్ధకాండము రచించిన హుళక్కిభాస్కరుని పేరుతోడనే గ్రంథనామమేర్పడినదని యంగీకరించినను నంతమాత్రమున రామాయణరచనమునందు మంత్రిభాస్కరునకు స్థానము లేదని ధ్రువపఱుపక యీవిచారణము గొనసాగింపవలసియే యున్నది.

## మంత్రిభాస్కరుని కర్తృత్వమును స్థిరపఱచెడి యాధారములు గ్రంథమునం దేమైనఁ గలవా?

ఈ పైపై యూహల నటుంచి, మంత్రిభాస్కరుని కర్తృత్వమును స్థిరపఱచెడి యాధారము గ్రంథమునం దేమైన కలవేమో చూడ వలసియున్నది. భాస్కరరామాయణమునఁ దక్కినవానికంటె నారణ్య కాండము మంత్రిభాస్కర విరచిత మని తలంచుట కాధారములున్నవని కొందఱనుచున్నారు. కావున ముందుగ నాకాండమునే పరిశీలింతము.

## ఆరణ్యకాండగద్యలు

ఆరణ్యకాండము రెండాశ్వాసములుగ విభజింపఁబడి యున్నది. ఆరెండాశ్వాసముల తుదలను గద్యము లొకేవిధమున నీరీతిగనున్నవి. గద్యము "ఇది సకల సుకవిజన వినుత యశస్కర భాస్కర ప్రణీతంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునం దారణ్య కాండంబు" కొన్నితాళపత్ర ప్రతులలో 'యశస్కర' శబ్దము లేదు. ఆశబ్దమును దీసివేసినచో నిది సర్వవిధముల నన్నయభట్టు భారతమున వ్రాసికొనిన గద్యనుబోలి యున్నది. శ్రీమహాభారతమున నన్నయభట్టు "ఇది సకలసుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబైన" అని వ్రాసికొనియున్నాఁడు.

ఈ గద్యమునుబట్టి, దీనికర్త మంత్రిభాస్కరుఁడో హుళక్కిభాస్కరుఁడో నిర్ణయించుటకు సాధ్యము కాదు. హుళక్కిభాస్కరునికంటె మంత్రిభాస్కరుఁడు నన్నయభట్టునకు సమీపకాలమునాఁటివాఁడు. కావున నన్నయభట్టు ననుకరించినవాఁడు మంత్రిభాస్కరుఁడేయని నిర్ణయింప వలయునని కొందఱందురు. కాని యావాదమునందు బలములేదు. హుళక్కిభాస్కరుఁడట్టి గద్యను వేసికొనియుండఁడని తలంచుట కవకాశము లేదు. యుద్ధకాండమును హుళక్కిభాస్కరుఁడు పూర్తిగ

రచింపఁబోవుటచే నాతఁడు గ్రంథమును వేసికొని యుండలేదు. అది పూర్తియై గ్రంథమును వేసికొను నవకాశము గలిగిన నెట్లు వ్రాసి కొని యుండునో యెవరు చెప్పఁగలరు?

అరణ్యకాండాశ్వాస విభజనము:

అరణ్యకాండము మొత్తము ౭౩౮ పద్యములు. ఇందు మొదటి యాశ్వాసమున ౨౯౮ పద్యములును రెండవ యాశ్వాసమున ౪౪౦ పద్యములును గలవు. హుళక్కి భాస్కరుఁడు యుద్ధకాండమున ౧౧౩౯ పద్యములను రచించి యుండియు నాశ్వాసవిభాగము చేయలేదు. అరణ్య కాండము ౭౩౮ పద్యములే యయ్యును రెండాశ్వాసములుగా నున్నది. ఇందువలన, అరణ్యకాండ యుద్ధకాండకర్తలొక్కరు కారని తలంచుట కవకాశము గల్గుచున్నది. యుద్ధకాండ మంతయు రచింపబడినపిమ్మట నాశ్వాసవిభజనము చేయవచ్చునని హుళక్కిభాస్కరుఁడు తలంచి యుండవచ్చు ననియు; నది పూర్తి కాకపూర్వమే యాతని రచనమాగి పోవుటచే నాశ్వాస భజన కార్యముకూడ నాఁగిపోయెననియుఁ గొందఱు సమాధానము చెప్పుచున్నారు. హుళక్కి భాస్కరుఁడు రచి యించుచున్నది స్వతంత్రగ్రంథము కాదు. వాల్మీకిరామాయణమున కాంధ్రీకరణము. సంస్కృతరామాయణమున నధ్యాయ విభజనమున్నది. తన కుచితమని తోఁచిన్ని యధ్యాయముల నాంధ్రీకరించినపిమ్మట నక్కడి కొక యాశ్వాసమని వ్రాసికొనుట సులభము కాని గ్రంథమంత యు రచించినపిమ్మట నాశ్వాసవిభజన మొకపనిగాఁ బెట్టుకొనుట సులభము కాఁజాలదు. ఆశ్వాసమున నైదుపద్యము లధికముగా గ్రంథ రచనా మధ్యమున వ్రాయవలసి వచ్చునని యాకారమునుఁ దుడిచినటు నిలిపియుంచెననుటలో స్వారస్యము లేదు. అరణ్యకాండమును హుళక్కి

భాస్కరుఁడు రచియింపలేఁడని నిర్ణయించుట కీయాశ్వాస విభజనవిషయ మొక గొప్పయాధారము కాఁబోయినను, అరణ్యకాండ యుద్ధకాండ రచయిత లిరువురా? ఏకవ్యక్తియా? యని నిర్ధారణము చేయుటలో నీయంశము తోడుపడఁగలదు. ఇట్టి విషయములలో నొకవ్యక్తి యొక గ్రంథమున రెండుపద్ధతుల నవలంబించి యుండఁడు కావునదీనిని బట్టి యారణ్య యుద్ధకాండ కర్తలు భిన్నులని మనము నిర్ణయింప వచ్చును.

### అరణ్యకాండకృతిపతి యెవ్వరు?

అరణ్యకాండమునందుఁ గృతిపతిని సంబోధించిన పద్యము లేవ యిన కృతికర్తను నిశ్చయించుటకుఁ దోడుపడునేమో చూడవలసి యున్నది. అరణ్యకాండ ప్రథమాశ్వాసమునఁ గృతిపతిని సంబోధించిన పద్య మిది:

క. శ్రీహిత నయవిలసిత వా
ణీహిత మృదువచన ధారుణీహితగుణ సం
దోహ త్రివిక్రమవిక్రమ
సాహస నగధైర్యసార సాహిణిమారా!

ఈపద్యమునకుఁ బాఠాంతరముగా వ్రాతప్రతియం దీక్రింది పద్యమున్నది.

క. శ్రీరమ్యస్థితి వదన ప
యోరుహ శుండాలగండయుగళితవిగళ
ద్ధారాళదానధారా
పారాప్లుత భవనహార సాహిణిమారా!

పాఠాంతర మనినప్పు డేదయిన కొన్ని శబ్దము లటునిటు నుండుట ధర్మము. ఇచ్చట పద్య మంతయు వేఱురీతిగా నున్నది. రెండు

పద్యములయందలి భావములును వేఱువేఱుగా నున్నవి.

రెండవ యాశ్వాసమునఁ గృతిపతిని సంబోధించిన పద్య మిది:

క. శ్రీరామాకుచ యుగళీ
హారిద్రోల్లసితవక్షహరిచరణపరో
దారాధ్యుఁడు మారయధర
ణీమహోత్తముఁడు సాహిణీతిలక మిఁకన్.

ఈ పద్యమే యించుకమార్పుతో నీక్రిందివిధమున బాలకాండ యందు ౨౫ వ పద్యముగా నున్నది.

క. శ్రీరామాకుచ యుగళీ
హారిద్రోల్లసితవక్షహరిచరణపరో
దారాధ్య! బుద్ధినిధిసుత!
సాహసహిత తేజ! ధీర! సాహిణిమారా!

రెండవయాశ్వాసాదిని సంబోధనముండుటకు బదులుగా ప్రథమావిభక్తి యుండుటయు, పాఠాంతరము లుండుటయుఁ జూడఁగా, నీపద్యములు కవివిరచితములుగాక, లేఖకులలో మఱియెవ్వరో సాహిణిమారుని సంబంధించు పద్యములను రచించి, యిందుఁ జేర్చిరని యూహింపఁదగియున్నది. బాలకిష్కింధకాండములలోఁ గూడ నిట్టి భేదములు గన్పట్టుచున్నవి. (ఇందునుగూర్చి మల్లికార్జునభట్టు చారిత్రమున విపులముగాఁ జర్చింపఁదలంచితిని.)

బాలకిష్కింధకాండాది పద్యములు సాహిణిమారయను పేరునను, కాండాంతపద్యములు శివునిపేరను గలవు. సుందరకాండాది పద్యము ముద్రితప్రతిలో సాహిణిపేరను, తాళపత్రప్రతిలో నీశ్వరుని పరముగను గలదు. రెండుప్రతులలోనుగూడ నా కాండాంతపద్యములు శివపరములుగనే యున్నవి. దీనినిబట్టి విలేఖకుఁడో మఱియెవ్వరో

అన్నికాండములకును సరిపడు నొక్కకంఠపద్యము లొక్కసారిగా సాహిణిమారుని సంబోధించుచు వ్రాసి, యదిచట నున్న పద్యములను దీసివేసి వానికిబదులుగా వీనినాదుక జేర్చియుండునని తోఁచుచున్నది. హుళక్కి భాస్కరుఁడు రచించిన యుద్ధకాండమున మొకటి పద్యము సాహిణిపరముగా నున్నది. అతఁడు సాహిణిమారుని కాలముననున్న వాఁడనుటయు నిజమే. కాని యీపద్యమునకు యుద్ధకాండమును హుళక్కిభాస్కరుఁడు సాహిణిమారుని కంకితము చేసెనని నిర్ణయించుటకుఁ దగినయాధారములు లేవు. యుద్ధకాండాది పద్యముకూడ బాలకిష్కింధ కాండాదిపద్యములవలెనె ప్రక్షిప్తమని నాయభిప్రాయము. (హుళక్కి భాస్కరకవి చారిత్రమున నీవిషయమునుగూర్చి వ్రాసెదను.)

బాలకాండాదులయందలి ప్రథమ పద్యములవలెనే ఆరణ్యకాండాది పద్యములుకూడ ప్రక్షిప్తములని నిర్ణయించితిమేని, యీ కాండములతో సాహిణిమారని సంబంధమును, దానితోపాటు హుళక్కిభాస్కరుని సంబంధమునుకూడ లేకుండఁబోవును. అవి ప్రక్షిప్తములు కాక వాస్తవముగా భాస్కరకవియే రచియించెనని తలంచినచో నాభాస్కరుఁడు హుళక్కిభాస్కరుఁడే కాని నిశ్చయింపవలసి యున్నది. ఈవిషయమును నిశ్చయించుట కాశ్వాసాంతపద్యము లేమయిన సాహాయ్య మొసఁగునేమో చూడవలసియున్నది. వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ప్రథమాశ్వాసాంతపద్యములు :

శా. పుణ్యుం డార్జితశౌర్యధైర్యమహిమస్ఫూర్తిస్ఫురద్వైభవా
గణ్యుం డాశ్రితజనానురంజితమహాకారుణ్యుఁ డుదాత్తశ్లాఘ్యసౌ
గుణ్యుం డన్వయవార్ధిచంద్రుఁడు రిపుక్షోణీశ్వరస్తోమితా
గ్రణ్యుం డాత్తశరణ్యుఁ డుజ్జ్వలయశోరమ్యుండు సౌమ్యుండిలన్.

క. వశీవిజితసురాచార్యుఁడు
చతురత్వ చతుర్ముఖుండు సదమలవృత్తా
యతపంకజలోచనుఁడును
శ్రీతవినుతగుణప్రధాన ధురీణుఁడు పేర్మిన్.

మాలిని. వితరణఖని యుద్యద్వీర్య ప్రభావో
న్నతుఁడు భుజబలాత్యున్నాకర విద్విడ్ధరిత్రీ
పతిహరణసమిద్ధ్యాభాగగణ్యుండు సంభా
వితపరిణతచిత్తోర్వీసురుం డొప్పె నెందున్.

ఈ మాలినీవృత్తము మాయూరునన్న తాళపత్రి ప్రతిలో నిట్లున్నది.

" వితరణఖని యుద్యద్వీర్యశృంగారలక్ష్మీ
యుతుఁ డురుభుజశౌర్యాఢ్యుండు విద్విడ్ధరిత్రీ
పతిహరణసమిద్ధ్యాభాగగణ్యుండు సంభా
వితపరిణతచిత్తోర్వీజనాధీశుం డొందుఁగా."

ద్వితీయాశ్వాసాంత పద్యములు:

శా. వైరిక్ష్మాతలనాథ పర్వతమహావజ్రాయుధుఁ ఘోరదు
ర్వారాంహఃపరిధిశాంతిదుస్సహతమిస్రప్రస్ఫురద్భాను గం
భీరాంభోనిధి ధీరతావిమలభూభృన్నాథు నత్యంత వి
స్తారోదారగుణప్రసిద్ధివరరాధాకృతు ప్రసన్నతు ప్రసన్.

క. లలనాజనవరభద్రుని
బలవిలసిత విమత రామభద్రుని నుద్య
త్సులభతరగుణోన్నిద్రుని
బలవిలసిత వినుత రామభద్రునిఁ బ్రీతిన్.

మాలిని. విభవజితసురేంద్రున్ విస్ఫురత్కాంతిచంద్రున్
శుభకరకరగాత్రున్ సూరిసంస్తోత్రపాత్రున్
విభుజననికరహృద్యుం బ్రాజ్ఞవిద్యానవద్యున్
సభయరిపుశరణ్యున్ సంభృతాగణ్యపుణ్యున్.

ఈ పద్యములలో నెచ్చటను సాహిణిమారుని పేరు గాని యాతని సూచించుచున్న యొక పదము గాని లేదు. అయోధ్యాకాండము సాహిణి కంకితము చేసినట్లా కాండాంతపద్యమునందలి “సాచమాంబాకుమారా” యను వాక్యము వలనఁ దెలియుచున్నది. అట్టి దారణ్యకాండమున నేమియును లేదు. కాని యీపద్యములలోఁ గృతిపతి పేరు చెప్పకున్నంతమాత్రమున నాగ్రంథము సాహిణిమారని కంకితము కాలేదని నిర్ణయింప వీలులేదు. ఆశ్వాసాంతపద్యములలోఁ గృతిపతి పేరులేని గ్రంథములు పెక్కులున్నవి. పై పద్యములలోఁ నెవరిపేరును లేకుండుటయే యిందులకు నిదర్శనము.

ఈయాశ్వాసాంతపద్యములు దైవమును సంబోధించునవి కావు. ఒకప్రభువునుగూర్చి చెప్పిన వనుమాట సత్యము. అందలి వర్ణనము బట్టి ప్రభువి న్నిర్ణయము సేయఁజాలము. సాహిణిమారయ సేనాముఖ్య దళాధిపతిమాత్రమే యని యెంచినచో నాపద్యము లాతని కన్వయింపక పోవచ్చును. కాని యాతఁడు కూడ నొకచిన్న ప్రభువని యంగీకరించినచో నావర్ణన మాతనికిఁ నన్వయించును. కుమారరుద్రదేవుని యొక్క శాసనమున నట్టి సాహిణిమారయ యిరువదిగ్రామములు గల యొక దేశమునకుఁ బ్రభువని తెలియుచున్నది.

దీనినిబట్టి యాశ్వాసాదిపద్యములు ప్రక్షిప్తములు కావనియు నీకాండము సాహిణిమారయ కంకితమనియు, హుళక్కిభాస్కరకృత మనియు నిశ్చయింప వలసియున్నది. కాని యీనిర్ణయమునకు వచ్చు

నేని భాస్కరరామాయణారణ్యకాండకర్త మంత్రిభాస్కరుఁడని నిస్సంశయముగా నిర్ధారింపవచ్చును. కాని ఒకయపవాదము లేకపోలేదు. తిక్కనామాత్యునికంటె హుళక్కిభాస్కరుఁడే [illegible]ది సంవత్సరములు తరువాతివాఁడు. నిర్వచనోత్తరరామాయణమందలి పద్యములను జదివి హుళక్కిభాస్కరుఁడు భాస్కరరామాయణారణ్యకాండమున నీపద్యములను వ్రాసియున్నాఁడని చెప్పుట కవకాశముకలదు. కాని యీ యూహలు రెంటియందు నేది యుచితముగనుండునో పాఠకులు నిర్ణయించుకొనుఁగాక! తిక్కనామాత్యుని, హుళక్కిభాస్కరుఁ డనుసరించెనని చెప్పుటకంటెను, తిక్కన తన తాత ననుసరించినాఁ డనుటయే యుచితమని నా యభిప్రాయము. నిర్వచనోత్తర రామాయణమునందువలెనే, అరణ్యకాండ ప్రథమాశ్వాసాంతపద్యములు ప్రథమావిభక్తిలోను ద్వితీయాశ్వాసాంతపద్యములు ద్వితీయావిభక్తియందు నుండుటయు. భాస్కరరామాయణారణ్యకాండాశ్వాసాంతపద్యములలోని "సభయరిపుశరణ్యుఁ" "ఆర్తజనానురంజిత విహారకారణ్యుఁడు" అను వాక్యము లుత్తరరామాయణమున "చకితవృత్రశరణ్యుఁ" "ఆర్తజనతామతమంత్రుఁడు" అని మార్పుపొంది పడియుండుటయు విశ్లేయుభయగ్రంథములలోను శబ్ద వాక్య భావసామ్యము లుండుటయు, నారణ్యకాండకర్త తిక్కనామాత్యుని పితామహుఁడగు మంత్రిభాస్కరుఁడే యను నూహకు బలము నొసఁగుచున్నవి.

వాల్మీకి రామాయణమందలి యారణ్యకాండమును బూర్ణముగా నాంధ్రీకరింపక భాస్కరుఁడు సంక్షిప్తీకరించెను. హుళక్కిభాస్కరుఁడు యుద్ధకాండమును సంక్షిప్తము చేయలేక సరియేకదా మాఘకావ్యమందలి కొంతభాగము నాంధ్రీకరించి యుద్ధకాండమునఁ జేర్చెనని చెప్పుచున్నారు. నిజముగా హుళక్కిభాస్కరుఁడే యారణ్యకాండమును రచించియుండిన యెడల నాతఁడు దానినంత సంక్షిప్తము చేసియుండఁడు.

కావున నే నిదివఱకుఁ జూపిన యాశ్వాసాంతకర్త మంత్రిభాస్కరుఁడే యని తలఁచుట సమంజసము. మంత్రిభాస్కరుఁ డారణ్యకాండకర్తయైనచో నాయాశ్వాసాంతపద్యము లేప్రభువున కన్వయించును? అతఁడాగ్రంథము నెవరికిఁ గృతియిచ్చెను? అను ప్రశ్నలు రావచ్చును. మంత్రిభాస్కరుఁడు మనుమసిద్ధితండ్రియైన చోళతిక్కనృపాలున కాగ్రంథము నంకితము చేసియుండునని తలంపవచ్చును. మంత్రిభాస్కరుని కుమారుఁడైన సిద్ధయ చోళతిక్కనృపాలుని యొద్దమంత్రిగానున్నట్లు మనకు స్పష్టాధారములు కనఁబడుచున్నవి. తిక్కరాజు బాల్యమున సహపాఠుఁడును, నాతని నడిమివయసు మొదలు తుదవఱకును సిద్ధనయు నాప్తుఁడై యుండునని తలంచుటకు నవకాశములున్నవి. ఇది సత్యమైనచో చోళతిక్కనృపాలుని జననము శా. శ. ౧౧౧౦ ప్రాంతము. (వివరములకు తిక్కనసోమయాజి చరిత్రమును చూడుఁడు) కావున నీ రామాయణ రచనాకాలము క్రీ. శ. ౧౨౨౦ ప్రాంతమని నిశ్చయింపవచ్చును. అప్పటికి మంత్రిభాస్కరునకు ముప్పదినలువది సంవత్సరముల వయస్సుండియుండును. చోళతిక్కనృపాలుఁడు పండితుఁడనియుఁ గవిసార్వభౌముఁడనియు తిక్కన తన నిర్వచనోత్తరరామాయణమున జెప్పియున్నాఁడు. ఇంతే కాదు. ఈ మనుమభూపతి యాస్థానమున జక్కయకవి తాతయగు పెద్దయామాత్యుఁడను గొప్పసుకవి యుండి యనేక గ్రంథములను రచించెనని 'విక్రమార్కచరిత్ర'మున జక్కయ చెప్పియున్నాఁడు. అట్టివాఁడీగ్రంథమును గృతిగ నిచ్చెననుట యుచితమే యగును. పైనఁ జూపిన యాశ్వాసాంతపద్యములలోఁ "మతివిజితసురాచార్యుఁడు" "ప్రాజ్ఞవిద్యానవద్యుఁడు" అను పదము లీయంశమును ధ్రువపరచుచున్నవి. ఈవిశేషణములు మారయసాహిణి కన్వయించు ననుటకంటెఁ దిక్కరాజున కన్వయించు ననుటయే సమంజసము. మూలఘటికకేతనకవి తిక్కనను వర్ణించుటలో మంత్రిపదవి వంశానుగతముగా వచ్చుచున్నట్లు

చెప్పియుండుటచే నాతని పితామహుఁడగు భాస్కరుఁడు చోళతిక్కనృపాలుని మొదటిమంత్రిగా నున్నట్లు తలంచుటలోఁ దప్పులేదు. తిక్కన మనుమసిద్ధికి నిర్వచనోత్తరరామాయణము నిచ్చినట్లు, భాస్కరుఁడు తిక్కనృపాలునకు భాస్కరరామాయణమును గృతి యిచ్చియుండును. ఇంతేగాక మంత్రిభాస్కరుఁడు, తిక్కరాజుమంత్రియైన మనుమసిద్ధి పేరును తనకుమారునకును (సిద్ధన) తిక్కరాజు పేరును తనమనుమనికిని బెట్టియుండును అందుచే మంత్రిభాస్కరారణ్యకాండ కృతిభర్త చోడతిక్కరాజని తలంచుటలోఁ దప్పుండదు. అట్లయినచో నీవిషయమును దిక్కనగాని, కేతనగాని యేల చెప్పియుండలేదను ప్రశ్నకుఁ గర్తృత్వము గూర్చి వ్రాయఁబోవుటకుఁ బైఁజెప్పిన సమాధానమే సమాధానము భాస్కరరామాయణమునఁ గృత్యాది మనకు లభించియున్నచో, నీవిషయము స్పష్టముగాఁ దెలియుండును. గాని మన కట్టిస్పష్టము లభింపలేదు.

### భాస్కరరామాయణములోని పాఠభేదములు:

భాస్కరరామాయణమునఁ బాఠభేదములు విశేషముగాఁ గన్పట్టుచున్నవి. ఈ భాస్కరద్వయ వివాదమును బరిష్కరించుట కవి తోడపడునని తోఁచుటచే వానిని గూర్చి యిట చర్చించు టావశ్యకమగుచున్నది. ఆవిషయమును యోచించుటకు ముందుగఁ గొన్ని విషయముల నిటఁ జెప్పవలసియున్నది ఇప్పుడు మనకు లభించుచున్న భాస్కరరామాయణ ముద్రితప్రతి వావిళ్ళవారు క్రీ. శ. ౧౯౮౩ లో ముద్రించినది. ఈ ప్రతికి శ్రీమేడేపల్లి వెంకటరమణాచార్యులగారు విపులమైన టీకను వ్రాసియున్నారు. వావిళ్ళవారే భాస్కరరామాయణమును ౧౯౧౪ సంవత్సరములో నొకసారి ముద్రించి యాప్రతులన్నియు విక్రయమైపోఁగా ౧౯౮౧ లో మరల ముద్రించినారు. ప్రథమ ముద్రణ ప్రతికిఁ దరువాత ననేక తాళపత్రప్రతులను బరిశీలించి

లకును ఆరణ్యకాండమునందలి పాఠాంతరములకును విశేషభేదమున్నది. ప్రథమాశ్వాసములోని పద్యములందలి కొన్ని శబ్దములలో, పద్యభాగములో పాఠాంతరములుగ నుండుచువచ్చినవి. ఆరణ్యకాండమున నట్లు గాదు. పద్యములకుఁ బద్యములే పాఠాంతరములు. కొన్నితావులలో పద్యభాగములలోనే పాఠాంతరములున్నవి. ఈభేదముల నందలిపద్యముల నుదాహరించుచు నిటఁ జూపవలయునేనిచో నారణ్యపర్వ మంతయు నిట వ్రాయవలసివచ్చును. కావున నీభాగమును జదువు నప్పుడు వావిళ్ళవారు ౧౯౨౦ లో ముద్రించిన భాస్కరరామాయణప్రతిని దగ్గరనుంచుకొని చూడవలసియున్నది. అందలి పద్యసంఖ్యనుమాత్రమే యిట నుదాహరించెదను. ఈ సందర్భమున నేను కొన్ని భాస్కరరామాయణ తాళపత్త్రప్రతులను బరిశీలించితిని. అందుఁ గనిపించినమార్పులనుగూడ సందర్భానుసారముగా నీక్రింద నుదాహరించుచున్నాఁడను. సత్యము నెఱుంగ నుత్సహించుచున్నవారము కావున నేనీక్రింద నీయఁబోవు వివరములను జదువుటయందు విసువు జెందవలదని పాఠకమహాశయులను గోరుచున్నాఁడను.

ఆరణ్యకాండ ప్రథమాశ్వాసమున ౯వ పద్యమును దానిపాఠాంతరపద్యమును నీక్రింద నిచ్చుచున్నాఁడను.

క. నృపచూడామణి రాఘవుఁ
డమిత కోదండమహిషహరిభల్లూక
ద్వీపశరభచయగండక
విపులమహావిపినముఁ బ్రవేశించి తగన్. ముద్రితప్రతి.

క. కాకోలవ్యాకులమును
ఘూకాకులభీకరంబు ఘోరమృగవ్యా
ళాకరమును ఝిల్లీకన
దాకర్ణదుస్సహంబు నగు పెనడవిన్. పాఠాంతరము.

రెండవయోజనంబున శరభంగుండను మునీంద్రు నాశ్రమంబుగల దన టెక్కెఁ జనుఁడు మేలగునని చెప్పి పిశితాశనుండు రోఁజుచు బ్రాణంబులు విడిచె తదనంతరంబు" అని యున్నది. ఈమార్పువలన కథాసందర్భమున కేమియు లోటు వాటిల్లలేదు.

ముద్రిత ప్రతిలోని ౬౫ మొదలు ౭౦ వఱకుగల గద్యపద్యములకుఁ బదులుగా వ్రాఁతప్రతిలో నైదుపద్యములు కలవని యీపద్యముల నాపుటల యడుగున నిచ్చియున్నారు చూడుఁడు. ఈపద్యములు వేఱువేఱుకవులు రచించిన వని తలంపవలసి యున్నది. ఒక్కరు రెండువిధములగు పద్యములను వ్రాయవలసిన పనియుండదు.

ముద్రితప్రతిలో ౭౭ వ పద్యమునకుఁ దరువాత ౯౭ వ పద్యమువఱకు గల భాగము మాయూరినున్న ప్రతిలోలేదు. అందులకు బదులుగా నీక్రింది మూఁడు పద్యములున్నవి.

చ. అనఘుఁ డగస్త్యునమ్ముని మహామునిఁ గాంచి తదీయ మైనయా
శ్రమమున నాఁడు నిల్చి జనవల్లభుఁ డమ్మునిముఖ్యు భక్తి వీ
డ్కొని చని గాంచె కుంభజు బ్రఘూర్ణమహార్ణవపాస్తవాంతకాం
బునివహపూరితాఖ్య పరిపూరితవిస్తుల హస్తపంకజున్.

చ. కని కడుభక్తి మ్రొక్కుటయు, గారవమొప్పఁగఁ గౌఁగిలించి త
న్మానము మునుఁగొల్చియున్న మునిముఖ్యుల కెల్లను రామచంద్రు
విమలగుణావళుల్ ప్రకటవిస్తరభంగి గఁ జెప్పుచున్ బ్రియం
బునఁ గొనియాడు మన్ విబుధపూజలఁ దృప్తులఁజేసె నెమ్మతోన్.

క. జనవరునకు లక్ష్మణునకు
జనకసుతకు కందమూలశాకాదికమై
మునిమానసీయ మగు భో
జనమునఁ బరితుష్టిఁ జేసె సముచిత గతిన్.

ముద్రితప్రతిలోని ౧౦౭ మొదలు ౧౧౧ తుదవఱకు గల భాగము మాయూరనున్న ప్రతిలో లేదు. ఇది లేకపోయినను కథాసూత్రము తెగిపోలేదు. మఱియు ముద్రితప్రతిలో నున్న ౧౧౭ మొదలు ౧౩౨ వఱకుఁ గల గద్యపద్యములు నేనుఁజూచిన ప్రతిలో లేవు. ఈ భాగమున జంబుకుమారుని వధయు, నావధావృత్తాంతము నాతనితల్లి యగు శూర్పణఖతో మహర్షులు చెప్పఁగా విని యామె వనమున్న దిరుగుచుండుటయు నున్నది. ఈభాగము మొదట రచింపఁబడలేదు. తరువాత రచింపఁబడియుండును. కుమారుఁడు పోయె నన్నవిచారముతో నున్న శూర్పణఖ ౧౩౩వ పద్యమునఁ జెప్పినట్లు "ఎత్తిన వేడ్క నచ్చటికి నేఁగి" యుండదు. ఈనూతన రచన యీసందర్భమును బాగుగా కలుపలేదు. ఈకథ వాల్మీకరామాయణమున లేదని పీఠికాకారులు వ్రాసియున్నారు.

ముద్రితప్రతిలోని ౧౪౩ పద్యమునను న్న "వెంకియుఁగా" అను మాటకుఁ బదులుగా 'చెప్పినన్' అనియున్నది. ౧౪౪-౧౪౫ పద్యములు నేను చూచినప్రతిలో లేవు. ౧౫౧ మొదలు ౧౫౫ వఱకు గల పద్యములకుఁ బదులుగా నేనుచూచిన ప్రతిలో నీక్రింది పద్యమున్నది.

చ. అవని చలింప నైజవిశ్వతాకృతిఁ గైకొని పేర్చి సీతపైఁ
గవిసిన చేయి మాటిడుచుఁ గ్రమ్మున లక్ష్మణు దీనిఁబట్టి యుం
గవకలఁ జేయు మన్న నురుగాఢరుషంబునఁ గోసె ముక్కుచుం
జెవులును గ్రూరభావిలసిల్లు కఠారమునన్ గతోగ్రతన్.

ముద్రితప్రతిలోని ౧౬౦-౧౬౧ పద్యములకుఁ బదులు యీ క్రింది పద్యము తాళపత్రప్రతిలో నున్నది.

క. వేదవాగాయతసత్త్వుల
వదనలవుర దనుజభటులఁ బిలిచె ఖరుండు

మ్మోహిత వెసఁదెరువు వెట్టఁగ
సచివులు జని చెనకి రుగ్రమగు రభసమునన్.

ముద్రితప్రతిలోని ౧౬౭-౧౯౦ వఱకుఁగలపద్యములకు మాఱుగా వ్రాఁతప్రతియందు ౧౦ పద్యములు మాత్రమున్నవి. అవి ముద్రితప్రతిలో నడుగుఁ జూపఁబడినవి. ౧౯౩ ౧౯౯ వఱకుగల పద్యములకు మాఱుగా వ్రాఁతప్రతిలో ౭ పద్యములు వేఱుగానున్నవని యాపద్యము లాపుటలలో నడుగున జూపఁబడినవి. ఈయడుగున చూపఁబడిన పద్యములలో "కాంచనరత్నదీప్త" యను పద్యమునకుఁ దరువాత నేనుచూచిన తాళపత్రప్రతిలో నీక్రిందిపద్య మొకటి యధికముగా నున్నది.

ఉ. నిర్మలహేమబంధు రమణీయము గాఁ దగు నైనసుస్ఫుర
ద్ధర్మము దాల్చి దీప్తపరిదారితవహ్నియుఁ బోలె దివ్యుఁడై
కార్ముక మెక్కు వెట్టి గుణకంకణ...కృతుల్ సమస్తది
క్కర్మములఁ బగుల్చుచు సమర్థుఁడు రాముఁడు నిల్చె నయ్యెడన్.

ముద్రితప్రతిలోని ౨౧౪ మొదలు ౨౪౪ వఱకు గల గద్యపద్యములకు మాఱుగా వ్రాఁతప్రతిలో ౨౪ గద్యపద్యములు గలవని యాపద్యముల నాపుటల నడుగునఁ జూపియున్నారు. ౨౬౧-౨౬౪ పద్యములకుమాఱుగా వ్రాఁతప్రతియందొక్క పద్యము కలదని దాని నడుగునఁ గనుపించియున్నారు. ౨౬౬-౨౭౯ వఱకుగల పాఠమునకు మాఱుగ వ్రాఁతప్రతియందు ౬ పద్యము లున్నవని వాని నాపుటయడుగునఁ జూపియున్నారు. ఈ తొమ్మిది పద్యములలోని "ఆనరనాథముఖ్యు" డను పద్యమునకుఁ దరువాత నేనుచూచిన తాళపత్రప్రతిలో నీక్రిందిపద్యమున్నది.

ఉ. ఆ నరనాథు కేలు దొనఁ ద్రై విగుడించుట యమ్మహార్ణవసం
ధానము సేఁత నాతఁ డెగఁ దార్కొని లక్ష్యము సేయఁ జేయుటన్

ౘ గాన సజన్మియుఁ దళితకార్ముక మొక్కటిగంటిఁ గంటిన
ద్దానవదీప్తదేహసముదాయ నిరంతరపాతవేగముల్

మఱియు దానిక్రింద నే యున్న "అనిఎలికి" యను కంకపద్యము తరువాత ౨౮౦ వ పద్యమునకు ముందును నీక్రింది రెండుపద్యములు నున్నవి.

స్రగ్ధర. కాంచీయానంబు నప్పున్ గతినవలతికా కాంతమాంగంబుచందం
బురజించున్ మద్దుమోము బుహూాస్వకులంబోలు కన్నుల్
విపంచీ స్వరసంకాశబు పల్కుల్ చలనవివశతనీ వృద్ధిమై
యుండు వేణీధర మాతన్వంగి కింద్రప్రముఖ నిఖిలదిక్పాలకాభీల
శౌర్యా.

చ. అలినిభవేణి, చంద్రసదృశాననః యుత్పలపత్రనేత్ర; కో
మలలతికాభిరామభుజ; మంజులవక్త్ర; సమస్తనద్వయీ
కలిత; సుమధ్య; హృద్యకటి; కామ్యతరోరువు; రమ్యజంఘ; యు
జ్జ్వలచరణాబ్జ; లెక్కసితజానకినాఖిలసిల్లు రావణా!

ముద్రితప్రతిలో ౨౮౦–౨౯౧ పటులుగల భాగమునకు మాఱుగా వ్రాతప్రతిలో ౬ పద్యములున్నవి వాని నాపుటల యడుగునఁ జూపినాను. ఇ తటులు ప్రథమాశ్వాస మయినది. ద్వితీయాశ్వాసమునఁ గూడ నిట్టి భేదములే కలవు గ్రంథవిస్తరభీతియు, పీఠికలపుటలలో గాతకులకు విసువుఁ జెందుదురేమో యను సంకోచముండినను సత్యాన్వేషణకు గడంగువారికిఁ దోడుపడు నవుద్దేశముతో నా భేదములను గూడ నీక్రిందనిచ్చుచున్నాఁడను.

ముద్రితప్రతిలోని ౬ మొదలు ౧౮ వఱకు గల పద్యములకు మాఱుగా వేఱమూచిన ప్రతిలో నీక్రింది రెండుపద్యము లున్నవి.

క. ఈ పథమున రామచంద్రుని
సేనం దోరంబు ముప్పగ ముగ్గమెసఁగఁ బులులన్నై
ప్రాణి కథింపఁగ నని చని
యానరపతి వంత నంత చేకుటయున్,

క. శరములు మూఁడో ముష్టిన్
దిరముగఁ దొడిగేయువారు ద్రెళ్లి వెస నే
సూఁగి యట వచ్చి ఘనభాగు
పరవశగతి నన్నవాఁడ పటుశౌర్యనిధీ!

ముద్రితప్రతిలోని ౨౩ వ వచనంబున 'జనిరె' యనుదానికిఁ బిదపమున్న వచనము నేను చూచిన ప్రతిలో లేదు. మఱియు ౨౮వ సీస పద్యమునకు మాఱుగా నీక్రింది గీతపద్య మున్నది.

గీ. ఇవ్విధంబున నరిగి రాజేంద్రచంద్రుఁ
డున్న కదలీవనంబును బొయ్యఁ జేరి
యచట రాజును నిలిపి మాయామృగంగ
మగుచు మారీచుఁడుండె దీప్తు లతిశయింప.

ముద్రితప్రతిలోని ౩౬—౩౭ పద్యములకు నడుమ నీక్రింది పద్య మున్నది.

క. వ్యాఘ్రముగాని వేగంబున
జగతీశ్వర నీవు వచ్చి సమ్మతితోడన్
దగ నాకిచ్చిన వేడుక
సొగడంగా వలదె నేను నీకరుణముగన్.

ముద్రితప్రతిలోని ౩౯—౪౩ పద్యములకు మాఱుగా మాయొద్ద నున్న తాళపత్రప్రతిలో నీక్రింది నైదుపద్యము లున్నవి. ౩౮ వ వచనములోని "మండె వెండియు రఘువరుండు" అనుటకు మాఱుగా "మండి వెండియు పిల్లనిరొ" అని యున్నది.

క. కనకప్రవేశము కల్గవు
తనరుచులం గలుగుమృగము ధరణిం గలదే
జనవర యిది మాయామృగ
మగు దీని నెఱుఁగరాదె యసురుల మాయల్

చ. అన విని యన్నకన్నఁ జు ధరాధిపుఁ డెంతయుఁ బ్రీతి తమ్ముని౦
గను; గొని యామృగంబుపైఁ గౌతుక మెక్కుడుఁ బట్టి తేరే నేఁ
జనకిటు లూరకున్న మదిజానకి యెంతయుఁ జిన్నబోదె స
య్యన గొని యేఁగుదెంచెద గుణాకర! యేమఱకుండు మిర్యోర్ధరా

క. ఇది దనుజమాయ యనినన్
మదిసంశయ మేల మాయమాయించి శిత
పదిదంబున దుడిమెద నని
కదలెం బతి ఖడితూణ కార్ముకధరుఁడై.

చ. కదలి రఘూత్తముం డుగఁగఁగా నది ముందటఁ గొంతసేపటన్
మెసలుచు డాసినన్ శౌరి మీఁదికి నట్టిటు దాటుచున్ మృగం
బదె యిదె వాఁగ పొదల నివ్వల నివ్వలఁ దోఁచు చున్ రయం
బొనవఁగ వాగి డాయఁగొనివోయె విహాగవనంబు లోనికిన్.

మ. పరచుం దవ్వుల జేయు......నిలుచుం బట్టిక యాసాసగా
చిరువోవున్ బొదలందు డిందు నిలుచున్ బిట్టల్కి వే దాటి క్ర
మ్మరి చూచున్ వెలిదాల్పునిల్పు మఱియున్ వట్టాడగోరాడునే
మరి నట్లుండు తృణాంబులాను లయన్ మాయామృగం బిమ్ములన్.

మద్రితప్రతిలోని ౫౩-౬౦ పద్యములకు మాఱుగా నేను చూచినప్రతిలో యాక్రింది మూఁడుపద్యము లున్నవి.

క. తిరిగిఁ దిరిగి కడు దడవున
కరియుఁగ నిది దనుజమాయ యగు నని కోపా

స్వరుఁడై యా మోహమునమున
ధరణీశ్వరుఁ డేడ్చె శోకదారుణభంగిన్.

చ. ఇది మనసాయ మిర్వంగి దనుజాంగముసొచ్చి పగిల్చె వాఁడు బె
ట్టిదముగ వాఁడికి న్నొగసి చెప్పరనై కడుపొచ్చి తూలెఁ బెం
పొందలను మూకలుం బదియ భూమి చలి పఁగఁ గూలి వ్రాలె పె
ల్లడరుచు లక్ష్మణా! యనుచు హా! యని రాము నెలుంగు భంగిగన్

క. అని ఘోరంబుగ నరవుచు
దనుజుం డపు డాత్మమహాపథఁ బ్రడై పడియెన్
తన మేనిలో దరముఁడు
గనుగొని విలాంతి చాల గదిరెను దిలోన్.

ముద్రితప్రతిలోని ౬౮ ౬౯ ౬౬ కు మాఱుగా నీ క్రిందిపద్య మొక్కటియు నున్నది.

ఉ. భూపతి యాత్రిఁ బోఁడె నని భూమిజ తల్లడ మందె లక్ష్మణా!
పాపము వోదె లెమ్ము వెసఁ బోరుము రాక్షసబాధ నొందఁగా
నోపు రఘూత్తమాండు నిను నొత్తిలి జేరె శిశాలకోటిచే
నేపరఁ బోఁ దోలు పలుకేది జవంబున బొమ్మ్మ గన్ననన్.

మఱియు ౭౦–౭౮ పద్యములకు మాఱుగా నీ క్రిందిపద్య మొకటియుఁ నున్నది.

క. అనపుఁడు పేర్చినశోకం
బునఁ బెల్లేడ్చుచు మహాత్ముఁ బుణ్యచరిత్రున్
వనజేంద్రుఁ గావఁ బోవం
జనదే రాముసకుఁ దోడు చనవు రయమునన్.

మద్రితప్రతిలో ౭౭–౯౧ సంఖ్యగల పాఠమునకు మాఱుగా
వ్రాఁతప్రతియందు ౯ పద్యములున్నవని వాని నొప్పులయడుగున నిచ్చి

యున్నారు. వటితయు ౯౬—౧౦౦ పద్యములకు మాఱుగా నీ క్రింది పద్యమొకటియు నేను చూచిన ప్రతిలో నున్నది.

గీ. ఏను మెచ్చించు సుంగరుల్ వేనవేలు
విన్నఁ గొలువంగ ధన్యుఁనై నన్నుఁ జెందు
మనుజుఁ గాకింక పేదమన జాతోడ
మనువు నీకేల చనుదెమ్మె వనజవదన!

మద్రితప్రతియందలి ౧౦౩—౧౦౯ పద్యములకు మాఱుగా మా యొద్దనున్న ప్రతిలో నీక్రింది మూఁడుపద్యము లున్నవి.

గీ. అనిన నక్కోమలిగాఁ జూచి యాదశకుచు
వసురవింశతి బాహువులు నతిశయోగ్ర
వదనదశకంబు మెఱయంగ వామనయన
యెదుర నిలిచినఁ గంపించి యిల గొనుచు

క. తిరుగుచు పద వెనువెనకకు
పరుగఁగ పడిఁ బొరివిపట్టి యరదము పైఁ జె
చ్చెరనిడి యంబరపథమున
నరిగె దశాననుఁడు వికసితాననుఁడగుచున్.

ఉ. అత్తఱి సీత తల్లడిలి హా రఘునాయకా! హా నరేంద్ర! స
ద్విత్తరిగావ రమ్మనుచు నొత్తిలి యేడ్వఁగ వంక్తికంధరుం
డత్తరుణీ నరాంబరి భయంబడునట్లుగఁ జెల్లదప్పుచున్
తత్తఱపాటుతో నిజవిధంబు నధఃబునఁ దోలె నత్తఱిన్.

౧౧౨ ౧౧౩, ౧౨౮, ౧౩౩ పద్యములు నేఁజూచినప్రతిలో లేవు. ౧౮౮ మొదలు ౩౮౭ గద్యపద్యములవఱకు గల కథాభాగము వ్రాఁతప్రతిలో ౬౬ గద్యపద్యములలోఁ జెప్పఁబడినవి. ఇవి యాయాపుటల

ముద్రితప్రతియందలి ౩౯౩–౩౯౮ కు మాఱుగ నేను చూచిన తాళపత్రప్రతిలో నీక్రింది రెండుపద్యము లున్నవి.

గీ. ఇట్లు కూలిన దైత్యుఁ డొక్కింత వడికి
తెలివి తెలివొంది మీ రెవ్వ రీవు కౌశ్య
లార యనుటయుఁ జెప్పె సింపారఁ దను వి
ధము చెలియు కతయును సుమిత్రాసుతుండు.

క. విని రామలక్ష్మణుల రే
జనవంద్యులు మీరు మీ ప్రసాదంబున న
ఘ్నదశ మెల్ల వోయెను
పిదపఁ దన్మద్విపము మీకు వినుపింతుఁ దగన్.

ముద్రితప్రతియందలి ౪౦౭ మొదలు ౪౨౩ వ పద్యమువఱకు గల విషయమునకు మాఱుగా వ్రాఁతప్రతిలోని పద్యములను అపుటల యందుగనఁ జూపియున్నారు. ౪౨౪ మొదలు ౪౩౮ పద్యమువఱకును, మాయూరనున్న ప్రతిలో లేవు.

## పాఠభేదముల ఫలితము:

పాఠాంతరములగూర్చి పై నివ్రాసిన వాక్యములను స్థూలదృష్టితోఁ జదివినవారికి, అసంబద్ధాంశములఁ గలిపియుంచిరని కాక మఱి కొన్ని పద్యములను మఱియెవ్వరో రచియించి యుంచిరనియు, నది ప్రతివిలేఖకుల కృత్యమై యుండుననియుఁ దోఁచవచ్చును. కాని యుం దున్నదంతమాత్రమే యని తలంపరాదు. భాస్కరరామాయణ ముద్రితప్రతిని దగ్గరనుంచుకొని, పైని నేను వివరించిన మార్పులను గమనించుచు, జాగ్రత్తగఁ బరీక్షించి చూచినయెడల, మొదట నొకకవి రచించినభాగముతోఁ దృప్తిఁజెందక వర్ణనాంశముల నధికముగ జేయవలయునను నుత్సాహముతో వేఱొకకవి మఱికొన్ని గద్యపద్య

ములను రచించి నడుమనడుమఁ జేర్చుచు వచ్చెనన్న స్పష్టమగును. ఈవిధముగ గ్రంథభాగమును బెంపొందించునప్పుడు మొదటివాని రచించి న పద్యములందలి కథాసంగతముగఁ గన్పించెచో నట్టివాని నీరెండవ కవి తొలఁగించి యాపద్యములకు బదులుగఁ దాను క్రొత్తపద్యము లను రచియించెను. ముద్రితప్రతిలోఁ బాఠాంతరములుగ పుటలచివ గున నిచ్చిన పద్యములును. మఱియు నేను జూచిన తాళపత్రప్రతిలోని వనిపైని గనుపఱచిన గద్యపద్యములను గ్రంథభాగములలోఁ జేర్చి, వానికిఁ బాఠాంతరముగా గ్రంథభాగమునందున్న గద్యపద్యములను దీసి వేఱుగా నుంచినచో నీరెండవకవి పెంచి రచించిన గ్రంథభాగ మేదియో స్పష్టముగాఁ గన్పట్టును. ఆభాగమును మనము ప్రత్యేకముగా జదివి చూచితిమేని, జంబుమాలివధ మొదలగు కొన్నికథలు జేర్చు టకును, మారీచరావణ సంభాషణమువంటిను సీతాపహరణ సందర్భము నను, ద్వితీయాశ్వాసమునందు దుదిభాగమునను గథలను బెంచివ్రాయుట కును నీరెండవకవి ప్రయత్నించెనని బోధపడఁగలదు. ఆరణ్యకాండము న నిప్పటి ముద్రితప్రతిలో ౭౨౬ గద్యపద్యములున్నవి. ఇందులో దాదాపు ౩౯౦ గద్యపద్యములు మొదటికవి రచించినవి. వీనిలో నించుమించుగ ౨౧౦ గద్యపద్యములు నట్లేయుంచి మిగిలిన ౧౮౦ పద్య గద్యములను దీసివేసి వానికి బదులుగా ౫౧౬ గద్యపద్యములను క్రొత్తగా రచించి యందుఁ జేర్చెను. నేను వ్రాసిన యీవిషయము సులభముగా బోధపడుటకై యొక్క యుదాహరణమిచ్చెదను. శూర్ప ణఖ సీతాదేవిని మ్రింగబోవుటయు శ్రీరామచంద్రుడు దానికిచేయి యడ్డువెట్టి శూర్పణఖముక్కుఁ జెవులు కోయుమని లక్ష్మణున కాజ్ఞ యిచ్చుటయు నాతఁడట్లు చేయుటయు నొక్కపద్యములో నారణ్య కాండవు మొదటికవి చెప్పియున్నాఁడు. ఆపద్యమిది:

చ. అవని చలింప నైజవికృతాకృతిఁ గైకొని పేర్చి సీతపైఁ
  గవిసిన చేయి మాఁ డుడుచఁ గ్రమ్మెన లక్ష్మణ! దీనిఁబట్టి యం

గవిసలఁ జేయు మన్న ననుగాథరయంబునఁ గోసె ముక్కునుం
జెవులును గూఁరధారావిలసిల్లు కుఠారమునన్ గఠోరతన్.

ఈకథ నొక్కపద్యములోఁ జెప్పుట రెడవకవికిఁ దృప్తిఁ గల్గించ లేదు. ఈసందర్భమున మఱికొన్ని పద్యములను వ్రాయవలయునని సంకల్పించుకొనినాఁడు. కాని యాపద్యమును దీసివేసినఁ గాని యాతని కోర్కె యీడేరదు. అందుకొఱకు ఆపద్యమును గ్రంథమునుండి తొలగించి దానికి బదులుగా నీక్రింది రెండు వచనములను మూఁడు పద్యములను రచించి యందుఁ జేర్చెను.

"చ. కొఱవులపంక్తి మిడుమిడి గ్రుడ్ల నిప్పులు గాల దీప్తిఁ గ్రి
క్కిఱితి దమహోల్కనోహిణిఁ యింపలఱ రెంచిన మాడ్కిఁ జూపులన్
జెవులు జపించుచు నీవె యుతారవృత్తాలుఁ దొక్కచే
బిఱుసునఁ బట్టి నయ్యసుర బెల్కుఱ జాటసిఁ ద్రెంపి కొట్టెన్ ౧౫౧
ఇట్లు నిశాచరిం బట్టి లక్ష్మణుం గనుంగొని......౧౫౨

క. శూర్పణఖ దుష్టాత్ములు నగు
వారలతో నగవు లెప్పుడు వలవదు కంటే
నేరమి మనదేఁ గల్గుట
సీరక్షింప జనక తనయ కిమ్మాయఁబో సమయున్. ౧౫౩

వ. కావున దీని నింక విరూపింజేయు మనుటయు నా సుమిత్రా
పుత్రుఁడు...... ౧౫౪.

క. ఘోరక్రోధమున న
వ్వీరోత్తముఁ డాజ్ఞ నొక్కవేస నన్నక్త
చారిణి నప్పుడ పట్టి యు
దారంబున ముక్కు సెవులు దగ్గఱఁ గోయన్...... ౧౫౫

అరణ్యకాండ ప్రథమాశ్వాసము.

పై "అకనిపలింప" అనుపద్యమును రచించినవినియే యాంధ్రుడు పద్యములను రచించి యుండెననుట స్పష్టము. ఆపద్యమును దీసివేయుటయు దానికిబదులుగ నైరుపద్యములను దాను రచించిగాని, మఱియే రామాయణములోనివో తెచ్చి యందుఁజేర్చుటగాని విలేఖకులకు సాధ్యమనుగాదు. అవసరమును గాదు. ఇది కప్పక ఎవరో మఱియొక కవి చేసినకార్యమని చెప్పకతప్పదు. సారభేదములలో నేను పైనిఁ జెప్పినవానిలోఁ జాలభాగము మీయుదాహరణమును బోలియే యున్నవి. కొంచెమో హెచ్చుగనో బనిచేసినచో మొదటికవి రచించిన భాగమేదియో రెండవ కవి చేసినమార్పులేవియో మనము స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును.

అరణ్యకాండమున నీమార్పులకుఁ గారణములు:

అరణ్యకాండమున నీమార్పు లెవరివలనవచ్చినవని యాలోచింతము. దీనికి మూఁడు మార్గములు స్ఫురించుచున్నవి. ౧ ఇరువురుకవులు రామాయణములను రచించియుండిరనియు, నందొకరు క్లుప్తముగను రెండవవారు విపులముగాను జేసియుండిరనియు, రెండు గ్రంథములను జూచిన ప్రతివిలేఖకులు అందలివి కొన్నిటిని, నిందలివి కొన్నిటిని ఏర్చి చేర్చి కథను కలుపవలసినతావులలో నొకవచనముతో పద్యముతో తాను వ్రాసి కలిపిక స్వతంత్ర గ్రంథముగాఁ జేసియుండిరనియుఁ దలంచుట యొకటిమార్గము. ఈ యూహయందు బలము లేదు. విలేఖకుల కిది సాధ్యమైనపని కాదు. ఈమార్పును కవిచేయవలయును గాని విలేఖకుఁడు చేయఁజాలఁడు. విలేఖకుల కిది యవసర మగు కార్యమును గాదు. దీనివలన వారి కయ్యెడు ప్రయోజనము లేదు. గ్రంథమునంతయు జేయక యారణ్యకాండము మాత్రమే చేయుటవలన లాభమును లేదు. ఒక కవి రచించిన యరణ్యకాండము మాత్రమే వారికి లభ్యమగుటచే నరణ్యకాండమునందు మాత్రమే యట్టి మార్పులను జేసియుండురని తలంచినను అందలి ౨౦౦ పద్యములను దీసివేసి

వానికి బదులుగా ౫౦౦ పద్యములను జేర్చిరనుట స్వభావవిరుద్ధమును ప్రయోజనవిరహితమును నగుటచే నీయూహాయందు సత్యముండదని నిరాకరింపవలసి యున్నది. ఒకవేళ నిందు సత్యమున్నదని యంగీకరించినను ప్రస్తుతారణ్యకాండమున పరుషరి కవిత్వ మున్నదనుట నిశ్చయము.

ఆ మొకటికవి రచించిన గ్రంథమునఁ గొంత శిథిలమైపోఁగా నాతియొకఁడు దానిని పూరింపఁదలఁచి, శిథిలము కాకుండ నున్న భాగము నట్లేయుంచి, శిథిలమయిన భాగములను బూరించునప్పుడు తనయిష్టము ననుసరించి పెంచిరచించి పూరించెననియు, నదియే యిప్పుడున్న ముద్రితప్రతి యనియు, నటుపిమ్మట శిథిలమయిపోయినదన్న భాగము మరల లభించుటచేఁ గొన్ని తాళపత్రప్రతులలో నాభాగమే యుండుచు వచ్చెననియు నదియే పాఠాంతరముగా ముద్రితప్రతిలో నడుగున నీయఁబడిన దనియుఁ జెప్పవచ్చును. ఇది రెండవమార్గము. ఇదికొంత సయుక్తికముగాఁ గన్పట్టుచున్నను నీయూహకుఁగూడ బలము లేదు. మొకటికవి రచించినగ్రంథము శిథిలమైనదనుట కాధారములు లేవు. మాయూరనున్న ప్రతిలో, మొదటికవి రచించిన దని పైని నిరూపించిన భాగము పూర్తిగనున్నది. అందు కథాసూత్రమెచ్చటను తెగిపోక సమగ్రముగా నున్నది. ఆప్రతియందలి గద్యపద్యములను ప్రస్తుతముద్రిత ప్రతిలో గుర్తుపెట్టి చూచినయెడల, నీ రెండవకవి యెట్లు మార్చినదియు స్పష్టమగును. మొదటికవి రచించిన గ్రంథము శిథిలముకాలేదని యిప్పటి ముద్రిత ప్రతియే సాక్ష్య మిచ్చుచున్నది. శిథిలము సరిగా వర్ణనలు గలపట్టుననే యైనదని తలంచుట కూడ సమంజసముగా నుండదు. కావున నీ యుత్పన్నగాధ విశ్వాసనీయము కాదు. విశ్వసనీయమే యని యంగీకరించినను, నారణ్యకాండమున పరుష కవిత్వము లున్నవనుట నిశ్చయము.

3. దాదాపు ౪౬౦ పద్యములలో నొకటి చెప్పియుండిన యారణ్యకాండము, క్లుప్తముగా నున్న దనుకారణమునఁ దాను విపులముగా వ్రాయఁదలఁచి కథను బెంచుటకవకాశ మీయని మొదటి రచనములోని ౧౮౦ పద్యములను ద్రోసివేసి తక్కిన ౨౧౦ పద్యములను దీసికొని తాను ౫౦౦ పద్యములను రచించి యందుఁ జేర్చి మొత్తము కాండమును బూర్తిచేసియుండు ననిచెప్పుట మూఁడవమార్గము. ఈ వాదమునందుఁగూడ దోషము లేకపోలేదు. ౫౦౦ పద్యములను రచింపఁగలిగినకవి ౨౦౦ పద్యములనుగూడ దానేరచించి మొత్తము కాండమును బూర్తిచేయును గాని యిట్లు పులగ మేలచేయును? ఇట్లు చేయుట స్వభావవిరుద్ధముగాఁ గన్పించును. అయినను, పైని వ్రాసిన మూఁడు మార్గములలో నిదియే మేలయినదిగా గన్పించుటచేతను, నిందలి దోషమునకు సమాధానమిచ్చుట కవకాశ ముండుటవలనను నింతకంటె మార్గాంతరము స్ఫురింపకపోవుట మూలమునను, బలవత్తరమగు సాక్ష్యము లభించువఱకు నీయూహయందే సత్యమున్నదని భావింతము. ఆరణ్యకాండ ద్వితీయకవి యా కాండమును బెంచి వ్రాయఁదలయుననియే యుద్దేశించెనుగాని యాకాండమును దాను బూర్తిగ వ్రాయఁదలపెట్టలేదు. అందుచే నైదువందలపద్యములను వ్రాసిన యాతఁడు ౨౦౦ పద్యముల నేల రచింపకుండు నని ప్రశ్నించుకొనిన లాభము లేదు. ఇదియే యిందలిదోషమునకు సమాధానము.

మొత్తముమీఁద నేపద్ధతిలోఁ జూచినను, నారణ్యకాండమున నిర్వురికవిత్వ మున్నదని యొప్పుకొనక తప్పదు. ఈరెండు కవిత్వములొక్కటివే యనియు, మొదట క్లుప్తముగా వ్రాసి తరువాత నాతఁడే మఱికొన్ని పద్యములను రచించి యందుఁ జేర్చియుండవచ్చు ననియుఁ గొందఱనవచ్చును. ఇది సుసంగతము కాదు. తానదివఱకు కష్టపడి రచించిన రెండువందలపద్యములను దీసివేయుట కెవ్వఁడునంగీకరింపఁడు.

ముద్రితప్రతులయందును ననంఖ్యాక తాళపత్రప్రతులయందును నరణ్యకాండకర్త భాస్కరుఁడని గద్యమూలమున స్పష్టమగుచుండుటచే నీకాండకర్తలలో నొకస్థానము భాస్కరునకీయక తప్పదు. రెండవవానినిగూర్చి మాత్రమే మన మాలోచింపవలసి యున్నది. రచయిత పూర్వకవులలో పూర్వుఁడయితేనే రచయిత పూర్వుఁడగుట నిశ్చయముకదా! భాస్కరున కీయఁబడినస్థానము నధిష్ఠింపవలసినవాఁడు మంత్రిభాస్కరుఁడా? హుళక్కిభాస్కరుఁడా? యనునది తీర్మానింపవలసిన యొకసమస్య యైయున్నది. అరణ్యకాండాంత గద్యయందలి భాస్కరుఁడు హుళక్కి భాస్కరుఁడనియు నాతఁడే మొదటికవి యనియుఁ దలంచునెడల నాకాండమును దెంచివ్రాసినవాఁ డాతనికిఁ దరువాతవాఁడై యుండవలయును గదా. హుళక్కిభాస్కరునకుఁ దరువాత నయ్యలార్యుఁడు దక్క రామాయణరచయితలు గాన్పించుట లేదు. ఆతఁడు హుళక్కిభాస్కరుఁడు రచింపఁగా మిగిలిన యుద్ధకాండము తనువ్రాసితినని చెప్పికొనినాఁడు గాని యారణ్యకాండముతోఁ దనకు సంబంధ మున్నట్లు చెప్పలేదు. కావున నాఁ డాతనికి సంబంధమును గల్పింపరాదు. అందుచే హుళక్కిభాస్కరుఁ డారణ్యకాండమును రచించిన మొదటికవి కాఁడని నిశ్చయింపఁ దగియున్నది. ఇఁక నారణ్యకాండమును బెంపొందించి వ్రాసిన రెండవకవి హుళక్కిభాస్కరుఁడే యనియు, నాగన్న మూతనిదే యనియు, నొకవాదము రావచ్చును. ఈవాదము నిస్సారమైనది. ఆరణ్యకాండమునఁ దరువాతఁ జేర్పఁబడ్డభాగము లేకుండ మొదటికవి రచించిన ౪౦౦ పద్యములుగల తాళపత్రప్రతులలో, నిప్పటి ముద్రితప్రతులలో నున్నట్లే, భాస్కరునిగద్యమున్నది. కావున నాగద్యము మొదటికవిదికాని రెండవకవిది కాదని స్పష్టమగుచున్నది. ఇదియునుగాక హుళక్కిభాస్కరుఁ డారణ్యకాండద్వితీయకవి యనువాదము యుక్తియుక్తము కాదని యయోధ్యకాండముఁ గూర్చి వ్రాయునప్పుడు చూపెదను.

## మంత్రిభాస్కరుఁడే యారణ్యకాండ ప్రథమకవి.

ఆరణ్యకాండ గద్యమందు హుళక్కిభాస్కరునకు స్థానమేర్పడదు, దాని నధిష్ఠింపఁదగినవాఁడు మంత్రిభాస్కరుఁడు తప్ప వేఱొకఁడు లేఁడు. ఆస్థానము నెప్పుడైన హుళక్కిభాస్కరునకే యివ్వఁదలఁచి యెవ్వరైన యందులకై పట్టుపట్టి పోరాడినచో గద్యకై వేఱు వారితో గద్యమునకు దిగను. కాని హుళక్కిభాస్కరుఁడుగాక మిగిలినవారెవ్వరవి యొక్కరవి వారిని బహిష్కరించక మానను. గద్యయందున్నను లేకపోయినను కవిత్వమునందు మంత్రిభాస్కరుని స్థానమును నిలుపఁబెట్టి యాతనికి న్యాయము గలుగుటకై ప్రయత్నింపక మానను. ఆతనివిషయమున న్యాయము లేదనితోఁచినచో నాతనికై పెనఁగులాడను. మంత్రిభాస్కరునకుఁ గవిత్వమునఁ జోటులభించనేని గద్య యాతనిదే కాఁగలదు.

## మఱియొక భాస్కరుఁ డేల కాకూడదు?

ఆరణ్యకాండ గద్యమందలి భాస్కరుఁడు, హుళక్కిభాస్కరుఁడు గాకపోయినచో, మంత్రిభాస్కరుఁడే యేలకావలయును? మఱియొక భాస్కరుఁడు కాఁగూడదా? యని యెవరైన ప్రశ్నింపవచ్చును. ఆగద్యము మంత్రిభాస్కరునకు జెందినదా? లేక హుళక్కిభాస్కరునిదియా? యనియే యిదివఱకున్న ప్రశ్న! మఱియొక భాస్కరుని గూర్చి యోచింపవలసిన ప్రసక్తిలేదు, భాస్కరనామధారులు పెక్కురుండవచ్చును. ఆకాలమున నట్టికావ్యము నాంధ్రభాషలో రచియింపఁదగిన సమర్థత గల భాస్కరుఁడే మనకుఁ గావలయును. అట్టివా రెవ్వరును నాకుఁ గన్పడలేదు.

ముద్రిత భాస్కరరామాయణమునకుఁ టీక వ్రాసిన శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్య పండితులు పీఠికలో "దశగతులను గ్రంథమును

భాషాంతరీకరించి, సాహిణిమారుని కంకితము చేయుటచేత భాస్కరుం డను మహాకవి యొకఁడు సాహిణిమారుని కాలమున నున్నవాఁడనుట నిశ్చయము." అని వ్రాసియున్నారు వారే మఱియొకచోట "దీనిని బట్టి (సోమదేవరాజీయము) మాదిన మంత్రిభాస్కరుఁడును సాహిణి మారుఁడును సమకాలికులని తెలియుటయే కాక యొకచోట నున్నవారని గూడ స్పష్టమగుచున్నది." అని వ్రాసియున్నారు. దశగతులను గ్రంథము నాకు లభింపలేదు! దశగతుల కర్తయును, మంత్రిభాస్కరుఁడును, ఒక్కరో భిన్నులో ఆచార్యులవారి వాక్యములవలనఁ దెలియుటలేదు. ఆగ్రంథ మాంధ్రభాషలోనే రచియింపఁబడి యుండె నల యును. సాహిణిమారునను గూర్చియు భాస్కరునిఁ గూర్చియు ననేక విషయముల జర్చించియు, దశగతులలోనుండి యొకవాక్యము నైన నుదాహరింపక పోవుటచే శ్రీయాచార్యులవారికిని, ఆగ్రంథము లభింప లేదని యూహించుచున్నాఁడను. ఇంతకును శ్రీవారు తమపీఠికలో నారణ్యకాండ కర్తృత్వమును మంత్రిభాస్కరుని యందే యుంచిరి. కాని దశగతుల గ్రంథకర్తపైఁ బెట్టలేదు. రామాయణగ్రంథ కర్తృత్వ విషయమున నీవఱకెన్నఁడును దశగతి గ్రంథకర్త నామమును విని యుండఁగము. కావున నీసందర్భమున నాతనినిగూర్చి యాలోచింప నక్కఱలేదు. (దశగతులను రచించిన యాతఁడు మంత్రిభాస్కరుఁడని శ్రీ శలకమూరి వీరభద్రరావుగా రాంధ్రులచరిత్రమునను, శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు క్రీడాభిరామ పీఠికయందును వ్రాసియున్నారు. కాని వీరెవరు నాగ్రంథమును జూచియున్నట్లు కనఁబడదు.)

రామాయణభాగ రచయితలలో నొకఁడైన మల్లికార్జునభట్టునకుఁ దండ్రి) యగు భాస్కర సత్కవి యొకఁడున్నాఁడు. ఆతఁడు మంత్రిభాస్కరుఁడే యని యొకవాదమున్నది. అది సత్యమయ్యె నేని, యతని కరణ్యకాండమున స్థానములేదని పైని జెప్పియే

యుండెను అదిసత్యముకాక యీభాస్కరుఁడు వేఱని యందురేని యీవాదమునందు సారము లేదు. మల్లికార్జునభట్టు తనతండ్రి రామాయణమును రచియించెనని చెప్పలేదు. చెప్పకపోయినఁ బోవుఁగాక తండ్రి యారణ్యకాండమును గుమారుఁడు బాలకాండమును రచించిరని చెప్పినచో వీరిరువురు సమకాలికులని తేలునుగదా! అప్పుడు హుళక్కిభాస్కరుని కన్వయించిన సూత్రమే యీతనికి నన్వయించును. ఈతని మొదటికవి యందుమా, తరువాతికవి లభింపఁడు. రెండవకవి యందుమా మొదటిస్థానము మంత్రిభాస్కరునిదే.

హుళక్కిభాస్కరుఁడు గాని, దశకతుల భాస్కరుఁడు గాని సత్కవి భాస్కరుఁడుగాని యరణ్యకాండ రచయితలలో ప్రథముఁడని యెంచితిమేని, రెండవస్థానము మల్లికార్జునభట్టునకో, కుమారరుద్రదేవునకో, యియ్యవలసియుండును. వారిరువురు నరణ్యకాండమున కిరుపక్కల నున్న గ్రంథము రచించినవారు వారిని మించి మఱియొక రారణ్యకాండమును వ్రాసిరని చెప్పవలనుపడదు. వీరిరువురిలో నెవరో యొక రరణ్యకాండమును గూడ వ్రాసిరని నిశ్చయించితిమేని, పైని చెప్పిన మువ్వురకు నారణ్యకాండమున స్థానముండదు. వారు మువ్వురును వీరిరువురకు సమకాలికులు. సమకాలికులలో నొకరు స్వల్పముగ వ్రాయుటయు నింకొకరు పెంచి వ్రాయుటయు సంభవింప మల్లికార్జునభట్టు కుమారరుద్రదేవులకో నెవ్వరును. పైని జెప్పిన మువ్వురు భాస్కరులతో నారణ్యకాండ కర్తృత్వమున భాగమును పంచుకొనఁగేరరు. వారికి కాండమున భాగమీయఁ దలఁచితిమో, మంత్రిభాస్కరునికోడనే పంచి యీయవలసియున్నది. ఎట్లయిన మంత్రిభాస్కరునిఁ దొలఁగింపవలయునను నుద్దేశముతోఁ బైని జెప్పిన మువ్వురును గాక మఱియొక భాస్కరుఁడో, మఱియొక రామాయణ భాగరచయితయో యున్నాఁడని కాని, అయ్యలార్యుని తరువాత మఱియొవ్వ

కో యుత్తరభాగమును బెంచి వ్రాసియుందురని కాని వ్రాయింపవచ్చును. అట్టియూహ లాధారరహితములును నసంగతములు నగును. ఎవ్వరైన సహాయ్యముగాఁ దనవాదమును బలపరచి చూపునంతవఱకు, నారణ్యకాండమున నిరువురి కవిత్వ మున్నదనియు, నందొకటి మంత్రిభాస్కర రచితమనియు, నిస్సందేహముగా నిశ్చయింపవచ్చును. రెండవ కవిత్వ మెవ్వరి దను విషయమునుఁగూర్చి తరువాత వ్రాసెదను.

**మంత్రిభాస్కరుఁ డయోధ్యాకాండమునుగూడ రచియించెనా?**

మంత్రిభాస్కరుఁ డారణ్యకాండమును మాత్రమే రచియించెనా? మఱియేభాగమునైన రచియించెనా? యని యాలోచింప వలసి యున్నది. కొందఱుపండితు లరణ్యకాండమునమాత్రమే మంత్రిభాస్కరునకు సంబంధముండెనని నుడివియున్నారు. కావున నీవిషయ విచారణ మావశ్యకమైనది. ఏకవియును గ్రంథ మధ్యభాగమును విశేషించి యారణ్యకాండమును రచింప నారంభించి యుండఁడు. బాలకాండమును నయోధ్యాకాండమును నదివఱ కెవ్వరైన రచియించి యున్నచో నీతఁ డరణ్యకాండమును రచియించెనని చెప్పవచ్చును. కాని యట్టిది లేనప్పు డీతఁ డొక్క యరణ్యకాండమునే రచియించియుండెనని చెప్పరాదు. ఈతఁడు మొదటినుండియు, రామాయణమును రచియించెననియే చెప్పవలసి యుండును. ఈ సందర్భమున నయోధ్యాకాండమును బరిశీలింతము.

ప్రస్తుత ముద్రితప్రతిలో నయోధ్యాకాండమున గద్యపద్యములు ౮౪౦ యున్నవి. ఇందు ౧౨౦ గద్యపద్యములు వెంకటి ముద్రిత ప్రతికంటె హెచ్చుగానున్నవని పీఠికాకారులే వ్రాసియున్నారు. వెంకటి ముద్రితప్రతిలోఁగూడ గొన్ని యధికముగాఁ జేరియుండవచ్చును. మాయొద్ద నున్న తాళపత్రప్రతిలో ౧౬౭౭ గద్యపద్యము లున్నవి. వీనిని జదివి చూచితిని. కథాసూత్రమెచ్చటను దెగిపోవక

చక్కని శైలిలో ప్రౌఢముగా నున్నది. తాళపత్రప్రతికంటె నధికముగా నున్న పద్యముల సంఖ్య నిందిచ్చి పాఠకులకు విసువు జనింపఁ జేయ నక్కర లేకుండ ముద్రాపకులే సౌకర్య మొనర్చియున్నారు. తాము క్రొత్తగా జేర్చిన ౧౩౮ పద్యములను ముద్రితప్రతిలో [ ] నీవిధముగ గుర్తులించియున్నారు. ఇట్లు మార్పు చేయుటలో ముద్రాపకులు కొన్ని తావులందిచ్చటిచ్చట నచ్చటనిచ్చటఁ జేర్చియున్నారు. అట్టి వాక్యములు మంచివైనను బాధకములు కావు. తాళపత్రప్రతికంటె ముద్రితప్రతిలో నధికముగ జేర్చిన ౧౩౮ లోను మిగిలిన ౧౩ పద్యములును అయోధ్యా కాండాంతమున ౮౦౭ మొదలు ౮౧౩ వఱకు నైయున్నవి. ఈ పద్యములకు మాఱుగా నేను జూచిన తాళపత్రప్రతిలో నొక్క సీసపద్యము మాత్రమే కలదు. అది యిది:

సీ. అంత నక్కడ రాముఁ డచటికి భరతుండు
క్రమ్మఱ నిచ్చు సామ్రాజ్యమునకు
తన్ను రమ్మనుచుఁ బ్రార్థన సేయునో యని
చింతించి యాశ్రమోర్విఁ జిత్రకూట
మునఁగలమునిజనంబుల వీడుకొని మార్గ
తరువీక్షణంబునఁ గరము వేడ్కఁ
దనరి సీతాసుమిత్రాపుత్ర సమేతుఁడై దం
డకావనమహీస్థలికి నరిగె
వనఁగ నయోధ్యాకాండ మా నభిమతముగ
వినినఁ జదివిన వ్రాసిన విస్తరించి
చెప్పినను వారలకును సంసిద్ధి యొసఁగు
సంపదాయురారోగ్యముల్ సంభవించు.

(అరణ్యకాండాదిపద్యముతరువాత "అవధరింపుము" అని చేర్చి పిమ్మట దాని పద్యముతోఁ గలిపి చదువవచ్చును. ముద్రితప్రతిలోని

యారణ్యకాండము ప్రథమాశ్వాసము ౩౬వ పద్యమునకు ౧౧వ పద్యమును ౮౫వ పద్యమునకు ౧౩వ పద్యమును పునరుక్తిదోషమును గల్గించుచున్నవి మాత్రము ఇట్టివింకను గలవు

అయోధ్యాకాండమున మొదటి ౨౬౭ పద్యగద్యములను మాత్రమే రచించెననియుఁ బిమ్మట నెవ్వరో తిక్కనగ్రంథము జేర్చి పెంపొందించిరనియుఁ బైనివ్రాసిన వాక్యములవలన స్పష్టమగుచున్నది. అరణ్యకాండము వలెనే యీ పెంపొందించిన భాగము రెండవకవికృతమని నిశ్చయించుటకు సంశయింపనక్కర లేదు. అత్రిమహర్షి యాశ్రమంబున నడచినకథను జేర్చుటయు నచ్చటచ్చట మరికొన్ని కథలను జేర్చి పెంచి వ్రాయుటయు నీ రెండవకవి యుద్దేశము. ఈ భాగమును దీసివేసినను కథకు భంగము కలుగకుండ నడచుచున్నదని పాఠకులు గ్రహింపగలరు. ముద్రితప్రతిలోఁ గుండలీకరించిన భాగములోఁ బద్యభాగము కంటె గద్యభాగ మధికముగనున్నది. మఱియు, నయోధ్యాకాండమును రెండు ఖండములుగ విభజించితిమేని, పూర్వఖండమునఁ దాళపత్రప్రతిలో లేనిభాగ మధికముగను, నుత్తరఖండమునఁ నల్పముగను నున్నట్లు గన్పట్టును.

అయోధ్యాకాండాంత పద్యములు ముద్రితప్రతిలో నొకవిధము గను, కొన్ని తాళపత్రప్రతులలో వేఱొకవిధముగను నున్నవి. వాని నీక్రిందఁ జూపుచున్నాము.

ముద్రితప్రతి :

ఉ. రాజకిరీటకీలిత విరాజితనూతనరత్నరాజి నీ
రాజన మంగళాచరణరంజిత పాదసరోజ ఖడ్గధా
రాజయలబ్ధమానరుచిరద్యుతి మాన నిశాతకుంభవి
భ్రాజితసద్విశీర్ణ రిపుపార్థివఖండన కీర్తిమండనా!

యాశ్వాసాంతపద్యముల పోలికను బ్రథమావృత్తిలో నున్నవి. అరణ్య కాండాంత పద్యములో "వితరణఖని" యను సీపద్యములో "దానఖని" యనియు నుండుటనుబట్టి యారణ్యకాండ రచయితయు నయోధ్యాకాండ రచయితయు నొక్కఁడే యని యూహింపఁదగును.

కాని వ్రాసినవారిలో "మందారద్రుమే" త్యాది మూఁడుపద్యములును గల తాళపత్రప్రతియందలి గద్య అరణ్యకాండ గద్యవలెనే "సకలసుకవిజనవినుత" త్యాది భాస్కరకృతగద్యమే యున్నది. దీనిని బట్టి యయోధ్యాకాండము భాస్కరరచితమని స్పష్టమగుచున్నది. కేవలము గద్యయొక్కటియే యైనచో నది భాస్కరవిరచితమని నిశ్చయింపలేము కాని. యాశ్వాసాంతపద్యములు వేఱుగా నుండుటనుబట్టి యీ గ్రంథము ఇట్టి పద్యములుగలిగి వేఱుగా నుండుటవలనను అరణ్యకాండ రచయితలలోని మొదటి కవియు నయోధ్యాకాండ రచయితలలోని మొదటి కవియు నేకవ్యక్తి యని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. అయోధ్యాకాండ కర్తలను నిర్ణయించుట కరణ్యకాండమునకుఁ బడినంతశ్రమ యక్కఱలేదు. అయోధ్యాకాండ ముద్రితప్రతిలోని గద్య ననుసరించి, యొకస్థానమును గుమారరుద్రదేవునకును, తాళపత్రప్రతి గద్యనుబట్టి యొకస్థానము భాస్కరునకును నీయవచ్చును. కుమారరుద్రదేవుఁడు, హుళక్కిభాస్కర, దశగతభాస్కర. పత్నీవిభాస్కరులతో సమకాలికుఁడు కావునను, సమకాలికులలో నొకఁడు క్లుప్తముగ వ్రాసినదానిని మఱియొకఁడు పెంచి వ్రాయుట సంభవింపదు కావునను, అయోధ్యాకాండ కర్తృత్వము నిస్సంశయముగ మంత్రిభాస్కరునకు సంక్రమింపకతప్పదు. అయోధ్యారణ్యకాండ కర్త యొక్కఁడే కావున, అరణ్యకాండకర్త హుళక్కిభాస్కరుఁడను వాదము యుక్తియుక్తము కానేరదు.

## కుమారరుద్రదేవుఁడు గ్రంథచౌర్య మొనర్చెనా?

పై వివర్ణనమునుబట్టి యయోధ్యాకాండమును మొదట ౪౬౭ గద్యపద్యములతో మంత్రిభాస్కరుఁడు రచియించెననియు, పిమ్మట దాదాపు ౪౦౦ గద్యపద్యములను గుమారరుద్రదేవుఁడు రచియించి, యందుఁజేర్చి మొత్తమునకుఁ దనగద్య వేసికొనెననియుఁ దేలుచున్నది. ఇందువలనఁ గుమారరుద్రదేవునిపై గ్రంథచౌర్య మారోపించినవార మగుచున్నాము. ఇది న్యాయమా యని కొందఱడుగవచ్చును. ఎవరిపైనను గ్రంథచౌర్య మాపాదించు నుద్దేశము మాకు లేదు. తాము కనిపెట్టిన విషయములను సత్యాన్వేషణబుద్ధితో విమర్శించుచు లోకము నెదుట నుంచుట చరిత్రకారుల ధర్మము. ఆ ధర్మమునే మేమవలంబించితిమి. కుమారరుద్రదేవుఁడు, భాస్కరవిరచితములగు గద్యపద్యములను గ్రహించి, వానికి రెండువందల గద్యపద్యములను రచించిచేర్చి, తాను రచించిన భాగమును సాహిణిమారన కంకితముచేసి, తాను వ్రాసికొనిన ప్రతియందు, రెండుగద్యములును, రెండువిధములగు కాండాద్యంత పద్యములును వేసియుండును. తత్ప్రతి కాపి లేఖకులు కొందఱీ రెండువిధములగు వ్రాఁతలలో నొకదానిని విడిచివేసి తమయిష్టము వచ్చిన యొక గద్యను, ఒకవిధమగు నాద్యంతపద్యములను వ్రాసికొని యుందురు. అందుచేతనే కొన్నిప్రతులలో భాస్కరవిరచితకాండాంత పద్యములును గుమారరుద్రదేవుని గద్యయు నుండుట సంభవించినది. ఇట్టి యబ్బిబ్బులు కొన్ని కొన్ని తాళపత్రప్రతులలో యుద్ధకాండమునందుఁ దక్కిన దక్కిన కాండములయందుఁ గన్పట్టుచున్నవి. ఈయూహయందు సత్యముండెనేని, కుమారరుద్రదేవునియందు గ్రంథచౌర్య దోషముండదు.

## అరణ్యకాండ ద్వితీయకవి యెవరు?

అయోధ్యాకాండ ద్వితీయకవి కుమారరుద్రదేవుఁడని యనుకొన్నారము. అరణ్యకాండమును పెంచి వ్రాసినకవి యెవ్వరని యోచిం

పడలేయున్నది. ఇది కూడఁ గుమారరుద్రదేవుఁడుగాని మల్లికార్జునభట్టుగానియై యుండరని నా యూహ. వీరిరువురు తప్ప వేఱెవ్వరైన గావచ్చునని నా నమ్మకము. వీరిరువురిలో నెవ్వరో నిశ్చయించుటకు నాకాధారములు లభింపలేదు. కాని కుమారరుద్రదేవుఁడై యుండునని నా తలంపు. కుమారరుద్రదేవుఁ డయోధ్యాకాండ గద్యము మార్చినట్లారణ్యకాండగద్య నేల మార్పలేదని కొందఱడుగవచ్చును. ఆరణ్యకాండాంతగద్యలోఁ గూడ భాస్కరుపేరు గాక మఱియొకరి పేరు నుండియుండెనయేని, దానిని విలేఖకుఁడు దీసికొనియుండెఁ డనియుఁ దాళపత్రప్రతులం గను బరిశోధించినచో నవి బయటపడునవియు నా నమ్మకము. లేదా ఆరణ్యకాండమును దాను రచించినట్లు వేసికొనినచో నెవ్వఁ డేని మూఢుఁ డేమో యను భయముచేతను నా కాండమునఁ దాను కొంతభాగమును మాత్రమే వ్రాసియుండుటను మొత్తమంతయుఁ దాను రచించినట్లు ప్రకటించుకొని యాకీర్తినంతను దన నెత్తిపై వేసికొనుట కిష్టములేకయు భాస్కరుని గద్యము నీతఁ డవకవి మార్చకపోయి యుండును. భాస్కరారణ్యశేషమును రచించిన యెఱ్ఱాప్రగడ తనపేరున గద్యమును వ్రాసికొనక నన్నయపేరుననే గ్రంథము నుంచుటకుఁ గూడ నిదియే కారణమై యుండును. అంతటి మహాకవుల కిట్టి మూఢనమ్మకము లుండునాయని తలంపరాదు. గొప్పవాగరికులని చెప్పఁబోయెడివారిలో నిప్పుడుకూడ నిట్టి నమ్మకము లున్నవారు కలరు. ఆవిషయములనిటఁ దెలుపుట యప్రస్తుత ప్రశంసయగును. మంత్రిభాస్కరుఁడు ప్రతి కాండాంతమునను ఫలశ్రుతిపద్యము వ్రాసినట్లు కన్పట్టుచున్నది.

అయోధ్యాకాండ ఫలశ్రుతిని పైని వ్రాసియున్నాఁడను. అరణ్యకాండ ఫలశ్రుతి పద్యమిది:

సీ. ఆ సరోవరమునయందు నృపాత్మజు
లతిశయ స్నానపానాదివిధులు
ప్రియమునఁ జల్పి సంప్రీతాంతరంగులై
తత్సమీపోన్నత తరుచయంబు
శీతలచ్ఛాయ నాసీనులై విశ్రమించి
కొండొకడ వచట నిలిచి
సౌఖ్యంబు నొంది సత్సేవ్యమైన యీ
యారణ్యకాండంబు నర్థితోడ

గీ. వినినఁ జదివిన వ్రాసిన విస్తరించి
చెప్పినను వారలకు సౌఖ్యసిద్ధి యగును
సంపదాయురారోగ్యముల్ సంభవించు
సతతపుణ్యంబు లెప్పుడు ననుభవింత్రు.

బాలకాండఫలశ్రుతిపద్యము నాకు లభింపలేదు.

బాలకాండమున మంత్రిభాస్కరుని కవిత్వ ముండెనా?

అయోధ్యారణ్యకాండములయందు మంత్రిభాస్కరుని కవిత్వ మున్నదని నిర్ణయించినప్పటికి బాలకాండములో నాతనిరచన మున్నదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. కాని యా రెండుకాండములలోను స్పష్టముగాఁ దెలిసినట్లు బాలకాండమున నాతనిభేదమును దెలుపు తాళపత్రప్రతులు నాకు లభింపలేదు. నేనుజూచిన తాళపత్రప్రతులలోఁ జాలభాగము ముద్రితప్రతితో సమానముగనే యున్నవి. కాని యొక ప్రతిలో కొన్నిభేదములు గానవచ్చినవి. అందు మచ్చునకు మూఁడు పద్యముల నుదాహరించెదను. ఇట్టివింకను గలవు.

ముద్రితప్రతి:— (ఇదికూడా వ్రాతప్రతిలోనిదనియే ముద్రాపకులు వ్రాసి యున్నారు.)

వ. అప్పుడా రాఘవుల కగ్నిసన్నిధి నిగమోక్తప్రకారంబునఁ బాణిగ్రహణంబులు చేసి యగ్నిదేవునకు మునులకు దశరథ జనకులకు నమస్కరించి బహువిధాశీర్వాదంబుల విలసిల్లు నాసమయంబున,

ఈ యుదాహరణములనుబట్టి బాలకాండమునఁగూడ నిర్వచన కవిత్వమున్నదనియు నందొకఁడు మంత్రిభాస్కరుఁడనియు రెండవ యాతఁడు మల్లికార్జునభట్టనియు నిశ్చయింపవచ్చును. బాలకాండము ముద్రితప్రతిలో ౭౯౩ గద్యపద్యము లున్నవి. ఇందు ౪౦౦ గద్యపద్యములు మంత్రిభాస్కరుని వనియుఁ దక్కినవి మల్లికార్జునుని వనియు ననుకొనవచ్చును. అయోధ్యారణ్యకాండముల యందలి మంత్రిభాస్కరుని కవిత్వరీతినిబట్టి చూచినచో నాతఁడు కథాఘట్టములను గలుపుటకై స్వల్పవాక్యములతోఁ గూడిన వచనరచనమును దప్ప గద్యరచనమునందు విశేషాభిరుచి కలవాఁడు కాఁడనియు, కథాంశమును ప్రౌఢమైన శైలిలో రచించుటయం దెక్కువ యిష్టము కలవాఁడు కాని, వర్ణనాంశముల యందభిలాషకలవాఁడు కాఁడనియుఁ దోఁచగలదు. బాలకాండమున ౧౭ పెద్దవచనములును దాదాపు ౧౫౦ సామాన్య వచనములును. ౫౦ వఱకు కథఘట్టములను గలుపు చిన్న వచనములును గలవు. ఈ గద్యభాగమున నే స్వల్పసంఖ్యగల చిన్నగద్యములో దక్కఁ దక్కిన వన్నియు మల్లికార్జునుని రచనమని చెప్పవొప్పును. మొదటి ౨౫ పద్యములలో ౩వ పద్యము మాత్రమే భాస్కరునిదై యుండును భాస్కరుఁడు విశ్వామిత్ర చరిత్రము నంత విస్తరించి, చెప్పియుండఁడని నాయూహ. వాల్మీకి రామాయణములో లేని కొన్నివిషయములను మల్లికార్జునభట్టు, అధ్యాత్మరామాయణాదులనుండి యాంధ్రీకరించెనని పీఠికాకారులు వ్రాసియున్నారు. వాల్మీకిరామాయణమునే సంక్షేపముగా నాంధ్రీకరింపఁదలఁచినవాఁడు మంత్రిభాస్కరుఁడు. అట్టి యాతఁ డీపనికిఁ బూనుకొనఁడు కదా! బాలకాండమున మంత్రిభాస్కరునిపద్య

ను లేపో నిశ్చయముగాఁ జెప్పఁజాలము. కాని దిఙ్మాత్ర సూచకము గాఁ దెలిసికొనుటకై పై వాక్యములను వ్రాసితిని.

## భాస్కరరామాయణమున నవతారిక లేదేమి?

ప్రస్తుతము మనకు దొరకుచున్న ముద్రితప్రతులలోఁ గాని, తాళపత్రప్రతులలోఁ గాని, భాస్కరరామాయణమున నవతారిక లేదు. ఇందులకుఁ గారణమేమై యుండునని యాలోచింపవలసియున్నది. "ఏకవియు నవయిష్టదైవమునుఁ బ్రార్థింపకుండ గ్రంథారంభము జేయఁడు. మంత్రిభాస్కరుఁడు కృత్యాదిని రచియించియే యుండును. అది యాతని గ్రంథముతోఁ బాటుగ నశించియుండును." అని కొందఱనుచున్నారు కాని యీయూహ కొకబాధకము గన్పట్టుచున్నది. మంత్రిభాస్కర రామాయణ ముచ్ఛిన్నము కాలేదు. అయోధ్యారణ్యకాండములు యథామాతృకములుగా నున్న తాళపత్రప్రతుల లచ్చటచ్చట గన్పట్టుచున్నవి. అట్లే బాలకాండముగూడ యథామాతృకముగా నున్న ప్రతి యెన్నటికైన లభింపకమానదని నాయాశ. అది లభించెనేని యవతారిక యుండెనో లేదో నిశ్చయముగాఁ గనెదము. అంతవఱకు నీవిషయము నిదమిత్థమని నిశ్చయముగాఁ జెప్పఁజాలము. భాస్కరుఁడు కృత్యాదిని రచియింపలేదని యనుకొనుటకుగూడ నవకాశము కలదు. గ్రంథమంతయు రచించినపిదపఁ గృత్యాదిని రచించు నాచార మిప్పుడును మనలోఁ గలదు. భాస్కరుఁడుకూడ నట్లే తలంచియుండెనేమో! గ్రంథము సాంతము కాకపోవుటచేఁ గృత్యాది వ్రాయబడక పోయి యుండవచ్చును. పూర్వకవి ప్రణీతము లగు గ్రంథములలో నవతారికలు లేనివి కొన్ని కలవు. కృత్యాదిని వ్రాయకుండ కవులు చనిపోవుటచే నాతని తనయుఁడో శిష్యుఁడో దానిని వ్రాసి పూర్తి చేసిన గ్రంథములును గలవు.

భాస్కరుని కృత్యాది లేకపోయిన మానె మల్లికార్జునభట్టైనను నవతారిక వ్రాయలేదేమను ప్రశ్న రాకమానదు. దీనికిఁ దృప్తికరమైన సమాధానము గానరాలేదు. గ్రంథము నాయుఁ బూర్తియైనపిదప నవతారికను వ్రాయవచ్చునని తలంచినాఁడను సమాధానమిచ్చినను వర్తింపదు. ఏతఁడు వ్రాయఁదలఁచినది సుందరకాండాంతమునకును మాత్రమే అదిపూర్తియైనది. అవతారిక వ్రాయఁదలఁచినచో వ్రాయుటకావలసి నవకాశమున్నది. కాని యాతఁడు వ్రాయలేదు. మంత్రిభాస్కరుకవిత బాలకాండమునందుఁ దానుఁ గొంతగ్రంథము నధికముగఁ జేర్చుటమాత్రమే చేసి యుండుటచే గాబోలు నవతారిక వ్రాయవిష్టములేక మానివేసెనేమో చెప్పఁజాలము. కాండాంతపద్యములను గాబోలు శివపరముగ వ్రాసి వేఱుగఁ దనగద్యను వ్రాసికొనిన యాతఁడు కృత్యాదినేల వ్రాయకుండునని కొంత యనుమానము వచ్చును. అవతారిక వ్రాయఁదలపెట్టెనేని బాలకాండమునఁ దన కెంత ప్రసక్తి యున్నదనియు స్పష్టముగాఁ జెప్పవలసి వచ్చును. అందుచే నాతఁడు దానిని వ్రాయక యుండవచ్చును. మల్లికార్జునభట్టైనను గూడ గ్రంథచౌర్యమారోపింపలేము. అయోధ్యాకాండ రచనా విచారణ సందర్భమునఁ గుమారరుద్రదేవునిఁగూర్చి వ్రాసిన వాక్యములు మల్లికార్జున భట్టునకు గూడ ననువర్తింపఁ జేయవలసియుండును.

## కిష్కింధా సుందరకాండములలో మంత్రిభాస్కరుని కవిత్వమున్నదా?

మంత్రిభాస్కరుని కవిత్వ మారణ్యకాండముతో నాగిపోయెనని నిశ్చయింపఁజాలము. కాని మొదటి మూఁడుకాండములలోవలె నీ రెండు కాండములయందును నాతని కవిత్వ మున్నదని, నిరూపించుటకు దగిన సాధనములు లభ్యములు కాలేదు. కొన్ని తాళపత్రప్రతులయం దీరెండు కాండముల తుదిగద్యలు "శివ సకలసుకవిజనసుత"

మొదలుగా భాస్కరుని పేర నుండుటవలన, సుందరకాండాంతము వఱకును భాస్కరుఁడు రచించియుండవచ్చును; యుద్ధకాండమునఁగూడ గణింపదగని దేదో యొకభాగమో రచియించి యుండునని యూహింపఁ దోఁచుచున్నది. కాని తాళపత్త్రప్రతులలోని గద్యములను బట్టి యిట్లూహించుట న్యాయము కాదని కొందఱందురేమో! అవాదమునందుఁగూడ సత్యముండవచ్చును. ఎట్లయిన నీ విషయమున నింకను బరిశోధన మావశ్యకమయి యున్నది. ఈ కాండములలో నేను చూచిన తాళపత్త్రప్రతులకును ముద్రితప్రతికిని విశేషభేద గన్పట్టలేదు.

కిష్కింధాకాండాంత పద్యములలో ముద్రితప్రతియం దీక్రింది పద్యము కన్పట్టుచున్నది.

శా. లాటీచందనపంక చోళమహిళాలావణ్యసామగ్రిక
ర్ణాటీకేతకలాసరస్వతి కళింగాంతఃపురీవల్లికా
వాటీపంకరి గౌడవామనయనావక్షోజహారావళి
పాటింపఁదగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ.

ఈపద్యము సాహిణీమారయను సంబోధించుచున్నది. కాండాది పద్యమును గాండాంతమందలి మాలినీవృత్తమును శివపరములుగా నున్నవి. మల్లికార్జునభట్టు తనకవిత్వము నీశ్వరునకుఁ గృతియిచ్చె ననుట స్పష్టము. కావునఁ బైనిఁజూపిన శార్దూలవృత్త మిట నుండఁ దగినది కాదనియుఁ బ్రక్షిప్తమనియు నిశ్చయింపవలసి యున్నది. ఇంతే కాదు, సాహిణిమారన కంకితమైన యేయితర గ్రంథము నుండియో కొన్ని పద్యములను దెచ్చి భాస్కరరామాయణమున నెవ్వరో చేర్చియుందురను నూహ కలుగుచున్నది. హుళక్కి భాస్కరుఁడు దాంధ్రీకరించి సాహిణిమారని కంకిత మొసంగెనని చెప్పెడు నితరకృతులలోని పద్యములను లేఖకులిందుఁ జేర్చిరేమో! ప్రస్తుతముద్రితప్రతిని

బట్టి కిష్కింధాసుందరకాండములు మల్లికార్జునభట్టు రచితములనియు నిశ్చయాంకితము లనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. "ఇవి నిజముగా మంత్రిభాస్కరకృతములైనచోఁ గాండాంత పద్యములీశ్వర సంబోధనములుగాక యొకప్రభువును సంబోధించునవిగా నుండవలసియున్నది. అయోధ్యారణ్యకాండముల కట్టిపద్యములు మనకు లభించినవి. మల్లికార్జునభట్టు పేర నున్న మూఁడు కాండములకు నట్టిపద్యములు మనకు దొరకలేదు. దీనికే దేని ప్రత్యేక కారణ ముండి యుండవలయును. అయోధ్యారణ్య కాండములను మంత్రిభాస్కరుఁడు రచియించెనని మన మంగీకరించితిమేని, యాతఁడు బాలకాండమును రచింపకుండ నయోధ్యారణ్యకాండములను మాత్రమే రచియించి యుండఁడు. కావున బాలకాండమున నాతనిరచన మున్నదను నుపసిద్ధాంతము నంగీకరింపక తప్పదు. బాలకాండాంతమున మంత్రిభాస్కరుఁడు రచించిన ప్రభుస్తుతి పద్యములు మనకు లభించి, కిష్కింధాసుందర కాండాంత పద్యములు లభింపకపోయినచో నీరెండు కాండములయందు నీతని కవిత్వము లేదని యనుకొనవచ్చును. కాని బాలకాండాంతపద్యములు లభింపకపోవుటచే కిష్కింధాసుందర కాండాంతపద్యములు భాస్కర రచితములు నట్లే లభింపలేదనియు. నవి లభింపనంతమాత్రమున నా కాండములలో భాస్కరుని కవిత్వము లేదని నిశ్చయింపఁగూడదనియుఁ జెప్పవలసియున్నది. మల్లికార్జునని పేరనున్న మూఁడు కాండములలోను భాస్కరుని గద్యి యుండి యాతని కాండాంతపద్యములు లేకపోవుటకుఁ గారణము విలేఖకులై యుండవచ్చును.

అయోధ్యారణ్య కాండముల కవిత్వధోరణినిబట్టి చూచినచో మంత్రిభాస్కరుఁడు వాల్మీకిరామాయణమును సాధ్యమైనంతవఱకు స్వీకరించి యాంధ్రరామాయణమును రచింపఁదలపెట్టెననియు, మిక్కిలి పొడవుగల వచనములకు రచియింప నాతఁ డిష్టము లేనివాఁడనియు వర్ణ

నారీమలతో గ్రంథమునుఁ బెంచు నభిలాషకలవాఁడు కాఁడనియు తోఁచును ఈలక్షణములనుఁ గిష్కింధాసుందరకాండముల కన్వ యంటఁజేసి చూచినచో, బాలకాండమువలెనే యీ రెండుకాండముల యందునుఁ గొంత మంత్రిభాస్కరుని కవిత్వ ముండెననియు మల్లికార్జున భట్టు కాండములనుగూడ వర్ణనాంశములనుఁ బెంచియుఁ వాల్మీకి రామాయణమందు లేని "తార శ్రీరాముని శపించుట, లంకకేగి సీతావృత్తాంతమును గన గోరిన వానరులకు సంపాతి తనకుమారున కాజ్ఞాపించుట, హనుమంతుఁడు తన జననవృత్తాంతమును గజద్వయవధను జెప్పుట" మొదలగు కథలనుఁ జేర్చియుఁ బెద్దగాఁ జేసెననియుఁ దలంప నవకాశము గలుగుచున్నది. వాల్మీకిరామాయణమునఁ జెప్పినకథలనే సంగ్రహపరచి వ్రాయఁదలఁచిన భాస్కరుఁ డందు లేనికథలనుఁ దెచ్చి పెట్టినాఁడని తలంపరాదు. కిష్కింధాకాండమున దాదాపుగ నిరువదియుఁ సుందరకాండమున నిరువదియుఁ బెద్దవచనము లున్నవి. ఇవి యన్నియు మల్లికార్జునభట్టు పెంచి వ్రాసినవని నాయభిప్రాయము. కిష్కింధాకాండమున ౬౮౫వ సంఖ్యగల వచనమిందుల కుదాహరణము. ఈవచనమునుఁ దీసివేసినను గథాసూత్రము తెగిపోలేదు. ఈపెద్దవచనము లున్నతావులలో భాస్కరుఁడు స్వల్పసంఖ్యగల పద్యములనో చిన్నవచనములనో వ్రాసియుండునని నాయుద్దేశము. కిష్కింధాకాండమున నిప్పుడు ౮౩౦ గద్యపద్యము లున్నవి. ఇందులోఁ బద్యమధ్యమునఁ గథపట్టులను గలుపుటకై వ్రాయఁబడిన చిన్నగద్యములు దాదాపు ౧౮౦ కలవు. మిగిలిన ౬౩౦ పద్యములలోఁ గందములు ౩౫౦ సుందరకాండమున నున్న గద్యపద్యములు ౫౭౦ లోను, పైనిజెప్పిన రీతి గల చిన్నవచనములు ౧౧౦ పోను మిగిలిన ౪౩౦ పద్యముల లోను గందములు ౨౬౦. యుద్ధకాండమున నున్న గద్యపద్యములు ౨౭౦౦ లోను వచనములు ౪౨౫ పద్యములు ౨౨౭౫ లోనుఁ గంద

ములు ౨౦౦. కిష్కింధా సుందరకాండములయందు మంత్రిభాస్కరుని కవితయుండెగా లేదా యని విమర్శించునప్పుడీ రెండంశములు గమనింపఁ దగినవి. ఈ సంశయమునకుఁ బైఁ జెప్పిన యుక్తులలోఁ గొన్ని నిశిత విమర్శనమునకు నిలువలేక పోవచ్చును. కాని మొత్తముమీఁద యోచించి చూడఁగా కిష్కింధాసుందరకాండములలో మంత్రిభాస్కరుని కవిత యున్నదనియు, బాలకాండమువలెనే యీకాండములను గూడ మల్లికార్జునభట్టు పెంచి వ్రాసెననియుఁ దోఁచకమానదు. విశేష పరిశ్రమచేసి, పరిశోధన మొనర్చినచో నయోధ్యారణ్యకాండముల వలెనే, తక్కిన మూఁడు కాండములయందును భాస్కరుని కవిత యెంత యున్నదియుఁ దెలియఁగలదని నానమ్మకము.

## బాల- కిష్కింధాసుందరకాండములయందు భాస్కరునికవిత్వ మున్నచో నదియేల బయటపడలేదు?

ఈ ప్రశ్న కింకనుఁ దాళపత్రప్రతుల పరిశోధన మావశ్యక మని చెప్పుటతక్క వేఱు తృప్తికరమగు ప్రత్యుత్తరములేదు. ఈతాళపత్రప్రతులు లభించుటలోఁ గూడ నొకకష్టమున్నది. మల్లికార్జునభట్టుచేఁ బెంచి వ్రాయఁబడిన రామాయణప్రతులు ప్రచారములోనికి వచ్చినది మొదలు భాస్కరరామాయణప్రతులు మూలఁబడిపోయి యుండును. దీనికి కారణము, మల్లికార్జున రామాయణమున గ్రంథమొక్కటిగా నుండుట యుద్ధకాండముగూడ మల్లికార్జునభట్టు కాలముననె రచియింపఁబడి యుండుటచే, దానితోఁగూడ కలసినప్రతులను విలేఖకులు వ్రాసికొనుచు వచ్చిరి. అట్టులాచ్చులికిఁ దరువాత సమగ్రరామాయణమును విడచి, యసమగ్రముగ నున్న భాస్కరుని ప్రతుల నెవిలేఖకులును వ్రాసికొనియుండరుకదా! మల్లికార్జునభట్టునకుఁ బూర్వము వ్రాసికొనిన మంత్రిభాస్కరుని రామాయణప్రతులో లేక వాని ప్రతిక

లో ప్రతిప్రతులలో మనకు లభింపవలసియున్నది. అట్టివి లభించుట చాలదుర్ఘటము. అదృష్టవశమున నయోధ్యారణ్య కాండప్రతులు దొరికినవి. ఇట్లే తిక్కనమూర్తి కాండములునుగూడ లభించునని నా యాశ. ఇప్పుడు ముద్రితప్రతులు విశేషప్రచారములో నుండుటచేఁ దాళపత్రప్రతులను జూచువా రరుదుగా నున్నారు. అందులో మంత్రి భాస్కరుఁడు రామాయణకర్త కాఁడని యిదివరకు పండితులు సిద్ధాంతీకరించి యుండుటచే, నీవిషయమునఁ బరిశోధన మవసరము లేదని భావించువార లనేకులున్నారు. అందుచే సామాన్యముగా నీవిషయమును గూర్చి పరిశోధనము జరుగుటలేదు. నేను పైనివ్రాసిన యంశములను మనసునందిడుకొని తాళపత్ర పరిశోధనము గావింపవలసి యున్నది.

## భాస్కరరామాయణ పీఠికాకారు నభిప్రాయము

భాస్కరరామాయణ ముద్రిత ప్రతికిఁ బీఠికవ్రాసిన శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యపండితులు భాస్కరరామాయణములో మంత్రిభాస్కరునకుసంబంధము లేదనియు, హుళక్కిభాస్కరుఁడే రామాయణకర్త యనియు నిశ్చయించి యున్నారు. అందు వారు చూపిన యుక్తులకు గొన్నిటికి (వారివాక్యముల నుదాహరింపక పోయినను) సమాధానములను పైని వ్రాసితిని. కొన్నిటికి మఱి శాస్త్రవాది రామాయణకవుల చారిత్రములలో సమాధానముల నువ్రాయఁ బ్రయత్నించెదను. ఈసందర్భమునఁ బీఠికలో శ్రీ యాచార్యులవారి క్రిందివాక్యములను వ్రాసి యున్నారు

"ఈ రామాయణమునకు భాస్కరరామాయణమని కవిపేరుతోఁ గూడిన నామముతో వ్యవహారముండుటలో నొకవిశేషమున్నది. అది తొందియున వదవటి కొత్తరామాయణ మున్నట్లు సూచించుట. భారత

ముండఁగాఁ దరువాత జైమిని రచించిన భారతమునకు జైమినిభారతమని పేర్చిన శ్లోక గ్రంథముండఁగా మఱల రెండవదిపుట్టిన దాని సంజ్ఞకు గవిపేరు చేర్పుట లోకమునఁ వాడుకయయి యున్నది. దీనివలన నీ రామాయణమునకు మఱియొక రామాయణము మందుండవలసి యున్నది. అది యెఱ్ఱనకృత రామాయణ మని యూహింపవచ్చును. పింగళి సూరనార్యుఁడు భారతరామాయణ కథను జోడించి వ్రాసిన రాఘవపాండవీయములో:-

ఉ. ఏమెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దశుద్ధియుం దిరం
బై యనవద్యగం బగుఁగ నర్థ్యవచస్స్థితి భారతంబు రా
మాయణము రచించిన మహాత్ముల నాత్మఁ దలంచెదఁ జగ
ద్గేయుల నన్నపార్యుని దిక్కసుధీమణి నెఱ్ఱనార్యునిన్

అని రామాయణమును భారతమును రచించిన పూర్వకవులు వీరు మువ్వురే యని తెలిపియున్నాఁడు. ఈపద్యము తిక్కనకుఁబూర్వము మంత్రిభాస్కరునిచే రామాయణము రచింపఁబడి యుండలేదని తెలియఁజేయుటయే కాక భాస్కర రామాయణముకూడ మొదటిది కాదని సూచించుచున్నది. కాని ప్రతాపరుద్రుని కాల మందున్న భాస్కరుఁడు ప్రతాపరుద్రుని తరువాత రాజ్యమాక్రమించుకొన్న యనవేమారెడ్డి కాలములోని యెఱ్ఱాప్రెగ్గడకుఁ దరువాత నుండుట యెట్లు సందర్భించునను నంశ మాలోచింపవలసియున్నది. ప్రతాపరుద్రుని కాలములో భాస్కరుఁడున్నను నప్పుడు రామాయణమును రచించియుండలేదు. ప్రతాపరుద్రునితరువాత సాహిణిమారన రాజుకాగా నప్పుడు రచించెను. ప్రతాపరుద్రుఁడు కారాబద్ధుఁడైన తరువాత దత్సేనానాయకులు స్వతంత్రరాజులైరి. వినకొండకుఁ బోలయవేమారెడ్డియుఁ గొండవీడునకు సాహిణిమారనయు రాజులైరి. మొదటఁ బోలయవేమారెడ్డి

స్వల్పకాలము రాజ్యముచేసి మృతుఁడయిన తరువాత ననవేమారెడ్డి రాజయ్యెఁ గావున కొండవీడును సాహిణిమారుఁడు వినుకొండను వేమారెడ్డియుఁ బాలించుచుండఁగా భాస్కరరామాయణము పుట్టినది. ఇది పుట్టినప్పటికి భాస్కరపుత్రుఁడు గూడ గొప్పకవియై యున్నందునను భాస్కరుఁడుకొంతభాగమునే రచించియుండుటనుబట్టి, నీగ్రంథము భాస్కరుని ముసలితనమందు రచింపఁబడెనని యూహింపవలసియున్నది. ఇఁక ననవేమారెడ్డికడ నున్న రంగనాథరామాయణ మాతని యౌవన కాలమున నిర్మింపఁబడినది. అనవేమారెడ్డి కంకితము చేయఁబడిన హరివంశమునకుఁ బూర్వమే రామాయణము రచింపఁబడినట్లు హరివంశమువలనఁ దెలియవచ్చుచున్నది.

శా. "నాగమ్మంబు ఘనంబు మల్లరథినీనాథుండు విన్నాణపు
శ్రీతోడన్ సముపేతుఁ జేసి రొక్కం బిట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నుం దనియ, నేకావ్యామృత స్వాదనన్"

ఇతని గ్రంథములలో నిదియే మొదటిదని తోఁచుచున్నది. కావున నీ రెండురామాయణములలో నెయ్యది ముందుఁ బుట్టియుండ వచ్చును.

కాఁబట్టి పైని వ్రాసిన యుపపత్తులచే సర్వవిధముల నీరామాయణమును రచించినవాఁడు హుళక్కిభాస్కరుఁడే కాని మంత్రిభాస్కరుఁడు కాఁడని గ్రహింపవలయును."

శ్రీ యాచార్యులవారి యీ వాక్యములయందలి యంశములు చరిత్రకు విరుద్ధములుగా నున్నవి.

పింగళి సూరనార్యుని పద్యములలో శ్రీ యాచార్యులవారు చెప్పినంత యర్థము లేదు. కవిత్రయమును నుతించుటయే యాతని

యుద్దేశము. కాని రామాయణకర్తలను జెప్పుట యాతని తలంపు కాదు. కవిత్రయమువారు భారత రామాయణములను రచించినవారని మాత్రమే సూరనార్యుఁడు చెప్పును కాని, మంత్రిభాస్కరుఁడు రామాయణమును రచింపలేదని కాని భాస్కరరామాయణము మొదటిది కాదని కాని యాతఁడు చెప్పనుద్దేశింపలేదు. నన్నయ రామాయణకర్త కాఁడు. రామాయణకర్త యైన భాస్కరుఁడు తనకుఁ బూర్వుఁడైనను నాతని వదు నుతింపలేదు. ఈ యన్నియుఁ బట్టి యెఱ్ఱన రామాయణము మొదటిదని నిర్ధారణచేయఁ బూనుట వృథాయాసము. ప్రమాదభాగము.

ఎఱ్ఱాప్రగడ అనవేమారెడ్డికని కవిగా నుండి, రామాయణమును హరివంశము నతనికంకితము చేసె నటుపగా కాదు. హరివంశరచనము నాఁటి కనవేమారెడ్డి పుట్టెనో లేదో చెప్పలేము. పుట్టినను బదియేండ్ల లోపు వయసుకలవాఁడుగా నుండును. హరివంశకృతిపతి ప్రోలయ వేమారెడ్డి కాని యనవేమారెడ్డి కాఁడు. ప్రోలయవేముఁడు స్వల్ప కాలముమాత్రమే రాజ్యము చేసినవాఁడును గాఁడు. క్రీ. శ ౧౩౨౦ మొదలు ౧౩౪౯ వఱకు ముప్పదిసంవత్సరములు రాజ్యము చేసినప్రతిభాశాలి. అతనికిఁ దరువాత ననవేమారెడ్డి రాజ్యమునకు రాలేదు. ప్రోలయవేముని పెద్దకుమారుఁడైన యనపోతారెడ్డి క్రీ. శ. ౧౩౫౦ మొదలు ౧౩౬౧ వఱకు రాజ్యము చేసెను. అటుపిమ్మట క్రీ. శ ౧౩౬౨ మొదలు ౧౩౮౦ వఱకు ననవేమారెడ్డి రాజ్యమేలెను. ఈ కాలములో నెఱ్ఱాప్రగడ లేఁడు. భాస్కరరామాయణ మింతకుపూర్వమే రచియింపఁబడియుండెను. వాస్తవముచేత నెఱ్ఱాప్రగడ తనరామాయణమును క్రీ. శ. ౧౩౨౫—౧౩౩౫ మధ్యకాలమున రచియించియుండెను. (ఎఱ్ఱాప్రగడచరిత్రమును జూడుఁడు.) భాస్కరరామాయణ మంతకు పూర్వమే రచితమైనది. ఎఱ్ఱనరామాయణము మొదటిదగుటచే రెండవదగుటను: యీరామాయణమునకు భాస్కరరామాయణమని పేరువచ్చిన

దని శ్రీ యాచార్యులవారు సాధింపఁజూచిరి కాని, యందు సత్యము లేదు. అనవేమారెడ్డి కాలములో నెఱ్ఱనరామాయణము పుట్టినదను వాదము నంగీకరించినచో, భాస్కరరామాయణమే తప్పక మొదటి దగును. భాస్కరరామాయణమను పేరు కొంతకాలము గడచిన పిమ్మట వచ్చియుండును. కవిపేరుతోఁ జెప్పి చెప్పవలెనను మాత్రమున నదివఱ కాపేరుగల గ్రంథముండి తీరవలయునని నిశ్చయించుటయు, దానిని బట్టి వానిపౌర్వాపర్యములను నిర్ణయించుటయు న్యాయము కాదు. సుబోధముగా బోధపడుటకై కవిపేరుతోఁ జెప్పి లోకము వాడుచుండును. కొందఱు పండితులు భారతమును వ్యాసభారతమని వాడుట కలదు. ఎఱ్ఱాప్రగడ రామాయణ మిప్పుడు లభించెనేని లోకము దాని నెఱ్ఱాప్రగడ రామాయణమనియే వాడుదురు.

సాహిణిమారఁడు కొండవీడునుఁ బరిపాలించెననుటకుఁ జారిత్రకాధారములు లేవు. ప్రతాపరుద్రుఁడు క్రీ. శ ౧౩౨౩ లో బందీకృతుఁడయ్యెను. అటుపిమ్మట సాహిణిమారయ రాజయ్యెననియు, నాతని కాలములో రామాయణము పుట్టినదనియు నాచార్యులవారి యభిప్రాయము. అట్లయినచో, ౧౨౨౫—౧౩౩౦ ప్రాంతమున భాస్కరరామాయణము పుట్టియుండవలయును. అనవేమారెడ్డి రాజ్యకాలములో నెఱ్ఱనరామాయణము పుట్టెనన్న వాదము ననుసరించినచో నది క్రీ. శ ౧౩౪౦ ప్రాంతమగును. అది సత్యమునకు విరుద్ధము. ఎఱ్ఱన రామాయణము క్రీ. శ ౧౩౨౫—౧౩౫ నడుమ జన్మించినది. ఎఱ్ఱన రామాయణము కంటె భాస్కరరామాయణమే వయసునఁ గొంచెము పెద్దది. సాహిణిమారఁడు క్రీ. శ. ౧౩౧౧ కు పూర్వమే చనిపోయినట్లు శాసనాధారము లున్నవి. ఈవిషయమునుగూర్చి హుళక్కిభాస్కరుని చారిత్రమున వ్రాసెదను. ఎఱ్ఱనరామాయణము మొదటిదని నిశ్చయించుటకై ప్రతాపరుద్రునికిఁ దరువాత హుళక్కిభాస్క-

డుడు మహదేవాఁడుగా నున్నప్పుడు యుద్ధకాండమును రచియించెనని శ్రీ యాచార్యులవారు వ్రాసిరి గాని యవి యాధారరహితములైన యూహలు.

శ్రీ యాచార్యులవారు, వెంకోజీదొరవారు వ్రాసిన పుస్తకములో నన్నయభట్టారకుని సంబంధ సత్యమున్నదియు విమర్శింప కుండ పిడుగుల్లుంచోట దేవాలయములోఁ గూర్చుండి యామహాకవి (తిక్కనసోమయాజి) యీగ్రంథమును (మహాభారతమును) వ్రాసినట్లు భారతములోని "అనిపూని యాకృతంబులగు పుణ్యబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం బగుటం జేసి" అను వచనము వలన స్పష్టమగుచున్నది. కావున మొదటి ప్రతాపరుద్రుని కాలమున భారతము తెనిఁగింపఁబడిన దనియుఁ దిక్కన పండ్రెండవ శతాబ్దమువాఁడనియు దెలుపవలసియున్నది. ఇక దిక్కన తండ్రి పండ్రెండవశతాబ్దాద్యర్ధభాగమున నుండెననియు నతనితండ్రి యగు మంత్రి భాస్కరుఁడు పండ్రెండవశతాబ్దారంభమునను పదునొకండవశతాబ్దాంతమునను జీవించెననియు నూహింపవలసియున్నది." అని వ్రాసి యీ వాక్యములపై నాధారము చేసికొని రామాయణకర్త హుళక్కి భాస్కరుఁడని నిర్ణయించినారు. కాని యీ వాక్యములలోని యంశములు సత్యములని చరిత్రకారు లంగీకరింపరు. చరిత్రకు విరుద్ధములుగానున్న యీ యంశములను గూర్చి విశేషచర్చ చేయుట, అనవసరము. ఇట్టి యంశముల మీఁద నాధారపడిన శ్రీ యాచార్యులవారి యూహలును యుక్తులును వాస్తవమును దెలిసికొనుటకుఁ దోడుపడవు.

### భాస్కరోదంతము :

కవిజీవితకారులగు శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులు గారును, ఆంధ్రకవులచరిత్ర ప్రథమ ముద్రణమున శ్రీ వీరేశలింగము

పంతులుగారును, మంత్రిభాస్కరుఁడు రామాయణమునఁ గొంతభాగమును రచించియుండెనని యభిప్రాయపడియున్నారు. అందుపైని శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు భాస్కరోదంతమును ౭౮ పేజీల గ్రంథమున నీవిషయమును విమర్శించి భాస్కరరామాయణములో మంత్రిభాస్కరునకు సంబంధము లేదనియు హుళక్కి భాస్కరుఁడే రామాయణ గ్రంథకర్త యనియు నిరూపించియున్నారు. దానినిబట్టి తాఁబోలు శ్రీ వీరేశలింగముపంతులుగారు తమ యభిప్రాయమును మార్చుకొని కవులచరిత్ర రెండవ ముద్రణమున రామాయణకర్త హుళక్కి భాస్కరుఁడని వ్రాసియున్నారు

భాస్కరోదంతము క్రీ. శ. ౧౮౯౮ వ సంవత్సరమున ననఁగా దాదాపు యేబది సంవత్సరముల క్రింద ముద్రితమైనది. పంతులుగారి కవులచరిత్రము రెండవముద్రణమును, భాస్కరోదంతమును, జదివిన పిమ్మటఁగూడ నా యభిప్రాయము మారలేదు. మంత్రిభాస్కరుఁడు రామాయణములోఁ గొంతభాగమును రచించియుండెననియే నానిశ్చితాభిప్రాయము. భాస్కరోదంతము నందలి విషయములు కొన్ని సత్యమునకు విరుద్ధముగానున్నవి. ఎఱ్ఱాప్రగడ రచించిన రామాయణకృతికర్త అనవేమారెడ్డియని భాస్కరోదంతము తెలుపుచున్నది అది వాస్తవము కాదు. ఆరామాయణ కృతికర్త పోలయవేమారెడ్డి కాని యనవేమారెడ్డి కాఁడు. మంత్రిభాస్కరుని యొక్కయుఁ దిక్కనసోమయాజి యొక్కయు కాలమును భాస్కరోదంతము సరిగా నిర్ణయింపలేదు. ఇట్టివాని కన్నిటికిని వివరముగాఁ బ్రత్యుత్తర మీయవలసివచ్చినచో నది యొకపెద్ద గ్రంథమగును గావున నాపనికిఁ బూనుకొనలేదు. శ్రీపంతులుగారును, శాస్త్రిగారును చెప్పినయుక్తులకుఁ బైనివ్రాసిన పంక్తులలోఁ గొంతవఱకు సమాధానములున్నవి. మిగిలిన వానికి సమా

ధానములు మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుఁడు, హుళక్కిభాస్కరుఁడు, అయ్యలార్యుఁడు ననువారి చరిత్రములయందు వ్రాయఁ బ్రయత్నించెదను ఇంతకంటె భాస్కరోపసంశము నందలి ప్రతియుక్తికిని వాదమునకును సమాధాన మీయవలసిన యావశ్యకత నాకుఁ గన్పట్టలేదు.

### మంత్రిభాస్కరుని కాలము :

మంత్రిభాస్కరుఁడు పండ్రెండవశతాబ్ది నాల్గవ పాదమునను, పదమూఁడవ శతాబ్ది ప్రథమపాదమునందు నున్నాఁడని చెప్పవచ్చును. ఇతని నివాసము గుంటూరు అని తిక్కనయే చెప్పియున్నాఁడు. ఇతని వంశక్రమమును దిక్కన సోమయాజి చారిత్రమున నిచ్చుచున్నాఁడను. ఇతఁడు పండ్రెండవ శతాబ్దాంతమున నున్నవాఁడని భాస్కరరామాయణ పీఠికాకారులు వ్రాసిరి, కాని యది సరి కాదు. ఇతఁడు గుంటూరునకుఁ గరణమని కొందఱనుచున్నారు. ఆకాలపు గ్రామకరణములు ప్రభువునకు మంత్రులుగను దండనాయకులుగను కూడ నుండెడివారని యనేక దృష్టాంతములున్నవి. భాస్కరుఁడు మంత్రియుఁ గవియు దండనాయకుఁడునై యుండినట్లు నిశ్చయింపవలసియున్నది.

ఈవిషయముల నన్నిటిని బరికించి చూడఁగా మంత్రిభాస్కరుఁడు రచింపఁగా మిగిలినభాగము రచియించియు, రచియించిన భాగమును విపులీకరించియు సంపూర్ణరామాయణమును లోకమునకీయ వలయునని సంకల్పించుకొని హుళక్కిభాస్కరుఁడును మల్లికార్జునభట్టును గుమారరుద్రదేవుఁడును బనిచేసిరని యూహింపనగుచున్నది.

### భాస్కరరామాయణ పరిశోధనము :

మొత్తముమీఁద భాస్కరరామాయణమునుగూర్చి పరిశోధన మింకను నెక్కువగా జరుగవలసియున్నది. భాస్కరరామాయణ తాళ

పత్రప్రతులు గ్రామములలో విశేషముగాఁ గలవు. ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునందే దాదాపుగ నేఁబది ప్రతు లున్నవి. సాధ్యమైనయన్ని ప్రతులను సంపాదించి పరిశోధించినచోఁ బ్రస్తుతమున సందిగ్ధకారులనుఁ బండితులనుఁ గలవరపెట్టుచున్న యనేక శంకలకు సమాధానములు లభింపఁ గలవని నా యాశ. నేనారంభించిన గ్రంథ సమాప్తికై పాటుపడుచుండుటచే నేనా కార్యమునకిప్పుడు పూనుకొన లేకపోయితిని. ఆ కార్యభారమును వహింపవలసినవారు చారిత్రాసక్తు లగు ధనాధికులుఁ బండితులునై యున్నారు. భగవదనుగ్రహ ముండెనేని యాపరిశోధనభాగ్యము నాకుఁగూడ లభింపవచ్చును. కాలక్రమమున నాపరిశోధనము జరిగి పద్యము బయలుపడునని యు నందు మంత్రిభాస్కరునకు న్యాయము లభించునని యుఁ దలంచుచు నీతని చారిత్రమును ముగించుచున్నాఁడను.

పైనిఁజేసిన చర్చవలనఁ బట్టి అయోధ్యారణ్య కాండములయందు మంత్రిభాస్కరుని కవిత్వ మేదియో తెలిసినది. కావున నాతని శైలి తెలియుటకై కాండమునకు నాల్గువంతున నెన్నిక పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

అయోధ్యాకాండము :

ఉ. బంధులు మంత్రులుం భరతుఁ బట్టము రాముఁడు పెద్దవాఁడు స
ద్బంధుర దోర్బలుండు గుణశాలియు నా సుతుఁడండ్రు నా సుతుం
సింధుపరీతధాత్రి కభిషిక్తునిఁ జేయుమనె భూవిభుం డసం
బంధము గానఁ దీనికి నుపాయ మెఱింగినఁ జెప్పుమంధరా! ౧

శా. స్వచ్ఛందస్థితిఁ గీర్తి దిక్తటములన్ వర్తింప నేకాతప ౧౩౪
త్రచ్ఛాయుంబుగ భూమి యేలె రఘురక్షుం బున్నచోఁ ధర్మముం

త్రాఁటఁదిగిచికొనుచుఁ దలిరుఁ జొచ్చె.
(త్రాఁట పాయముఁదిగిచి తలిరుఁజొచ్చె)

శా. గంధర్వాశ్వసమాజ రాజుఁ జూచెఁ బతియుం గాదంబరిం జూచెఁ ద
ద్బాంధీభూతమనస్కుఁడై మరుఁడు విల్లదేఁ బ్రసూనోల్లస
ద్గంధం బొప్పఁగ నెక్కువెట్టి గుణనాదం బాచి పుష్పాస్త్రముల్
సంధించెం దెగఁబాపి యేయఁదొడఁగెన్ సవ్యాపసవ్యంబుగన్.

కస్తూరిరంగకవి తన రంగరాట్ఛందమునందుఁ బెదన కాదంబరిలోని పదిప్రాదియతికి లక్ష్యముగా నొక గీతపద్యమును, నభేదయతికి లక్ష్యముగా నొక శార్దూలవృత్తపాదము నిచ్చియున్నాఁడు. అవి యివి:

గీ. జనవరేణ్యుఁ గాంచి సాష్టాంగ మెఱఁగిన
నాశిభుండు వాని లేవనెత్తి
కౌఁగిలించి వానిఁ గనుఁగొని కేయూర
కాభిదాన మొసఁగెఁ గౌతుకమున.

శా. డాచే యంకతలంబుఁ జేర్చి వలచేతన్ మాలికన్ దాల్చి.

"బాణోచ్ఛిష్టం జగత్త్రయ"మ్మని కీర్తిం గాంచిన బాణభట్టమహాకవి సంస్కృతమున "కాదంబరి" యను మహాకావ్యమును రచియించి యుండెను. దాని నీతఁ డాంధ్రమునఁ బద్యకావ్యముగా రచియించె నని తలంపవలసియున్నది. కేతననామధారులు కవులు మూలఘటిక కేతన, నండూరి కేతన మొదలుగాఁ గొందఱున్నారు. కాని వారెవ్వరును భాస్కరుని తనయులు కారు.

తిక్కనసోమయాజి వంశమునఁ దిక్కనకుఁ బూర్వులు భాస్కరుని కేతన లిరువురున్నారు. వారిరువురును తాతయు మనుమఁడును. దశకుమార చరిత్రమున, తిరుపురిలోఁ దాతయైన కేతనను గవియని

చెప్పియున్నాఁడు. తాను నాకేతనయే కాదంబరీ కర్తయని నిశ్చయింపవలసియున్నది. దశకుమార చరిత్రము నీ కేతనను వర్ణించిన పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను,

ఉ. దీపధి శాస్త్రకార్యునకు ధీరగుణాన్విత కొమ్మమాంబకున్
మానవకోటిలోపల సమస్తగుణమ్ముల వాఁడు పెద్ద నా
వానికి వాఁడు పెద్దయగు వానికి వానికి వాఁడు పెద్ద నా
వానికి వారలిద్దఱకు వాఁడధికుండనఁ బుట్టి రాత్మజుల్.

సీ. వివిధవిద్యాకేళి భవనభావంబున
జలజాసముఖచతుష్టయముఁ బోలి
వివిధవిప్రతిపత్తివిచారణక్రీడను
జలశాయి భుజచతుష్టయముఁ బోలి
ధర్మార్థకీర్తియాదర్శకత్వంబున
సన్నుతాగమచతుష్టయముఁ బోలి
పృథుతరప్రథితగాంభీర్యగుణంబున
నంబురాశిచతుష్టయముఁ బోలి
సుతచతుష్టయంబు నతికైకొ గుణనిధి
కేతనయును శౌరిజానిభుఁడు
మల్లనయును మంత్రిమణి సిద్దనయు రూప
కుసుమమార్గణుఁడు కొమ్మనయును.

వ. అందగ్రనందనుండు

చ. కవితకు ముఖ్యుఁడీతఁడనఁ గామితవస్తువు లిచ్చువాఁడు నా
నవరసభావుకుం డితఁడనన్ బుధపూర్ణనారాయణుఁడు నా
నవు నన రాజనీతివిచక్షణుఁ డితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుఁడై నెగడె ధన్యుఁడు కేతనమంత్రి యెన్నఁగాన్.

ఇందు మొదటిపద్యములోఁ జెప్పఁబడిన భాస్కరుఁడే భాస్కర రామాయణకర్త యని యూహింపఁబడిన యాతఁడు. అతని చారిత్రము నింతకుముందు వ్రాసియుంటిని. అతనికుమారులు నలుగురిలో పెద్దవాఁడైన కేతనయే కాదంబరీకర్తయని చెప్పబడిన యాకవి. మూఁడవ కుమారుఁడైన సిద్ధన, చోడతిక్కరాజునకు మంత్రి. ఈతనిఁగూర్చి తిక్కసోమయాజి చరిత్రమున వ్రాయుచున్నాఁడను. నాల్గవకుమారుఁడైన కొమ్మన తిక్కనసోమయాజి తండ్రి.

కాదంబరీకృతికర్తయైన కేతనకుమారుఁడు భాస్కరుఁడు. ఈ భాస్కరునకు కిరువురు కుమారులు. అందు పెద్దవాఁడు కేతన. ఇతనినే మనుమఁడు కేతన యని పైని వ్రాసియుంటిని. ఇతఁడు కవియైనట్లు దశకుమారచరిత్రకర్తయైన మూలఘటిక కేతనకవి చెప్పియుండలేదు. ఈ విషయములను దెలుపు పద్యములను గూడ నీక్రింద వ్రాయుచున్నాఁడను.

ఉ. మానిని బ్రహ్మమాంబకు సమాఖ్యశిఖామణి కేతశౌరికిన్
భూనుతకీర్తి భాస్కరుఁడు పుణ్యచరిత్రుఁడు మంత్రిగుండఁడున్
ధీనిధి మల్లిసిద్ధియు నతిస్థిరచిత్తులు ధర్మతత్పరుల్
మానవనాథపూజ్యులు క్రమంబునఁ బుట్టిరి కీర్తనీయులై

వ. అందగ్రజుండు

క. నీతిసురాచార్యుఁ డన
దాతృతఁ గానీనుఁ డనఁగ బ్రతాపంబునఁ బ్ర
ద్యోతనుఁ డన సచివాగ్రణి
కేతయభాస్కరుఁడు జగతిఁ గీర్తన కెక్కెన్

చ. గొనముఁ బ్రసిద్ధ భాస్కరునకున్ బతిదేవత మారమాంబకున్
దినకరతేజులై తనరి సిద్ధితసన్నిభ కాంతిమంతులై
వనధిగభీరులై సుజనవందితులై జనియించి రొప్పుగా
మనుచరితుండు కేతనయు మారపమాన్యుఁడు మాంచశౌరియున్

## తిక్కనసోమయాజి వంశవృక్షము

మారెన
|
గుండశౌరి
|
కేతన = భార్య నాగమ్మ
|
- గుండన
- భాస్కరమంత్రి = భార్య కొమ్మమాంబ
- మహాదేవుఁడు

భాస్కరమంత్రి = భార్య కొమ్మమాంబ
|
- కేతనప్రగ్గడ = భార్య బ్రహ్మమమ్మ.
- మల్లన
- సిద్ధన = భార్య ప్రోలాంబ. (ఇతఁడు తిక్కరాజునకు మంత్రి)
- కొమ్మన = భార్య అన్నమాంబ

కేతనప్రగ్గడ = భార్య బ్రహ్మమమ్మ.
|
- భాస్కరుఁడు = భార్య మాచమాంబ.
- గుండన = భార్య మాదేవి.
- మల్లిసిద్ధి = భార్య అక్కమ.

కొమ్మన = భార్య అన్నమాంబ
|
తిక్కనసోమయాజి (భారత గ్రంథకర్త)

భాస్కరుఁడు = భార్య మాచమాంబ.
|
- కేతన
- మారన

గుండన = భార్య మాదేవి.
|
- మల్లన
- కొమ్మన
- సిద్ధన్న
- కేతన్న

మల్లిసిద్ధి = భార్య అక్కమ.
|
- కేతన
- మల్లన = భార్య మాచమ్మ

మల్లన = భార్య మాచమ్మ
|
మనుమసిద్ధి

సిద్ధన = భార్య ప్రోలాంబ (ఇతఁడు తిక్కరాజునకు మంత్రి)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తిక్కన (భార్య జానమాంబ) గంధవారణబిరుదు. ఇతనిని ఖడ్గతిక్కన యందురు. | భాస్కరుఁడు | కేతన | మల్లన | మల్లన | చినభాస్కరుఁడు | సిద్ధన |

(తిక్కన సంతానము)

| | | | |
|---|---|---|---|
| సిద్ధన | కొమ్మన | ఇమ్మడి మనుమసిద్ధి | ముమ్మడి మనుమసిద్ధి |

కోలవీసా మాచగ్రామము గానిచ్చె" (ఈ శాసనము ప్రతిని నేఁడు గనగనే వ్రాసి పంపినందులకు ఉదకమండలమునందున్న దొరతనము వారి యెపిగ్రాఫిస్టుగారికి నేను కృతజ్ఞుఁడను)

ఈ మావెన మనుమఁడైన కేతన కమ్మనాఁటిని పాలించిన త్రిభువనమల్లదేవచోడుని మంత్రియనియు నా కేతన మనుమలైన కేతన మల్లనలు కమ్మనాఁటి చోడులకు మంత్రులుగా నుండిరనియుఁ దెలియుచున్నదని బ్ర. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు (ఆంధ్రుల చరిత్ర ౮౭–౭౮ పుటలు) వ్రాసియున్నారు. కాని యందు సత్యము లేదు. ఈ త్రిభువనమల్లదేవచోడుఁడు క్రీ.శ. ౧౧౫౦ ప్రాంతమువాఁడు. ఈతనిపేరున శాసనము లనేకము లున్నవి. ఆకాలమున మంత్రులుగా నున్నవారు కాశ్యపగోత్రులు. అందు కేతన శివదేవుని కొడుకు. కేతన, మల్లనలు అమాత్యసిద్ధనప్రోలమాంబల తనయులు (ద. హిం. శా. సం. ౭ సంఖ్య ౧౩౭.౭౨౩) తిక్కనసోమయాజి వంశీయులకును వారికిని నేమియు సంబంధము లేదు.

పై కందవృత్తమునఁ దిక్కనసోమయాజికిఁ బితామహుండుగాఁ గనఁబడుచున్న భాస్కరమంత్రియే భాస్కరరామాయణకర్త యని యూహింపఁబడుచున్న యాతఁడు. ఆతనిచారిత్రము నీగ్రంథమున వేఱుగ వ్రాసియున్నాఁడను. ఆభాస్కరమంత్రి పెద్దకుమారుఁడును దిక్కనసోమయాజికిఁ బెదతండ్రియునగు కేతనప్రగ్గడయే ఆంధ్రపద్య కాదంబరీ కావ్యకర్త యని తలంచుచున్నారు. ఆ కవిచారిత్రమును గూడ నిందు వేఱుగ వ్రాసియుంటిని.

తిక్కనకు వేఱొక పెదతండ్రియగు సిద్ధనయు నాతనికుమారుఁ డైన తిక్కన (ఖడ్గతిక్కన) యుఁ జోడతిక్కరాజునకు మంత్రులై సేనాధిపతులై పరాక్రమవంతులై యనేకరణములలోఁ బాల్గొని శాశ్వతకీర్తిని గడించియున్నారు. చోడతిక్కరాజెవ్వరో తెలిసినఁగాని వారినిగూర్చి చెప్పిన ప్రయోజనములేదు. కావున వారి వృత్తాంతమునుఁ దరువాత వ్రాసెదను.

ఈ ఖడ్గతిక్కనకు సోదరులైన కేతన, మల్లన, భాస్కరులు పరాక్రమవంతులును శూరులు నైనట్లు క్రిందిపద్యములలోఁ గేతనకవి దశకుమారచరిత్రమునఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆగమనీతిసంపద విహంగమపుంగవకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి యుద్ధవిజిగీషను వానరకేతుఁ జెప్పుచోఁ
గేతనఁజెప్పి దిగ్విదితకీర్తిగుణున్ వృషకేతుఁ జెప్పుచోఁ
గేతనఁజెప్పి కాక ధరఁ గేవలమర్త్యులఁ జెప్పఁజాలు నే.

శా. పారావారపరీతధాత్రి వినుతింపం బోలు మల్లాంబికా
సారోదార యశోభిరాము బహుశాస్త్రప్రౌఢు శస్త్రాస్త్రవి
ద్యారాజత్పటుబాహువిక్రము సుదాత్తస్వాంతు ధర్మక్రియా
చారాపాస్త సమస్తదోషనివహుఁ జౌహత్తనారాయణున్.

చ. ఉరవడి నుగ్రసేవణపయోనిధి బాడబవహ్ని చాడ్పునన్
దరికొని కుంభజన్ముక్రియఁ ద్రాగి రఘుక్షితినాథుమాడ్కి నె
చ్చెరువుగ నింకఁ జేసె నని చెప్ప జనప్రకరంబు విక్రమా
చరణుని సిద్ధనామసుతు భాచని నన్నన గంధవారణున్.

ఈ పద్యమునఁ జెప్పిన సేవణరాజు లనఁగా దేవగిరి రాజధానిగా రాజ్యమేలిన యాదవరాజులని చరిత్రకారులు నిర్ణయించి యున్నారు. ఈ సేవణరాజులను జోడతిక్కరాజు జయించినట్లు దశకుమార చరిత్రమునందుఁ దిక్కరాజును వర్ణించుసందర్భమునఁ గేతనకవి రచించిన "సేవణ కటక సామంతు గర్వ మడంచె" నను పద్యపాదమువలనఁ దెలియుచున్నది. పై చంపకమాలలోని భాస్కరుఁడు మంత్రిభాస్కరునకుఁ బౌత్రుఁడు. తిక్కనసోమయాజికిఁ బినతండ్రి కుమారుఁడు. ఇతఁడు కూడ తండ్రివలెను, సోదరుఁడగు ఖడ్గతిక్కనవలెనుఁ జోడ తిక్కరాజునకు సేనాధిపతిగా నుండి సేవణరాజులతోఁ నాతనికి జరిగిన యుద్ధములలోఁ బాల్గొని జయముఁ గడించి యుండును.

తిక్కనసోమయాజితండ్రియైన కొమ్మనామాత్యునిఁ దల్లియైన యన్నమాంబను, దశకుమారచరిత్రమునఁ గేతనకవి యీక్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. స్వారాజ్యపూజ్యుఁడో కౌరవాధీశుఁడో
నాఁగ భోగమున మానమున నెగడె
రతినాథుఁడో దేవరాజతనూజుఁడో
నాఁగ రూపమున దానమున నెగడె
ధరణీధరేంద్రుఁడో ధర్మసంజాతుఁడో
యనఁగ ధైర్యమున సత్యమున నెగడె
గంగాత్మజన్ముఁడో గాండీవధన్వుఁడో
యనఁగ శౌచమున శౌర్యమున నెగడె

సూర్యవంశమహీపాల సుందరాజ్య
వనవసంతంబు బుధలోకవర్ణ్యుండు
గౌతమాన్వయాంభోనిధి శీతకరుఁడు
కలసిధానంబు కొట్టరు కొమ్మశౌరి.

సీ. పతిభక్తి నల యరుంధతి పోలె నేనియు
సౌభాగ్యమహిమ నీసరికి నెవరొ
సౌభాగ్యమున రతి సరియౌను నేని
భాగ్యంబున నీయంబుజాక్షి కెవరొ
భాగ్యంబునందు శ్రీ ప్రతి యౌను నేనియుఁ
దాలిమి నిలతాల్మి కెవరొ
తాలిమి భూదేవి తగసాటియగు నేని,
నేర్పున నీపద్మనేత్ర కెవరొ
యాని యనేకవిధంబుల నఖిలజనులు
పొగడ నెగడె గృహపారపూరితాంత
రంగ కొమ్మనామాత్యు నర్ధాంగలక్ష్మి
యఖిలగుణగణాలంకృత యన్నమాంబ.

తిక్కనసోమయాజి తండ్రియగు కొమ్మనామాత్యుఁడు దండనాథుఁడనియుఁ గుంటూరు విభుఁడనియు భారతమునఁ జెప్పియున్నాఁడు. గుంటూరి విభుఁడనఁగా గుంటూరునకుఁ గరణమనియు తిక్కనసోమయాజి కుమారుఁడు కూడ గ్రామకరణముగా నుండెను. కావున వీరు మొదటినుండియు గ్రామకరణములుగా నుండిరనియుఁ గొందఱి యభిప్రాయము. సుప్రసిద్ధ చరిత్రకారులగు శ్రీ. చి. వీరభద్రరావు పంతులుగారీ యభిప్రాయము సరికాదనిరి, కొమ్మన కరణమైన నగుఁగాక. ఆయన నాకాలమునాఁటి కరణము లిప్పటివారివలె

లెక్కలు వ్రాయువారుగా మాత్రమే యుండి పేరుప్రతిష్ఠలు లేనివారుగా నుండెడివారని తలంపరాదు. ఆకాలపు కరణములు, శాస్త్రజ్ఞాన సంపన్నులై పరాక్రమవంతులై యాత్మగౌరవము కలవారై తమ గ్రామ సంరక్షణముకొఱకుఁ గావలసిన సైన్యము నుంచుకొని రాజునకు సర్వవిధముల సాహాయ్య మొనర్చుచు రాజుచే గౌరవము నందుచుండెడివారు. అందుచేతనే "విభు" "మహీపాలక" శబ్దములు, వారియందు వర్తించుచుండెను. తిక్కనసోమయాజితండ్రి గ్రామకరణమని యంగీకరించినను, నామమాత్రమున వానిని సామాన్యునిగాఁ దలంపరాదు. ఇతఁడు సాంగవేదవేది. గుండాధిపతి సూర్యవంశ భూపాల సుచిరరాజ్య వనవసంతుఁడై గండికోటనివలె శౌర్యమున నెగడియున్నాఁడని కేతనకవి చెప్పియుండుటచే వీనిని గేవల మొకవ్రాయసగాఁడని తలంపరాదు. ఇతఁడు నూత చోడరాజులకు సేనాధిపతిగా నుండి నెల్లూరునందు జరిగిన యొక మహారణములో వీరమరణము నందెననియు, నావార్త గుంటూరునందున్న యాతనిభార్య విని యించుకేనియు విచారము నందక తాను వీరపత్ని నైనందులకు సంతసించి భర్తతో సహగమనము గావించెననియుఁ జెప్పుదురు. భర్తమరణవార్త చెప్పవచ్చినవారితోడను నాసమయమునఁ దనను జూడవచ్చినవారితోడను దేహ మశాశ్వతమనియు, జీవితమునుఁ బరోపకారకముగాఁ గడపుటయు, రణమరణము నొందుటయు నుత్తమపురుషలక్షణము లనియు నట్టి భర్తతో సహగమన మొనరించుట నుత్తమసాధ్వీధర్మమనియు హితోపదేశము గావించెనఁట. ఈదంపతుల సుగుణములను దెలుపు పాటలను బ్రజలు విశేషముగా నిప్పుడునుఁ జెప్పుకొనుచుందురఁట.

జగత్ప్రఖ్యాత చారిత్రుఁడైన తిక్కనసోమయాజి కీపుణ్యదంపతులు తలిదండ్రులు. మొత్తము మీఁద నీకుటుంబమున మొదటినుండియు బండితులునుఁ గవులును, శూరులును, దాతలు నుద్భవించి తమ యశ

శ్చంద్రికల దిగంతములఁ వ్యాపింపఁజేసియుండిరని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈకుటుంబమువారు, నెల్లూరు రాజధానిగా నాచుట్టుపట్టుల నున్న దేశమును బరిపాలించిన చోడరాజులకడ మంత్రులుగను సేనాధిపతులుగ నుండి పేరువడసిరని చెప్పుట కీవంశమునందలి పేరులు సాక్ష్యమిచ్చుచున్నవి. ఆకాలమున మంత్రులు, సేనాధిపతులు మొదలగు రాజకీయోద్యోగులు తమ సంతానమునకుఁ దమ ప్రభువుల నామములనుంచి తమకృతజ్ఞతను వెల్లడించు నాచార ముండెడిది. తిక్కన రచించిన నిర్వచనోత్తరరామాయణమునకుఁ గృతినందిన ప్రభువు మనుమసిద్ధి. అతనితండ్రి తిక్కరాజు. ఆతనితండ్రి మనుమసిద్ధి అతని పూర్వుఁడు నల్లసిద్ధి. ఈపేరు లీవంశవృక్షమునఁ గానిపించుచున్నవి. మన చారిత్రకపురుషుఁడైన తిక్కనపేరు, మనుమసిద్ధి తండ్రియైన తిక్కరాజునుఁబట్టియే వచ్చినదని తలంపవచ్చును. శ్రీకాళహస్తియందున్న తిరుకాళత్తిదేవుఁడే యాంధ్రమునఁ దిక్కన యైనాఁడు. చోడతిక్కరాజునుఁ దిరుకాళత్తిదేవచోడుఁడని కూడ పిలచెదరు.

ఇట్టి సుప్రసిద్ధవంశమునఁ దిక్కనసోమయాజి జననమంది మహాకవి యగుటయే గాక గొప్ప రాజకీయవేత్తయై మహోదాత్తుఁడై వేద వేదాంగసంపన్నుఁడై కర్మిష్ఠుఁడై కవిపండిత పోషకుఁడై కులపతియై శాశ్వతకీర్తిని గడించియున్నాఁడు.

కొట్టరువు కొమ్మనప్రగ్గడ కొడుకు మల్లనప్రగ్గడ యనువాఁడు విశ్వేశ్వరశివదేశికుని (కాకతీయగణపతిదేవునకు రాజగురువు) యొద్ద ధాన్యాదితిగానుండి శా. శ. ౧౨౦౮ చిత్రభాను సం॥ర ఆశ్వయుజ బహుళ తృతీయనాఁడు విశ్వనాథదేవునకు దీపమునకై యేఁబదిగొఱ్ఱెల నిచ్చినట్లు గుంటూరు మండలములోని వంగరగ్రామమున నొకశాసనమున్నది. (A. R. నెం. 68 ఆ. 1917) పై వంశవృక్షములోఁ

గొమ్మన కొడుకు మల్లన కనుపడుటలేదు. కాని దాని తుదిగొమ్మల యందిరువురు గొమ్మనలున్నారు. వారిలో నెవరికైన మల్లన యను పుత్రుండున్నాఁడేమో! లేక యాతఁడు మఱియొక వంశమున వానివాఁడో; శాసనములో నాతఁడు భారద్వాజగోత్రుఁడని యున్నది. తిక్కనసోమయాజి గౌతమగోత్రుఁడు. శాసనములోని వ్రాఁత పొరపాటు కావలయును. లేదా కొట్టరువువారిలో రెండుగోత్రములవా రుండి యుండవలయును.

తిక్కనసోమయాజి తన్నుగూర్చి చెప్పినవిషయములు:

ఈమహాకవి రచించిన గ్రంథములయందుఁ దననుగూర్చి యేమి వ్రాసికొని యుండెనో చూతము.

ఇతఁడు నిర్వచనోత్తర రామాయణమును శ్రీ మహాభారతమున విరాటపర్వమాదిగాఁ గడపటికి బదునైదు పర్వములను నాంధ్రమున బద్యకావ్యములుగా రచించి యుండెను. నిర్వచనోత్తర రామాయణమున నితఁడు తననుఁగూర్చి యీయొక పద్యమును మాత్రమే చెప్పికొని యున్నాఁడు.

మ. అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడ దిక్కాంకుండసన్మాన్యుఁడన్.

ఈ పద్యమునందుఁ దాను శివభక్తుఁడ నైనట్లు చెప్పియున్నను వైష్ణవద్వేషమున్నవాఁడు కాఁడని నిర్వచనోత్తరరామాయణ రచనము వలనను నందలి ప్రథమాశ్వాసముననే "హరిహరపద్మగర్భులను" అని చెప్పియుండుటచేతను స్పష్టమగుచున్నది. మఱియు సంస్కృతాంధ్ర కావ్యశిల్పమునందుఁ బారగుఁడ ననియుఁ గళావిదుఁడననియుఁ జెప్పు

కొని యుండుటచే నదివఱకే యెవరో కొన్ని సంస్కృతాంధ్రగ్రంథములను రచించి యున్నట్లు పొడకట్టుచున్నది. కాని యీ రామాయణ భారతములు దక్క నే గ్రంథములును నీతని రచనములు మనకు లభ్యములగుట లేదు. తిక్కనసోమయాజికి దశకుమార చరిత్రమును గృతియిచ్చి కేతనకవి:

క. అభినుతుండు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునను జతురుండై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్.

అని చెప్పియుండుటచే నీతఁ డనేక సంస్కృతాంధ్ర గ్రంథములను రచియించినట్లు తెలియుచున్నది. కేతనకవి చెప్పియుండకపోవుటచే నీ మహాకవి రచనముల పేరులైనను తెలిసికొను నదృష్టము లేకపోయినది. ఆ కాలము వారికి, తామిదివఱకు రచించిన గ్రంథముల పేరులను గాని తమపూర్వులు రచించిన కావ్యముల పేరులు గాని చెప్పుకొను నాచారము లేదు. తిక్కనసోమయాజికూడ తనతాతనుఁగూర్చి చెప్పునప్పుడు "సారకవితాభిరాము" అని చెప్పెనే గాని యాతఁడురచించిన గ్రంథములనుఁ బేర్కొనలేదు.

సంగమవంశజుఁడైన కంపరాజుభార్య గంగాదేవి తనభర్తవిజయములను వర్ణించుచు వ్రాసిన మధురావిజయమను సంస్కృత గ్రంథమున దిక్కనసోమయాజిని సంస్కృత కవులలోఁ జేర్చి వర్ణించినది. కాని అందునను నాతఁడు రచించిన గ్రంథనామముల నీయలేదు.

ఈ మహాకవి, భారతములోఁ గూడఁ దననుఁగూర్చియుఁ దన పూర్వులనుఁగూర్చియు నొక్కపద్యమే వ్రాసికొనినాఁడు.

సీ. ప్రాజ్ఞనుతుండు సన్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముఁడు గుంటూరివిభుఁడు కొ
మ్మనదండనాథుఁడు విధుకీర్తి
విస్తీర్ణుఁ డాపస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగవేదవేది

తే. యాత్మఁగల పట్టి వాత్సల్య మతిశయిల్లి
నస్మదీయ ప్రబంధంబు లాదరించి
తప్పి దీర్చి కరుణార్ద్రదృష్టిఁ జూచి
యొలమి నిట్లని యానతి యిచ్చె నాకు.

తిక్కన, తనను గూర్చిగాని, తనపూర్వులనుఁగూర్చిగాని యీ గ్రంథమునందు విశేషముగాఁ జెప్పుకొనకుండుట కాత్మశ్లాఘనమునం దిష్టము లేకపోవుటయో, పూర్వగ్రంథములయందు వర్ణించియుండి మరల మరలఁ జెప్పుకొనుట రుచింపకయో యైయుండును. ఇప్పటివారికి వలె గాక యానాటి మహాకవులకు, స్వవిషయకథనమునం దిష్టముండెడిది కాదు. నన్నయభట్టు తండ్రిపేరైనను గృహనామము నైనను జెప్పుకొనలేదు.

ఇతని గృహనామము: నివాసము:

తిక్కన తన గృహనామము నెచ్చటనుఁ జెప్పుకొని యుండలేదు. కేతనకవి రచించిన దశకుమార చరిత్రమువలన వీరియింటిపేరు కొట్టరువువారని తెలియఁగనగుచున్నది. మొట్టమొదట వీరి గృహనామము గుంటూరువారనియుఁ బిమ్మట కొట్టరువుగా మారెననియు నందురు. తిక్కన పూర్వుల నివాసము గుంటూరుమండలమందలి

పకుగుపాడనియుఁ గొన్నితరములయిన పిమ్మట గుంటూరునకువచ్చి యచ్చట నివాసమేర్పఱచుకొనిరనియుఁ దిక్కన పితామహుని జీవిత కాలమునందో, కాక యాతని తండ్రుల కాలముననో నెల్లూరునకు వచ్చి యట నివాసమేర్పరచుకొనిరనియు జెప్పుచున్నారు. తిక్కన నెల్లూరనివాసి యనుట నిర్వివాద విషయము. తండ్రిని గుంటూరు విభుఁడనుటచేత తండ్రినివాసము గుంటూరనియే చెప్పవలెను.

కొన్ని శాసనములలో కోష్ఠాధిపతి యను సంస్కృత శబ్దమునకు తెలుఁగుగ కొట్టారువు అని వ్రాసియున్నారు. ఇట్లే భాండాగారాధిపతులకు భండారువు అని యుపయోగించియున్నారు. తిక్కనవంశీయులలోఁ బూర్వులు లేక మహారాజులవద్దనో కోష్ఠాధిపతులై యుండిరనియు నా కాలపు తెలుగుభాషనుఁబట్టి వారిని కొట్టారువు లని వాడియుండిరనియు దాని ననుసరించి యీవంశీయులకు "కొట్టరువు" అను నింటిపేరు వచ్చియుండుననియు నూహింపఁదగి యున్నది. ఈపే రెప్పుడు వచ్చెనో చెప్పుట కాధారములు లేవు.

కొట్టరువు అన నొక గ్రామముండెననియు దానినిబట్టి వీరి గృహనామ మేర్పడెననియుఁ గొందఱనుచున్నారు. కాని యది సత్యము కాదు. కొట్టరువు గ్రామ మెచ్చటనుండెనో వారు చెప్పలేదు. గుంటూరు నెల్లూరు మండలములలో కొట్టరువు లేదు.

దశకుమారచరిత్రమందలి తిక్కన ప్రశంస:

తిక్కనసోమయాజి, మూలఘటిక కేతనకవి రచించిన దశకుమార చరిత్రమునఁ గృతినందెను. అందుఁ దిక్కనగూర్చి యాకేతనకవి రచించిన పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁడనిన
కేఁడనునాలుకకుఁ దొడవైనవాఁడు

యోగపఞ్చి, యుద్ధంభోజనమును గావించుటయేగాక యనేకవృ
త్తికిఁ బండితులకుఁ బ్రోత్సాహ మొసంగియున్నవాఁడు మారనవంటి
మహాకవి యాతనికి శిష్యుఁడగుటయు కేతనవంటి పండితకవి కృతిదాత
గావుటయు, బద్దెనవంటివాఁ డీతనిచే బిరుదమును గ్రహించుటయు
నీతనికిఁ దార్కాణములు.

## హరిహరనాథుని ప్రశంస:

ఇతఁడు పరమ భక్తాగ్రేసరుఁడనుట కీతని రచనములే దృష్టాంతములు. ఈతని కాలమున వీరశైవవైష్ణవమతములు పరస్పర ద్వేషముతో నుండి యన్యోన్యహింసకూడ గావించుకొను స్వభావముతో మెలఁగుచు వచ్చినవి. అట్టిసమయమున నీమహానుభావుఁడు శివకేశవుల కభేదమును ప్రతిపాదించి, హరిహరనాథుఁడను దైవమునకు తనభారతమును గృతియిచ్చెను. నెల్లూరునందు హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు, తిక్కనసోమయాజి భారతము నాయాలయమునఁ బవిత్రహృదయముతోఁ గూర్చుండి రచియించెననియుఁ జెప్పుదురు. భారత విరాటపర్వ కృత్యాది యందలి "అనిపూని యాకృతిత్వంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రకటించుటయు లోకారాధన విశేషం బగుటఁ జేసి" అనువాక్యము లీయంశమును ధ్రువపఱచుచున్నవి. ఈకృతిరచన మొకవిధముగ దేవతారాధన మని యే తిక్కన మనసార విశ్వసించెను, ఈతనితరువాతికవులు కొందఱీతని ననుకరించి తమ గ్రంథములను హరిహరనాథునకు గృతినొసంగిరి. నెల్లూరునం దిప్పు డీయాలయము లేదు. పాండవుల యాలయ మొకటి కలదు. ఇప్పుడు రంగనాథస్వామి యాలయ మున్నచోటనే పూర్వము హరిహరనాథుని యాలయ ముండెడిదనియు నదిశిథిలమైపోఁగా నాప్రదేశమున రంగనాథాలయమును నిర్మించిరనియుఁ జెప్పుదురు. నెల్లూరుకడ పెన్న రెండు పాయలైనదనియు, రెండవపాయ నెల్లూరునకు దక్షిణమున నుండెడి

నగయు. నడిబావి పూడిపోయిననియు, నాబావికి దక్షిణపు ప్రక్కన హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు దానిశిథిల చిహ్నము లిప్పటికిని గన్పట్టుచున్నవనియు కొందఱనుకొందురు. బైచరాజు వెంకటనాథకవి తన పంచతంత్రమును శ్రీ హరిహరనాథునకుఁ గృతి యిచ్చియుండుటచే నాతని కాలము వఱకును (పదునైదవశతాబ్ది) నీయాలయ ముండెనని విశ్వసింపవచ్చును. సప్తగోదావరీ సంగమమున నొక హరిహరదేవాలయ ముండెడిదని ద్రాక్షారామమునందలి యొకశాసనము (పదునొకండవశతాబ్దినాఁటిది. ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౦౪౯) వలనఁ దెలియుచున్నది. హరిహరనామక పట్టణమొండు కర్ణాట దేశమునఁ గలదు.

హరిహరనాథునిఁ బ్రశంసించుచు తిక్కన రచించిన యీక్రింది శ్లోక మాదేవునకుఁ బరమప్రీతిఁ గల్గించెనఁట!

"కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే"

"ప్రభో! నీవు అలంకరించుకొనుటకో అస్థిమాల నిచ్చగింతువా లేక కౌస్తుభము నభిలషింతువా? నీకు కాలకూటము రుచ్యము గానుండునా లేక యశోదాస్తన్యము రుచ్యము గానుండునా నాకుఁ జెప్పుము" ఇది పైశ్లోకార్థము.

భగవంతుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై శివకేశవుల కభేదమును బ్రతిపాదించుచు గ్రంథమును రచించినందునఁ దనను గొనియాడుచున్నట్లీక్రింది పద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

ఉ. వైదికమార్గనిష్ఠ నగు వర్తనముం దగ నిర్వహించుచు
వాదము లేనిభక్తి మతి నిశ్చలవృత్తిగఁ జేయుచుండ న

నన్నయ యట్లు రచింపగా మిగిలినభాగమును పూర్తిచేయించుటకై తగినకవికొఱకు రాజరాజనరేంద్రుఁడు ప్రయత్నము చేయుచు, నన్నయ రచనమునందలి తుదిపద్యమగు:

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ దాల్చె సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై"

యనుపద్యము నొకతాళపత్రముపై వ్రాయించి యట్లు వ్రాయఁగలిగిన కవులెవరైన నున్నచో నీభావమును దమశైలిలో రచించి పంపుఁడని రాజాస్థానములకుఁ బంపెననియు, నది మనుమసిద్ధికడకు రాఁగా, దిక్కన సోమయాజి యాపద్యము నే తాళపత్రముపై వ్రాసియుండెననియు, నన్నయతో సమానముగా దాను వ్రాయఁగలనను తిక్కనభావమును గ్రహించి రాజరాజనరేంద్రుని తనకడకుఁ బంపుమని మనుమసిద్ధినిఁ గోరెననియుఁ దిక్కన యందులకు నంగీకరింపక పోఁగా మనుమసిద్ధికి గోపము వచ్చి "పలువురిలో నీబుద్ధి కొఱఁతించి వీధులవెంటఁ ద్రిప్పి మానసమును దిసిపించెద" నని తూలనాడెననియుఁ దరువాత రాజు పశ్చాత్తప్తుఁడై తనమాట నిలుపుకొనుటకై తిక్కనామాత్యునిచే యజ్ఞము చేయించెననియు నొకకథ చెప్పెదరు. కాని యందు లేశమాత్రమును సత్యము లేదు. (యజ్ఞము చేయువానికి క్షౌరమును, నూరేగుటయు, సోమపానమును గర్తవ్యములు)

మనుమసిద్ధి మహారాజు రాజరాజునకుఁ దరువాత రెండువందల సంవత్సరములలో నున్నవాఁడు. భారతమును బూర్తిచేయించుటకై రాజరాజు ప్రయత్నించెననుటకుఁ గూడ నాధారములు లేవు. భారతమును దనకుఁ గృతియిమ్మని మనుమసిద్ధి యడిగెననియుఁ దిక్కన యందుల కంగీకరింపకపోఁగాఁ బైఁజెప్పినకథ నడచెననియుఁ గొందఱందురు.

కాని యీయంశమున సత్యము లేదు. తిక్కన భారతమును రచించునాఁటికి, మనుమసిద్ధి జీవించియుండెనో లేదో యని సంశయముగా నున్నది. భాస్కరుని భగవంతునకుఁ గృతి యీయఁదలఁచినప్పుడు దండుల కభ్యంతరమును గలుగఁజేయు స్వభావముకలవాఁడు కాఁడు మనుమసిద్ధి. తిక్కనయెడల మనుమసిద్ధికి గౌరవము మెండు. శ్రీకృష్ణదేవరాయలు తనమంత్రియైన తిమ్మరుసును "అప్పాజీ" యని పిలిచినట్లె మనుమసిద్ధి తిక్కనను 'మామా' యని పిలుచుచుండెడివాఁడు. మనుమసిద్ధి తిక్కనయెడఁగల యనన్యసామాన్యగౌరవము నిర్వచనోత్తర రామాయణము నందలి యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నసత్కవీ
శ్వరులను భక్తిఁ గొల్చి తగ వారికృపం గవితావిలాస వి
స్తర మహనీయుఁడైన నను సద్గుణోత్తమమూర్తి మన్మభూ
వరుఁడు దగంగరాఁబిలిచి వారక మన్నన నాదరించుచున్.

క. ఏ నిమ్మ మామ యనియెడు
దీనికిఁ దగ నిమ్మ భారతీకన్యక నా
కీనృపుఁడ వగు దనినను
భూనాయకుపల్కు చిత్తమున కింపగుడున్.

సీ. సకలలోకప్రదీపకుఁ డగు పద్మినీ
మిత్రువంశమున జన్మించె నవనియుఁ
జూచిన మగలైనఁ జొక్కుఁ బుట్టిన సౌం
దర్య సంపద సొంపుఁ దాల్చెననియు
జనహృదయానందజనకమై నెగడిన
చతురత కల్మి నప్రతిముఁడనియు
మెఱసి యొండొంటికి మిగుల శౌర్యత్యాగ
విఖ్యాతకీర్తుల వెలసెననియు

వివిధవిద్యాపరిశ్రమ వేదియనియు
సరసబహుమాన విరచనాశాలి యనియు
మత్కృతీశ్వరుఁ డగుచున్న మనుమనృపతి
సుభగుఁ గావించుఁ దను సమతుల్యుఁడ నైతి.

మనుమసిద్ధి మహారాజు తిక్కనకు రాజచిహ్నముల నిచ్చి గౌరవించిన ట్లీక్రిందిపద్యమునఁ గేతనకవి చెప్పియున్నాఁడు.

గీ. అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబకట్లు భూమి గానిక గాఁగఁ బెం
పెసఁగు రాచపదవులెల్లబడసె.

పైపద్యమునందు మనుమసిద్ధి వివిధవిద్యాపరిశ్రమ వేదియనియు, సరసబహుమాన విరచనాశాలి యనియు జెప్పియున్నాఁడు. అట్టి వాఁడు తిక్కననుఁ బహుప్రకారముల సంమానించుటకు లేదు. కావునఁ బైకథ యొంతమాత్రమును విశ్వసనీయము కాదు. కృతిచేఁ గన్యకతోఁ బోల్చిన వారిలోఁ దిక్కనయే మొదటివాఁడు. రాజరాజు పరీక్షార్థమంపిన పద్యము పైనిజెప్పినది కాదనియు "నిండుమనంబు" అనుపద్యమనియు గొందఱందురు. మఱియొకటియని యింకఁ గొందఱందురు.

తిక్కనతరువాత నాతనివంశము :

తిక్కనసోమయాజికిఁ దరువాత నాతనికుమారుఁడు నెల్లూరువదలి పడమట రెండుమూఁడు క్రోసులదూరములో పినాకినీనదీతీరమునందున్న పాటూరుగ్రామ కరణీకమును సంపాదించి యక్కడ నివాసమేర్పరచుకొనిరనియు నప్పటినుండియు వారు పాటూరివారని పిలువఁబడుచుండిరనియుఁ జెప్పుచున్నారు. ఈవంశావళిని వర్ణించు రెండు సీసపద్యములను బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగా రాంధ్రకవుల చరిత్రమున నుదాహరించియున్నారు. ఆ పద్యములివి :

ఇందులో మొదటిపద్యము పూర్వకవిరచిత మనియు, రెండవ పద్యము శరభరాజు గారిచ్చిన వంశానుక్రమణికనుబట్టి బ్రహ్మశ్రీ శతఘంటము వెంకటరంగనాధశాస్త్రిగారు రచియించి రనియుఁ జెప్పుదురు. పద్యములను శరభరాజుగారు వీరేశలింగముపంతులుగారి కిచ్చిరఁట. పాటూరి కరణికమునబట్టి వీరు పాటూరి వారైనారఁట.

కొందఱీవంశావళిని గూర్చి సంశయముఁ దెలుపుచున్నారు. తిక్కనసోమయాజి యుపయోగించిన గంటపుఁబఱ చాలకాలము వీరి యింట నుండెననియు దానిపై నొకప్రక్క సరస్వతి విగ్రహమును నొకప్రక్క విఘ్నేశ్వర విగ్రహము చెక్కఁబడియున్నదనియు ప్రతీతి కలదు. అది యిప్పుడున్నదో లేదో తెలియదు. బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారీ వంశావళినిబట్టి తిక్కన కాలమును నిర్ణయింపయత్నించిరి. ఇప్పుడు శాసన సాహాయ్యమున నీమహాకవి కాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. కావున నందుల కీవంశావళితోఁ బనిలేదు. మడికిసింగనకుఁ బితామహుండైన యాజ్ఞాదమంత్రి తిక్కనసోమయాజి పౌత్రిని బరిణయమాడెనని సింగకవికృత వాసిష్ఠరామాయణములోఁ జెప్పఁబడి యున్నది.

ఆంధ్రభాష కీతఁడొనర్చిన సేవ :

ఆంధ్రభాషాభివృద్ధికై పాటుపడినవారిలోఁ దిక్కన యగ్రేసరుఁడు. నన్నయాదు లాంధ్రభాషలోఁ గావ్యములను రచించినను, వారి కావ్యములలో సంస్కృతపదము లధికమును, ఆంధ్రపదములు స్వల్పముగను నున్నవి. నన్నెచోడుఁడు, సోమనాథుఁడు మొదలగు శివకవులు తమ గ్రంథములలో దేశ్యపదముల నధికముగనుపయోగించి యాంధ్ర సాహిత్యాభివృద్ధికై యెక్కువగా పాటుపడియుండిరి. తిక్కనసోమయాజి రెండు గ్రంథములను రచియించుటే కాక, యాకావ్యములలో

క. ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పనుమా
కీర్పుబ్బునకుఁ బొందు
తెల్మెపాలుఁడు నిన్నుఁ జూపి చనిరొ మహాత్మా!

ఆ. కౌశుకుఁ గాంచు గాధికూఁతు రెవ్వానికి
నట్టివానికి నుచిత వైభవమయ
మొనవెఁ దడయు రింకనొప్పదు జనములు ఉ. ప.
నల్లగాని పుంషు లనరు మిమ్ము

తే. వల్లపలింటి పూర్ణ్యైకపగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచున్నవాఁడు
మాధవా! మారథంబును మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు బడయవచ్చు. క. ప.

చ. వెఁవుకు లావు జేవ యును పీరల కారయ నొక్కరూపదు
స్త్రభుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడగించి యావ్వసుం
ధరఁ గొనునొక్క నేఁడితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ జేయనొప్పునొకొ శల్యుఁడు కౌరవరాజనందనుణ్ (శ ప)

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁ
[డుణ్
నేరనివాఁడు బింకరియు నిందకనొప్పునతండుఁ బంవయుణ్
ధీరతలేమి దుర్గుణ మతివ్యసనత్వముఁ గల్గువారలుం
జేరువ నున్న భూపతికిఁ జెట్ట యొనర్పు నరేశ్వరోత్తమా! (శాం.ప)

సీ. దవియలోఁ బడుఁబుర్వు దివిఁజు రౌత్రిచవానిఁ
బాపంబు వొందునే? యోపి దున్న
నాఁగేటి మొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరువొందునే యఘము? వారు

దనుపను శ్రేయ విధాతృవశమున నా
యువు దెగి పట్టిజంతువులు వచ్చు
నేము సంచితములి యించు శేనియు సహం
కారంబు వారికిఁ గలుగ దట్లు

ఆ. గాన చూచె వారిఁ గల్మష మొందదు
పుణ్యపాపములకు బుద్ధిమూల
మనిశిష్పురండు మెఱచి సనహింపవోలె నై
యా ధీధర్మ్మ మైనవిధము వినుము. ఆ. వ.

ఉ. ఏను హితంబు సెప్పి విరె లేచి దురాచరణంబు లిమ్మెయిన్
మానవు రోగి చేఁ దయినమందు ద్రవ్యంబు దెవ్వ అంబుఁదా కినం
గాని రయిముగఁ దప్పు ప్రతికారము గల్గునె యట్లపోలె ని
వైన నికృష్టవృత్తిఫల మందితి లింక చెడుగాక పిమ్మటన్. ని. రా.

స్థాలీపులాకన్యాయముగ నీపద్యములఁ జూపితిని గ్రంథమంతయు నిట్లే యుండును. ఈతనినిఁ జూచి కేతనమారనాదు లిట్లే తమ గ్రంథముల యందు జాతీయపదముల నుంచి రచించుచు వచ్చిరి. కాని శ్రీనాథాది మహాకవులు కొందఱీమార్గమును విడనాడి తమ కావ్యములను సంస్కృత పదజాలములతో నింపివైచిరి సాంస్కృతిక దీర్ఘసమాసములతో గ్రంథములను రచించుటయే గొప్పతనమని తలంచినకవులు కూడఁ గొందఱు కలరు. ఆంధ్రభాషలోఁ గావ్యరచనము చేయఁదలఁచికొనినప్పుడు దేశీయపదములలోఁ బాఠకలోకమునకును వినువారికిని హృదయాహ్లాదమును గలుగఁజేయునట్లు రచియించుటయే గొప్పతనమగును గాని నిఘంటుసాహాయ్యముండినఁగాని యర్థముకాని గూఢసంస్కృత పద సమాసములతో నాంధ్రకావ్యమును రచించుట గొప్పతనముకాఁ జాలదు. ఈసందర్భమున మొల్ల తన రామాయణమునఁ జెప్పిన

క. మును సంస్కృతంబు తేటఁగఁ
దెనిఁగించెడిచోట నేమి తెలియక యుండన్
దనరిన్న చెలువముఁ గ్రమ్మఱ
ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే.

ఆ. తేనెసోఁక నోరు తియ్యన యగురీతిఁ
దోన యర్థమెల్ల దోఁచకున్న
గూఢశబ్దయుతత కొల్లాటపని యెల్ల
మూఁగ చెవుడు వాడు ముచ్చటగును

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్పనది తెనుఁగునకున్
బొందై రుచియై వీనుల
విందై మది కాసపించు విబుధుల కెల్లన్.

అను పద్యములు స్ఫురణకు వచ్చుచున్నవి. తిక్కనసోమయాజి తన గ్రంథములయందుఁ బ్రయోగించిన దేశీయపదములు వేనకొలఁదిగ నున్నవి. సంస్కృతపదముల విషయమున "బాణోచ్ఛిష్టం జగత్రయ" మ్మనెడు మాట దేశీయపదవిషయమున సోమయాజికి వర్తించు ననుటకు సంశయము లేదు. ఈభావమును దశకుమారచరిత్రకృతికర్తయగు కేతన కవి "ఆగుననఁగొమ్మనయతిక్కఁడు" (ఈపద్యమును పైన నుదాహరించితిమి.) అనుపద్యములో వ్యక్తీకరించి యున్నాఁడు.

### ఇతని కవిత్వగుణము:

అద్వితీయ ప్రతిభావంతుఁడగు సోమయాజి కవిత్వగుణమును జూపనెంచుట సూర్యుని కాగడాతోఁ జూపనెంచుట వంటిది. ఆంధ్రకవులలో నితనితో సమానులింకొకరు లేరు. ఈతనికవిత్వ మింతగా సర్వజనాకర్షణీయ మగుటకుఁ గారణములు కొన్ని గలవు. అందు

మొదటిది.— ఈతఁడు చేపట్టిన కావ్యములయందలి యితివృత్తములు. ఆర్యులమగు మనకు గల యితిహాసములలో శ్రేష్ఠములైనవి రెండు. భారతము, రామాయణము. ఈ కావ్యములు రెండింటి నీతఁడు చేపట్టినాఁడు. "మణినా వలయమ్ వలయేన మణి" యనునట్లు కవిత వలన కథయుఁ గథచేఁ గవితయు శోభకెక్కును. వ్యాస వాల్మీకుల ప్రతిభ జగద్విదితమగుటచేఁ గాన నీ కావ్యముల యందలి యితివృత్తములే తన కవితాశక్తిని ప్రదర్శించుటకుఁ దగిన కథ లీతనికి లభించుట గొప్ప యదృష్టము.

రెండవది:— పదసౌష్ఠవము. ఈతని కవితయందు పెద్దపెద్ద సంస్కృత సమాసము లుండవు. చిన్న చిన్న దేశ్యపదముల నే విశేషముగా నీతఁ డుపయోగించును. ఏ తావున నే పదముపయోగించిన రస ముత్పత్తిల్లునో యీతనికి బాగుగాఁ దెలియును. ఎచ్చటనైనఁ సంస్కృతసమాసము లున్నను, అవి మృదుపద సంయుతములై మనోహరముగా నుండును. వాని యర్థమును గ్రహించుటకై నిఘంటు తాళముల యక్కఱయుండదు.

మూఁడవది:— అర్థగాంభీర్యము. ఎంతచిన్న పదముల నుపయోగించినను వానిలో నెంతయో గాంభీర్యమగు నర్థ మిమిడి యుండును. పాఠకుని శక్తికొలఁది నందలి భావగాంభీర్యము విదితమగుచుండును.

నాల్గవది:— వ్యర్థపదరాహిత్యము. ఇతని కవిత్వమునందుఁ బాదపూరణమునకును యతిప్రాసల కొఱకును దెచ్చిపెట్టుకొనెడి పదము లుండవు. ఎచ్చటనైన స్వల్పముగా నట్టి పదము లున్నను నవి కేవలము పడికట్టురాళ్లుగా నుండక యవియుఁ గూడ నెంతయో కొంత తాత్పర్యమును దెలుపునవిగానే యుండును.

ఐదవది:— పాత్రౌచిత్యము. కవిత్వ మెంతరసవంతముగ నున్నను, పాత్రపోషణము యుక్తముగ లేకున్నచో సహృదయుల కానందము కలు

గదు. భారతమున ప్రధానపాత్రములు రెండు ధర్మరాజును, ద్రౌపదియు. తిక్కన నియోగపుర్షను భారతమునఁ దుదిదాఁక జక్కగా పోషించినాఁడు. ఈ విషయమున వ్యాసునికంటె నీతనిదే పై చెయ్యియైనది. ధర్మరాజు రాజనీతిజ్ఞత, సమయోచితజ్ఞానము కార్యదీక్ష. ఇందియనిగ్రహము, సత్యాగ్రహము, ఓర్పు మొదలగు గుణములను జూపుచు తిక్కన వ్రాసిన భాగముల నొక్కచో జేర్చి చూపినచో, లోకమున కెంతయో మేలు కలుగునని నాయభిప్రాయము. భారతమందలి యితరపాత్రములనుగూడ నీతఁడు చక్కగా ప్రదర్శించినాఁడు.

ఆఱవది:- భావప్రకటనము. తాను చెప్పఁదలచుకొనిన భావము పాఠకులకు స్పష్టముగాఁ దెలియునట్లు చిన్న చిన్న మాటలతో వ్రాయు నేర్పు కవిశేఖరున కలవడిన ట్లింకొకరి కలవడలేదు. ఇరువురువ్యక్తులు మాటలాడునప్పుడది పద్యరూపమున నున్నను దృశ్యప్రబంధములో వలె నెదురుగా గూర్చుండి మాటలాడుకొనుచున్నట్లేయుండి పాఠకునకెంతయో యానందము కలిగించుచుండును. పౌరాణికున కట్టిసందర్భములలో నాభావమును దనమాటలతో శ్రోతలకు విప్పి చెప్పుట కవకాశము గలుగుచుండును. ఎంతెంతకఠినవిషయము నైనను చిన్నమాటలతో సులభముగాబోధపడునట్లు చెప్పుటలో నీతఁడు మిగుల నిపుణుఁడు.

ఏడవది:- రసపోషణము. సందర్భము ననుసరించి నవరసములును పాఠకుఁ డనుభవించుటకుఁ దగిన యభివ్యక్తిని గల్పించుట యందును, ఆరస ముప్పతిల్లుపదముల నుపయోగించుట యందును రస పోషణమునందును నీతనికిఁ గల శక్తి యపారము.

ఎనిమిదవది:- లోకజ్ఞానప్రదర్శనము. ఈ మహాకవీశ్వరుఁడు కేవల పండితుఁడును గవియు నే గాక లోకజ్ఞాన మెఱింగిన మహామేధావి.

శాస్త్రముల యందును గ్రంథముల యందును జెప్పఁబడినదియే గాక నిత్యమును ప్రపంచమున జరుగుచున్న విషయములను గ్రహించి యందలిమాదిరి చెప్ప నెఱింగి లోకవ్యవహారమును గాంక్షించి, తన యనుభవజ్ఞానమును దన గ్రంథములయందు బ్రకటించిన మహాపురుషుఁడీతఁడు.

ఈ కారణములచే నీతని కవిత్వము పండితపామర జనానురంజకమై సర్వజనహృదయాకర్షణ మొనరించుచున్నది. వీని కుదాహరణములను జూప నెంచినచో నది యొక పెద్దగ్రంథమగును.

ఈతని యాంధ్రీకరణ విధానము :

ఈ మహాకవి భారతాంధ్రీకరణమును యథేచ్ఛగా సాగించినాఁడు కాని మక్కికిమక్కిగా చేయలేదు. ఇతఁడు విరాటోద్యోగ పర్వములలో మూలమందలి కథను మాత్రము గైకొని తనయిష్టము వచ్చినట్లు పెంచియుఁ గుదించియుఁ బాత్రౌచిత్యముకొఱకును రసపోషణముకొఱకును చాలమార్పులఁ గావించి యాపర్వములను స్వతంత్ర గ్రంథ మనునట్లుగా రచించినాఁడు. భారతమునందు పాఠకులకును శ్రోతలకును నెక్కువయాహ్లాదమును గలిగించినవి, విరాటోద్యోగ పర్వములు. తిక్కనసోమయాజి తన లోకజ్ఞానమును, పాత్రౌచిత్యమును గమనించి, యీరెండు పర్వములను రచించియుండెను. ఈతని యాంధ్రీకరణ విధానముఁ జూపుటకై యాపర్వములనుండి యేదృష్టాంతమును గైకొనుట సమంజసమని యట్లుచేసితిని.

కౌరవసభకు శ్రీకృష్ణుఁడు రాయబారము పోవనున్నప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునితో నుడివినవాక్యములను, సంస్కృతభారతము నుండియు, తిక్కనభారతమునుండియు నెత్తి యీక్రింద వ్రాయుచున్నాఁడను.

"సుతా ద్రుపదరాజస్య అసితాయతమూర్ధజా
సంపూజ్య సహదేవంచ సాత్యకించ మహారథమ్"
"భీమసేనంచ సంశాంతం దృష్ట్వా పరమదుర్మనాః
అశ్రుపూర్ణేక్షణా వాక్యమువాచేదం మనస్వినీ."
"విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన
యథా నికృతి మాస్థాయ భ్రంశితాః పాండవా స్సుఖాత్."
ధృతరాష్ట్రస్య పుత్రేణ సామాత్యేన జనార్దన
యథాచ సంజయో రాజ్ఞా మంత్రం రహసి శ్రావితః"
"యుధిష్ఠిరేణ దాశార్హ తచ్చాపి విదితం తవ
యథోక్తః సంజయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా."
"పంచనస్తాత దీయంతాం గ్రామా ఇతి మహాద్యుతే
అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్."
"అవసానం మహాబాహో కంచిదేకంచ పంచమమ్
ఇతి దుర్యోధనో వాచ్య స్సుహృదశ్చాస్య కేశవ"
"నచాపి హ్యకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణ సుయోధనః
యుధిష్ఠిరస్య దాశార్హ హ్రీమతః సంధి మిచ్ఛతః"
"అప్రదానేన రాజ్యస్య యది కృష్ణ సుయోధనః,
సంధి మిచ్ఛే న్న కర్తవ్య స్తత్ర గత్వా కథంచన."
"శక్ష్యంతి హి మహాబాహో పాండవా స్సృంజయై స్సహ
ధార్తరాష్ట్ర బలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్."
"నహి సామ్నా నదానేన శక్యోర్థ స్తేషు కశ్చన,
తస్మాత్తేషు నకర్తవ్యా కృపా తే మధుసూదన."
"సామ్నా దానేనవా కృష్ణ యే న శామ్యంతి శత్రవః
మోక్తవ్య స్తేషు దండ స్స్యాత్ జీవితం పరిరక్షతా."
"తస్మాత్తేషు మహాదండః క్షేప్తవ్యః క్షిప్ర మచ్యుత,
త్వయా చైవ మహాబాహో పాండవైస్సహ సృంజయైః"

"ఏతత్సమం ధర్మం పార్థానాం తవచైవ యశస్కరమ్
క్షత్రియాణాం భవేత్ కృష్ణ క్షత్రస్యచ సుఖావహమ్"
క్షత్రియేణహి హంతవ్యః క్షత్రియో లోభమాస్థితః
అక్షత్రియో వా దాశార్హ స్వధర్మమనుతిష్ఠతా"
"అన్యత్ర బ్రాహ్మణాత్ తాత సర్వపాపేష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్"
"యథావధ్యే భవేద్దోషో వధ్యమానే జనార్దన,
స వధ్యస్యావధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః"
"యథా త్వాం న స్పృశేదేష దోషః కృష్ణ తథా కురు,
పాండవైః సహ దాశార్హ సృంజయైశ్చ స సైనికైః"
"పునరుక్తంచ వక్ష్యామి విస్రమ్భేణ జనార్దన,
కానుసీమంతినీ మాదృక్ పృథివ్యామస్తి కేశవ"
'సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యాత్ సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణప్రియా సఖీ"
"ఆజమీఢ కులంప్రాప్తా స్నుషా పాండోర్మహాత్మనః
మహిషీ పాండుపుత్రాణాం పంచేంద్ర సమవర్చసామ్."
"సుతా మే పంచభిర్వీరైః పంచజాతా మహారథాః,
అభిమన్యుర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః"
"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ."
"జీవత్సు పాండుపుత్రేషు పాంచాలేష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం సభామధ్యే వ్యవస్థితా."
"నిరమర్షేష్వచేష్టేషు ప్రేక్షమాణేషు పాండుషు
పాహి మామితి గోవింద మనసా చింతితోఽసి మే."

"యత్రమాం భగవా న్బ్రహ్మా, శ్వశురో వాక్య మబ్రవీత్
వరం వృణీష్వ పాంచాలి వరార్హాసి మతాసి మే."
"అదాసాః పాండవా స్సంతు సరథా స్సాయుధా ఇతి
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ."
"ఏవం విధానాం దుఃఖానా మభిజ్ఞోఽసి జనార్దన
త్రాయస్వ పుండరీకాక్ష సభర్తృజ్ఞాతి బాంధవామ్"
"నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః
స్నుషా భవామి ధర్మేణ సాహం దాసీకృతా బలాత్"
"ధిక్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్తమపి జీవతి"
"యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపా మయి,
ధార్తరాష్ట్రేషు వై కోపః సర్వః కృష్ణ విధీయతామ్."

వైశంపాయనః,

"ఇత్యుక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్
సునీల మసితాపాంగీ సర్వగంధాధివాసితమ్,"
"సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసమ్
కేశపక్షం వరారోహా గృహ్య వామేన పాణినా."
"పద్మాక్షీ పుండరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణా దీనా కృష్ణం వచన మబ్రవీత్"
"అయం తే పుండరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః
స్మర్తవ్య స్సర్వకార్యేషు పరేషాం సంధి మిచ్ఛతామ్"
"యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికాముకౌ.
పితా మే యోత్స్యతే వృద్ధః సహ పుత్త్రై ర్మహారథైః"
"పంచ చైవ మహావీర్యాః పుత్త్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభి స్సహ"

శా. పెంపేదం దమయొట్టి తక్కువలు రూపింపంగ నేలా? విచా
రింపన్ వారల మేలు సద్ధితము వారిం జూచినం దారు సా
ధింపంజాలరొ? కాక వారి దగవర్తింపం దలంచేవి శం
కింపం బట్టొకొ? వారు బ్రాహ్మణులె? రేకీడైన సైరింపఁగన్.

ఉ. ఓటు మొకింతయేనియు నపోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బొవ్వనే దుఃఖితమానము రొమ్ముడుపూనుగాక, యు
చ్చోటన పంగడంబు లగుచొప్పులు పుట్టిననైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకో? కాదరొ? కాననుండ నచ్యుతా!

ఉ. ఏటికి నింటి నావలన నింకను నీవును రాజు దమ్ములం
గామచితంబు నూరి మనకార్యము, మీసుజనత్వముం జెడం
గా నొకభంగిసేయుదక తగం గురువర్గముతోడి సంధి మీ
రైన తెలంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పులేర్పడన్

ఉ. జాలిసిపోకయున్, ఘనమనందులుయున్, గని పక్కనేరమిన్
మాటనోరిదాననయి మాటలు చిత్తమునందు నిల్పకే
గాలులు ప్రేలెదన్ వినుఁడు నక్కజము నెగ్గుము గాన నల్కమై
కీడె నిశ్చైనమానిసికి వెండి వివేకము గల్గనేర్చునే.

చ. వరము నఁబట్టితిన్, భరతవంశముఁ జొచ్చితి. నందఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి. జనవంద్యులఁ బొందితి. నీతివిక్రమ
స్థిరు లగుపుత్త్రులం బడసితిన్, సహజన్ముల ప్రాపుఁ గాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తి నెక్కినదాన నెంతయున్.

వ. అట్టుఁగాక,

ఉ. నీవు సుభద్రకులై గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయ; దట్టినఁ బంకజనాభ, యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందినవేణి పట్టి యీ
డేవురుఁ జూడఁగా సభను నీడ్చె! కులాంగన యిట్లొనర్తురే?

ఉ. ఆసభ కేశవస్త్రి ణాగుట్టి వరం గొంవచ్చి నొంచు దు
శ్శాసను జూచుచుం బతు లసంభ్రములై తగుచున్న లేక నా
యాసలు మాని చిత్రితుల యాకృతినున్న యెడన్, ముకుంద! వి
శ్వాసము తోడ నిన్ గొలుకవచ్చె మనం బదియుం దలంపవే?

చ. ఉరవగు మించేసి కోడలన కప్పడు దాసిగఁ జేసె నన్మహా
పురుషుని పాలికిం బతులు పోవఁగ వీలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁజేయుదునో? అటుగాక పాడియై
వరవుడ మోపి చేయుదునా వారికి? మాధవ నిశ్చయింపుమా!

వ. అని యట్లగ్గసించి,

ఉ. ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మనవిచ్చి వెంట్రుకల్
దావలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నాఁ కలసిల్లి త్రేఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ డగ్గుతేచి యార్తయై,

క. ఇవి దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్వపోయి దక్కినయవి కౌ
రవుఁ గడ దీఱు మాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వినుమా.

సీ. ఈ వెంట్రుకలు పట్టియీడ్చిన యాచేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరి రూ
పఱియకుండఁగ నియుద్ధు కాలుగాక
యలుపాలఁ బొనుపడునట్టి దిచ్చెడునె?
పెనుగదఁ బట్టిన భీమసేను
బాహుబలంబును బొలించి గాండీవ
ఘనునొక విల్లుప్పుడును సహించు

ఆ. కఱ్ఱివిక్రమంబుఁ గాల్పనే? యట్లు
బన్నములు పడిన ధర్మనందనులకు
నేఁడు రాజరాజపీఠంబుఁ గన్నారఁ
గానఁబడియె మైత్రిమేలిఁ గృష్ణ?

ఉ. నెట్టన యట్టియల్క మదినిల్పితి రక్కసతాల్మిఁ జొప్పడిం
గట్టినయట్లు కొర్దనయును గాలము దీనికి వాలు జెన్నడుల్
బుట్టదు దుష్టనిగ్రహము పూర్వ జగంబులు గాంచు నటితో
బుట్టవె నీవు, తేజమునఁ బొల్పిన భర్తలు గల్గ నచ్యుతా!

వ. అనుచు నెలుఁగు రాలువడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం
డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు
దుడువను, బెన్నొత్తివేణి ముడువనుం దగువారి నియోగించి యమ్మా
నినితో నిట్లనియె."

పై శ్లోకములను బద్యములను జదివి చూచినచో సంస్కృత భారతమునకుఁ దిక్కనసోమయాజి రచనము వన్నె పెట్టినదని తోఁపక మానదు. ఈ సందర్భమున శ్రీ కొ. లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిన వాక్యముల నుదాహరించెదను. "తిక్కనకృతిభారతము సంస్కృతమహా భారతమునకు భాషాంతరీకరణ మని పలువురు అనుకొనుచున్నారు; కాని యది గొప్పపొరపాటు. ఇట్లనుకొనుట మనము తిక్కనయెడ నొకయపరాధము చేయుటయే. సంస్కృతభారతము బంగారపుముద్ద. ఆ ప్రకారణమూ ముద్దలోనుండి కావలసినంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయఁబడిన చక్కనిసువర్ణకమలము వంటిది. ఉభయభారతములలోని యీ భేదముఁ జూపి స్వర్ణకారుని బుద్ధివైభవము కొండిచేయుటయే నాయుద్దేశము" విరాటోద్యోగ పర్వములందక్క తిక్కనభాగమును దిక్కన క్లిష్టము చేసినాఁడు.

పూర్వకాలమున విశేష రాజకార్యములలో నవసరము వచ్చి నప్పుడు మహారాణులు కూడ సభలోనుండి చర్చలలోఁ బాల్గొను చుండెడివారని యీకథవలన మనకుఁ దెలియుచున్నది. ఇట్టిసంప్ర దాయము పురాణయుగములో నేకాదు. చారిత్రకయుగమునఁ గూడఁ గలదు. పదునొకండవ శతాబ్దిప్రాంతమున మనదేశముపైకి దండెత్తి వచ్చిన సహాబుద్దీనునకు సాహాయ్య మొసఁగుచున్న జయచంద్ర మహారాజుపై యుద్ధముచేయఁబోవుచు నాతనియల్లుఁ డగు పృథ్వీరాజు చిత్తూరురాణాయైన సమరసింహుఁడు మొదలగు మహారాజులతో నాలోచించుటకై యొకసభను సమకూర్చెననియు, పృథ్వీరాజు వాజ్ఞానుసారముగ నాతని రాణియు జయచంద్రుని తనయయు గు సంయుక్తాదేవి యాసభకువచ్చి సమరతంత్రములలోఁ బాల్గొని దేశమత సంరక్షణమునకై జయచంద్రునితోఁ బోరుసల్పుట యుచితమే యనియు నందుఁ దండ్రి ప్రాణములు పోయినను దానములకుఁ జంపవలెననియుఁ దెల్పి భర్త ప్రయత్నమునకుఁ దోడుపడియెననియు, నప్పుడాసభయం దున్న చాందూభట్టు అనుమహాకవి 'పృథ్వీరాయరాసా' యనుగ్రంథమున వ్రాసి యున్నాఁడు

## తిక్కనమహాకవి రచించిన కావ్యములు.

తిక్కనసోమయాజి సంస్కృతాంధ్రములయందుఁ బెక్కు గ్రంథములను రచించినట్లు చెప్పుదురు. కాని రెండుగ్రంథములు మాత్రమే మనకిప్పుడు లభ్యము లగుచున్నవి. అందు మొదటిది నిర్వచనోత్తర రామాయణము. రెండవది శ్రీమహాభారతము.

## నిర్వచనోత్తర రామాయణము

ఇది వాల్మీకిరామాయణములో సప్తమకాండమున కాంధ్రీకరణము. రావణవధానంతరము శ్రీరామచంద్రుఁ డయోధ్యయందు పట్టాభిషిక్తుఁడగుపిదపను జరిగినకథకుఁ బూర్వరామాయణమని పేరు. ఇది

యేడుకాండలుకలదు. ఈయేడుకాండములలోను జెప్పని రామ జననాది పూర్వవృత్తాంతమును శ్రీరామపట్టాభిషేకానంతర సీతావనవాస కథయు కుశలవ జననాది కథలును నేడవకాండమున నున్నవి దీని నుత్తరరామాయణమని పేరు. దీని నీ యుభయకవి మిత్రుఁడు తెనిగించె ను గ్రంథమునఁ దెచ్చుటను వచనము లేకుండ రచియించుటంజేసి దీనికి నిర్వచనోత్తరరామాయణమని పేరువచ్చినది. కవులు సాధారణము గాఁ గథాసంబంధమును గలుపు పట్టులయందును, వర్ణనలనుఁ జేయుపట్టు లను వచనములను రచియించుచుందురు. అట్టివి లేకుండ నాభాగము లను గూడఁ బద్యములచేఁ బూరించిన సొంపుగ నుండునని తన యభి ప్రాయమును దిక్కన యీక్రింది పద్యములలో వ్యక్తీకరించినాఁడు.

క. వచనము లేకయ వర్ణన
రచియింపఁగ నెంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగఁ జెప్పు టార్యు లొప్పిద మనరే?

క. లలితపదప్రాశస్త్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁగా
పాల సంధించిన విధంబు నమరఁగవలయున్.

ఇతఁడు పూర్వరామాయణమును విడచి యుత్తరరామాయణ మును దెలిఁగించుటకు గారణ మంతకుఁ బూర్వమే పూర్వరామాయణ మును భాస్కరుఁడాంధ్రీకరించియుండుటయే యనియు భాస్కరరామా యణమును రచించిన దితని పితామహుఁడైన భాస్కరుఁడే యనియుఁ గొందఱనుచున్నారు. ఈసందర్భమున దిక్కన రచించిన రెండుపద్య ములనుదాహరించుచు వానినిగూర్చియు, భాస్కరరామాయణ కర్తృ త్వమునుగూర్చియు మంత్రిభాస్కరుని చారిత్రమున విపులముగాఁ

జరిగించియున్నాఁడను. ఆవిషయమును మరల నిటవ్రాయుట పునరుక్తియని విడచితిని. తిక్కనసోమయాజి భారతాంధ్రీకరణమువలెనే నిర్వచనోత్తర రామాయణమును నక్కికిమక్కిగాఁ జేయక స్వేచ్ఛగైకొని రచించియున్నాఁడు. నిర్వచనోత్తర రామాయణమును పదియాశ్వాసములుగా రచియించి తనప్రభువగు మనుమసిద్ధి మహారాజున కంకితముచేసెను. ఇందు నన్నయవలెనే యితఁడును తన గ్రంథము మొదల నాంధ్రపద్యమును వ్రాయక యీక్రింది సంస్కృత శ్లోకమును రచియించెను.

శ్లో॥ శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తమ్భే జగన్మణ్డల
ప్రాసాదస్థితి భారభాజి దధతీ సాసాలభఞ్జీశ్రియం
శుద్ధాలోకితమగ్ణభిత్తిషు మదవ్యాసఙ్గవశ్యాస్మనాం
యా ముత్రేజయతేతరాం మధులిహా మానన్దసాన్ద్రాంస్థితిః॥

## శ్రీమహాభారతము

వ్యాసవిరచితమైనసంస్కృతభారతమునందలిపదునెనిమిదిపర్వముల లోను నన్నయభట్టు ఆదిపర్వమును, సభాపర్వమును, అరణ్యపర్వమునఁ గొంతభాగము నాంధ్రీకరించెను.

తిక్కనసోమయాజి యారణ్యపర్వమునందలి తక్కిన భాగము నాంధ్రీకరింప వలసియుండఁగా దానిని విడచి విరాటపర్వాదిగాఁ బదునైదుపర్వముల నాంధ్రీకరించెను. తిక్కనరచించిన :

ఉ. ఆదరణీయ సారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతిసై పెనుపొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యాదయితుండు దొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్

మ. హృదయాహ్లాదిచతుర్థమూర్తికథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వముల యుద్యోగాదులుం గూడఁగా

బడు నేలింటిఁ దెనుఁగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టం రచియించు టొప్పు బుధసంతోషంబు సిద్ధారఁగన్.

అను పద్యములను బట్టి యారణ్యపర్వమును నన్నయభట్టు పూర్తిగనే రచించినట్లు కన్పట్టుచున్నది. కాని సాక్ష్యమిందుకు వ్యతిరేకముగా నున్నది. ఈవిషయమునుగూర్చి యెఱ్ఱాప్రగ్గడచరిత్రమునఁ జర్చింపఁ దలంచి యిట వదలివైచితిని.

ఆధ్రిలో కాశ్యపాయాముని గాంక్షించి, ఈమహాభారత నిర్మాణకార్యమునకుఁ దాను బంసిద్ధుఁడనైతినని యాకవిసార్వభౌముఁ డీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

"ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్కృతి
శ్రీ భవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షాపరి నొంది పద్యముల గద్యములన్ రచియింతు నెదంగృతుల్"

పరిశాంతహృదయముతో భారతరచనమునకు దీక్షఁ గైకొనిన యా పుణ్యపురుషుఁడు తెలుఁగుభాషలో భారతమును రచియించుట "పురుషార్థపరుపక్వఫల"మని హరిహరనాథుఁడే రచియించిన ట్లీకవి యీక్రింది పద్యములలోఁ దెలిపినాఁడు.

క. పారాశర్యనిసృతి యాయు
భారతమను పేరఁ బరగువంచమవేదం
బారాధ్యము జనులకు ద
ద్గౌరవ మూహించి నీవకుంఠితభక్తిన్

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కెవ్వఁడు యొకొని వేడ్క నూని కృతివ
తిత్వ మొప్పించినప్పుడు దిక్కశర్మ!

ఆంధ్రభాషలో ప్రాశస్త్యము లగు కావ్యములను రచించినవారిలో తిక్కనసోమయాజిని మొదటివానినిగా నెన్నవచ్చును. ఇంతేకాదు, పరిమాణము నందుఁగూడ నీతనితో సమానముగ గ్రంథరచనము గావించిన యాంధ్రకవు లింకొకరు లేరు. నిర్వచనోత్తర రామాయణమున దాదాపు ౧౩౦౦ పద్యములును, మహాభారతమునఁ బదునాఱు వేల గద్యపద్యములును గలవు. ఈతని రచనములందుం దేభాగమును దీసి చదివినను విసువు జనింపక యింకను జదువవలయు ననియే యుత్సాహము కలుగుచుండును.

## తిక్కన పద్యరచనము

కందపద్యరచనమునం దీతఁడు కడు నేర్పరి. మన దేశమున "పందిని బొడిచినవాఁడు బంటు, కందమును జేసినవాఁడు కవి" యను నొక నానుడికలదు. కందపద్యమును రచించుట కష్టతరమని దీని యభిప్రాయము. కవిచౌడప్ప చెప్పిన:

"క. ముందుగఁ జను దినములలో
కందమునకు సోమయాజి ఘనుఁడందురు నేఁ
డందఱు నను ఘనుఁడందురు
కందమునకుఁ గుందవరపు కవిచౌడప్పా"

అను పద్యమునుబట్టి పూర్వకాలమునఁ దిక్కనసోమయాజి కందములు నుతికెక్కినవని తెలియుచున్నది. ఇతఁడు కందపద్యములను సరసముగా రచియించుటయేకాక సంఖ్యయందుఁగూడ వాని నధికముగా వ్రాసియున్నాఁడు. దాదాపు ౧౩౦౦ పద్యములుగల నిర్వచనోత్తర రామాయణములో నైనువందల యిరువదియాఱు కందములున్నవి. భారతమునఁ గల మొత్తము గద్యపద్యములు పదునాఱువేలలోను మూఁడవభాగమయిన యైదువేల మూఁడువందలు కందపద్యములు. భాస్కరరామాయణము

న మల్లికార్జునభట్టు రచించిన భాగములోఁ గూడ నూటికి నలువదికి మించి కందపద్యములు కలవు. మల్లికార్జునభట్టు పేరఁగల భాగములోఁ జాలభాగము మంత్రిభాస్కరుఁడు రచించెనని యొకవాదము కలదు. ఆ వాదము సత్యమయ్యెనేని, తాతయు మనుమఁడును, శూరులును మంత్రులు, నగుటయుండే కాక, కందపద్యరచనమునఁ గూడ నొకరి కొకరు దీసిపోక వంశమర్యాదను గాపాడిరని విదితమగును. విరాట పర్వాదియందుఁ దిక్కఁ దిక్కనప్రతియాశ్వాసాదియందును దిక్కన కంద పద్యములనే వ్రాసియుండెను.

తిక్కనసోమయాజి సామాన్యముగా, శార్దూల మత్తేభాదిపద్యములనే గాని, కవిరాజవిరాజితాది వృత్తములను రచియించుటలో నేర్పరి కాఁడని యెవ్వరో యాక్షేపింపగా స్త్రీపర్వమునఁ గష్టపడి యాతఁడు విశేషముగా వృత్తములను రచియించెనని కొందఱనుచున్నారు. స్త్రీపర్వమున నట్టివృత్తములు విశేషముగా నున్నమాట సత్యమే కాని, యెవరో యాక్షేపించిన మీఁదట వానిని రచించెననుట సత్యముండదు. స్త్రీపర్వమందలి కథ దుఃఖకరమైనది అందు స్త్రీపాత్రము లెక్కువగా పాల్గొని శోకపూరితములగు వాక్యములను బల్కుచుండుటగాననగును ఆకథ కనుకూలముగ నుండునని యావృత్తముల నాతఁడు రచియించి యుండును. చంపకోత్పలములుగాని, మత్తేభశార్దూలములుగాని, స్త్రీ పర్వమున లేవు. దాదాపు నలువదివిధములగు నితరవృత్తము లిందుఁ గలవు.

ఈతఁడు రచియించిన రెండుకావ్యములలోను, నిర్వచనోత్తర రామాయణకవిత్వముకంటె మహాభారతకవిత్వము రసవత్తరమై యారితేరి హృదయంగమముగా నున్నది. నిర్వచనోత్తరరామాయణమునఁ గొన్నితావులలో నీతనికవిత్వము నారికేళపాకములో నున్నదని కొంద ఱందురు. కాని యది సత్యముకాదు.

ఈతని కవిత్వశైలి చూపుటకిదివఱ కుదాహరింపఁబడిన పద్యములే చాలియున్నవి. ఈతని పద్యము లన్నియు, రసవంతములై యుండును. అట్టివానిలో మంచివాని నేఱియేర్పఱుచుట యసంభవము అయినను, రామాయణమునుండి యాశ్వాసమున కొకటివంతున పదిపద్యములను, భారతమునుండి పర్వమున కొకటిచొప్పున పదునెనిమిదిపద్యముల నీదిగువ నుదాహరించుచున్నాఁడను. మెచ్చుచూపుటలో మంచిచెడ్డలు రెండిటినిగూడఁ జూపుట ధర్మముకదా!

నిర్వచనోత్తర రామాయణము:

చ. జనకునియజ్ఞవేదికఁ బ్రశస్తగుణా జనియించి యంగనా
జనతకు భూషణం బనఁగ జాలిన సీతకు రుద్రచాపభం
జన మనునుంకు విచ్చి నృపసత్తముఁ డాతెఁ బరిగ్రహించి పే
ర్చిన యుభయానురాగమునఁ జిత్తభవుం జరితార్థుఁ జేయుచున్. ఆ౧

చ. వరములు గాంచి బాహుబలవంతుఁ డనం దగుమాల్యవంతుఁడ
చ్చెరువగు విక్రమంబునఁ బ్రసిద్ధివహించి నిజానుజన్మలం
గర మనురక్తి మన్ననఁ దగం గొనియాడుచు సర్వలోకభీ
కరుఁ డయి దేవతామునినికాయము దల్లడమందుచుండఁగన్. ఆ౨

చ. తనయుఁడు తండ్రియగ్రజుఁడు తమ్ముఁ డనం జనునయ్య రాజ్యముల్
గొనునెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే
యను నగునంతకున్ రిపుసదగ్రత సైఁచిన నింక నూరకుం
డ నగునె వేగపోరికిఁ గడంగుము నీభుజదర్ప మేర్పడన్. ఆ౩

శా. కేళీకందుకవల్లి నెత్తుకొనుమా డిక్కెం బట్టి నాయున్న యా
కైలాసాచల మిప్డు నీవు నొయ్యంగా నెత్తినం జోద్యమై
సీలా వేఁగొనియాడు జెల్లరును వర్ణింపంగ నీకొక్క పే
రేలోకంబునఁ జెల్ల దైత్యులకుఁ బెంపెక్కంగ నేనిచ్చెదన్. ఆ౪

చ. పరమపతివ్రతావిభవ భాసురలీల వెలుంగుచున్న ని
ష్కరుణతి విస్మయంబటచెఁ గావున నీచనుశాధముండు స
త్పురుషపరిగ్రహాం బయినపుణ్యసతిం గలుషింపఁజేసి త
ద్వరుని పరాక్రమంబున నవశ్యమువృత్యువుఁబొందుఁ గావుతన్ ఆ౫

ఉ. వంచిన కెంపుఁ జాపిదివిఁ బ్రాకి దిశల్ వెలిఁగించి చంద్రకాం
తంబుల నీరు సేసి కుముదంబులఁ బిందువు సేయఁ బంచి యు
ష్ణాంబుల నిద్రపుచ్చి మరుసాయకముల్ గరసావఁబట్టి కో
కంబుల నేఁచి లోకము వగస్త్రులు సేకొని చంద్రుఁడున్నెసన్. ఆ౬

శా. వాలింగీటయు వాయుపుత్రు సరియే వాఁడాత్మశక్తిజ్ఞుఁడై
యీలోకంబులు గెల్తునే ననిన మా కొందుగలండే మహీ
పాలాగ్రేసర వానివర్తనముఁ జెప్పం జిట్ల లాఘిక్రిమ
శ్రీలా లున్ భవదీయసన్నిధిఁ బ్రశంసింపంగుం జెప్పెదన్. ఆ౭

ఉ. రావణునింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం
భావన సేఁత కష్టమనిపల్కిరి చూచితె లక్ష్మణా? మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణంబులు మెచ్చ నయ్యెడం
బావకుఁడిచ్చె నాకు సతిఁ బాపపుమాటలు పుట్టె నియ్యెడన్. ఆ౮

మ. ఒకనారీతిలకంబు గానవములో నుద్దామశోకార్తయై
వికలాలోకన మశ్రుధారలను బ్యాధ్విరేణులిప్తాంగముం
బ్రకటాక్రందనముం బికీర్ణకబరీభారంబు వక్త్రోష్ణశో
షకనిశ్వాసగమోహమ్మునుం గలావస్థం బొందఁగా నయ్యెడన్. ఆ౯

చ. జయజయశబ్దముల్ సెలఁగ సర్వజనంబు నెలర్ప నర్మిలిం
బిలయసుత యుగ్మముం దిగిచి పెద్దయుఁ బ్రొద్దొకఁ గౌగిలించి మో
దయుతమనస్కుఁడై నృపతి దమ్ముల నమ్మెయి నొందఁజేసి య
వ్యయపదవృద్ధి తల్లుల మనం బలరం బ్రకటించి వేడుకన్. ఆ౧౦

మహాభారతము :

ఉ. ఈశ్వరదత్తశస్త్రుఁడు సాహసి దగ దిగ్విజయంబు సేసె వి
ద్యాశయయార్ద్రి వాసవు మహాసన మైనను నెక్కె నచ్చటం
బ్రోత్సాహితమూర్తి కౌరవకులోద్భవులం దొక్కసి కాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీ చిరుతకర్జునుఁడం దగునే నరేశ్వరా.   వి. ప.

మ. తుది రాజ్యమ్మొసగమ్మె గో న్మదవియుందుం జేసు పంపించియుం
బదమూఁడేడులు నీవుసుం దిరిగి రా పాలీక కోవచ్చునె
యది గాదేఁ దెగి బంట్లవై యలియు మాయ ల్లన్ను నేప్రింక చె
ల్లదు సూ పీకని యాసుయోధను యుల్లం బిచ్చిపోవాడమా ఉ. ప.

ఉ. కోపము సంహరింపు యదుకుంజర! పాండవకోటి కెల్లనుం
దేపవుగా నీ నీవిటు ధీరతఁ బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుఁ డైన ధర్మసుతుశౌర్యము ధైర్యము బాహువీర్యముం
రూపఱిపోక కాదె యపరూపమె నీ కిది లోకనాయకా.   భీ. ప.

చ. వినుము కిరీటి! దివ్యశరవేదివి నాఁజను దేవ తేజిచో
టను ముసి నెల్లె చిక్కు విచటం జనిత్తునె యిష్టనీబలం
బును హరి నేర్పుఁ జూచుటకుఁ బోరికివచ్చి నీవు పాండుభూ
జానకు జనించితేని దెగి చూపుకు శౌర్యమునస్త్రవీర్యముం. ద్రో. ప.

శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరిశ్రాంతుండు కర్ణుండు దు
ర్దాంతోద్రగత నేఁడు గెల్చెఁ జుమీ నాఁడా తసిన్ దహిమ్న య
త్యాంతంబుం శితిరత్న మొందినను గోత్రాళుల్ వడంకాడినం
గుంతీసూనునిచేతఁ గర్ణునకుం గోల్పాటు వాటిల్లునే   క. ప.

చ. చదివితి నెల్లవేదములు జన్నము లొప్పఁగఁ జేసితిం రమా
స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలకు లెలము గొల్వఁగంటి దు
ర్మదరిపుగాఢగర్వహరిసుక్సవకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతోఁ బ్రిదివంబున కేఁగుటొప్పదే. శ. ప.

చ. దురమునఁ బెంపుఁ జేయను దృఢమూలల వెలుంగుచుండ సు
స్థిరత శమంతపంచక విశిష్టతరంబులఁ బోలి స్వర్గతిన్
బొరసెదు నీకునై వగవు పుట్టదు బంధులు రాజు దేవులున్
దిరియుదు రింక వారి దగుదీవన కోర్వక యుమ్మలించెదన్. సౌప.

మంగళమహాశ్రీ:

ఈశుఁడు దినంబునకు నెత్తినదుచుండియును
నెంతయును భక్తిఁ గని నాతుం
బ్రీతి యొసఁగం బలికి ప్రేమ మొలయం బొగడి
హృద్యము ప్రసీతిరతుండై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుఁగ దీవన వి
శిష్టనయ నిమ్మలిన ధర్మం
జేతల ననూనమగు విఘ్నజయ మగు మాతలకు
నెట్లును సిద్ధాగు నంటిన్. స్త్రీ.ప.

మ. నిజదారైకపరత్వమున్ గరుణయున్ నిక్కంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథి సంతుష్ట్యార్చనల్ హవ్యము
గ్నిజనంబులన్ సకలాశ్రమస్థలము శక్యప్రక్రియం బ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములు గాఁ గల్పించె నర్థిన్ ధరా. శాం.ప.

చ. అశననిఁ జేసి సురలాదిమునుల్ మహితానుభావులై
రనఘు సహస్రవర్షమనంతరకల్పిత మైన యొకభు
క్తినియమమాత్రముల్ సడపి గాధిసనూజుఁడు బ్రాహ్మణత్వమున్
గనియె మహోపవాసములఁ గాని ఫలంబులు లేవు ధూవరా. అను.

ఉ. ఉత్తర బిడ్డనెత్తుకొని యొయ్యన మో వలవంగ వచ్చి య
త్యుత్తమతేజుఁడైన పురుషోత్తము నంఘ్రులపొంత భూస్థలిం
జిత్తమెలర్పఁగా దనదు చెన్నగు ఫాలము సేర్చెనమ్ముదా
యుత్తమసుక్షుఁడై యతఁడు సాదంభాషల గారవించుచున్. అశ్వ.

రాంధ్రులచరిత్రమున నీ క్రిందిపద్యముల నుదాహరించి యున్నారు. ఈ పద్యములు వారి కెట్లు లభించినవో తెలియదు

"సీ. ఘనసారకస్తూరికాగంధముల నన్ని
గంధబంధంబులు గలిపి కలిపి,
కుసుమితవల్లికాలలితవీథులఁ జొచ్చి
కని సరోగృహముల మునిఁగి మునిఁగి,
సమధికాహార్యాంగసంగీతములలోన
కన్నెతీఁగలకాట కలిపి కలిపి,
కుముదకుట్మలకోటికోరకంబులు దూఱి
యవిదంపతులనిద్రఁ దెలిపి దెలిపి,

గీ. యమునదినమ్ము నప్పురాంతికమ్మున గట్టు
వాలు వోలె విప్రవరుఁడు వోలె
నట్టువోలెఁ దాను నచ్చిన చెలి వోలె
మెలయుచుండు మందమారుతంబు.

ఉ. పల్లవపుష్పసంపదలఁ బెంచి వసంతుఁడు కాపు గాకపై
రొల్లవనంబు సంకటము లేదఁగఁ దా రొడికంబు మీఱ న
ట్లల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బురాణపత్త్రముల్
డుల్లఁగఁ జేసె సత్క్రియఁ బలుక్వము కాముఁడు పిచ్చలింపగన్."

విజయసేనము : (ప్రబంధరత్నావళిలోనిది)

ఉ. అల్లనఁ దొంతమెత్తి శిఖ నౌకలయొటిఖలంబు పుచ్చి సం
ఫుల్లతఁ బొదపీఠము పొంతనయున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోఁకఁగఁ జేయు నట్లు శో
భిల్లగజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్.

శా. గీర్వాణావలహారు వాత్మరావణ క్రీడాహతం బైన న
య్యుర్వీశాంఘ్రిపము నంక నంత ఘనరత్నోద్యత్ప్రభా లుర్వి దృ
క్పర్వంబై పొదికట్టి పేర్చిన మదిం గంబంబ యంచుం గిత
గ్గర్వోన్మీలితనేత్రుఁడై మెఱయు వేదండాననుం గొల్చెదన్.

సీ. పద్మంబులును వప్రపద్మాగప్రతి
　　బింబములును తెగ జొచ్చి మెఱయఁ
కల్లోలములును రంగన్మకరాయిత
　　తుండములును విటు తోఁచుపడఁగ,
బిసములు విహారిణీరసనమాకలరసా
　　తలనాగ శిశువులు చెలిమి సేయఁ
జక్రియుగ్మంబులు జలకేళిలోలని
　　తంబినీ స్తనములు తమఁబడంగ

గీ. సొంపుమీఱి నట్టిపెంపును గంభీర
తయును ఒంపుచోవు వేడ్కఁ దగిలిజనులు
సంస్తుతింప నఖిలసన్నుతస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

ఉ. తరుణుల వీఁగుఁజన్నుఁగవ తాఁకున మన్మథచక్రవాకబం
ధురగతి లీలఁ గామినుల తోరపుటూరుల ఘట్టనంబుఁ గా
క్షీవరహస్తకాండపటుఘట్టనలన్ ఒరిఖాతెంగము లీ
దిరుగుడు వద్దతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్.

చ. కొనియెద మన్మబండకుఁ గోటులకమ్మెదు; రమ్మఁబూని తె
చ్చిన సర కెంత పెద్దవెల చెప్పినఁ గొంత్రు తగంగ నిచ్చి; న
చ్చిన వెలతీర్చి లక్ష్మి తమ చెప్పినయట్టుల చేయు సొంపు పే
ర్కొన గణుతింప రాదు; పుఁకోమటులం బ్రణుతింప నొప్పదే?

క. కిసలయాకారశ్రీభినబిం
బసుధాంశుప్రాయవస్తు బహువిధరూపో
ల్లసము మన మునుప నజుఁడోక
యసమాకృతి దాల్పె నసఁగ నంగన యొప్పన్.

సీ. మదనవశీకార మంత్రదేవత దృష్టి
గోచరమూర్తిఁ గైకొనియె నాఁకొ?
సితకరబింబ నిస్సృతసుధాధార సి
తంబినీరూపంబు దాల్చె నాఁకొ?
విధి కామినీశ్రేష్ఠ విజ్ఞానపటిమ
భాసురతను లీలఁ బడసెనాఁకొ?
శృంగారరసపరస శ్రీవిలాసోన్నతి
సుందరాకారంబు నొందెనాఁకొ;

గీ. కాక యొకవిధాతకుఁ దుష్ప్రాంగఁ బుట్టిన
భామకేల గాట్టిరామణీయ
కంబు కలుగుననుచుఁ గన్నుదాపై మహీ
పాలసుతుఁడు దృష్టిఁ బాఱిపెనర్థి

సీ ఆరిమాసనమ్ములు దరికొనియేర్పు నె
వ్వని యుజ్జ్వలాకార వైభవంబు?
బంధులలజ్జానతిఁ బొందునట్లుగఁ జేయు
నెవ్వని పాండిత్య మొసకఁ మొసఁగ?
సెట్టిమాన్యుల నైన నెవ్వని వితరణం
బులు వదిజనుల చాల మొనర్చు?
వనితాజనము మానధనముఁ గోల్పుచ్చు వి
చ్చలవిడి నెవ్వాని విలసనంబు

గీ. అటి విజయసేన నభిరామమూర్తి వి
ద్యానిరూఢమతి వదాన్యవరుఁడు
వ ధురవిభ్రమైక నిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణసమగ్రుఁ డగుట.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుండై పరీక్షించినన్
దిత్స్యావ్యగ్రుఁడు గాక విగ్రహమునో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్య్రముఁ జూపి శక్యము దెసన్ బ్రారంభియై భూప్రజా
వాత్సల్యార్థమనస్కుఁ డైననతి శశ్వచ్ఛ్రీసమేతుండగున్.

క. పరధన పరాంగనార్జన
పరిహారము ధర్మపథ మందురు స
త్పురుషులు మఱవక దీనిం
బరికింపుము విను మెపుడు పైశున్యంబున్.

గీ. మహిమ చెడదు స్వామ్యమాత్య సుహృత్కోశ
రాష్ట్రదుర్గబల పరాయణులకు
నీవు విదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రవిధుని.

ఈ క్రింది సీసపద్యము తిక్కన విజయసేనము లోనిదని బ్ర శ్రీ
మానవిల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు.

సీ. అమ్మోదననిఁ బద్మాత్మకౌస్తుభ మైన
వెలువక కొనినాఁడి వేఁపుగలిగి
విలువ యిచ్చెదమని వేఁడినఁ బలిజున్నుఁ
గమ్మసిండియు నమ్మఁగలిగి
దేవస్తు వెంత ప్రొద్దైందఱు చనుదెంచి
గొంతటికడిగిన నెదురఁ గలిగి

తమయింట లేనియర్థము లర్థపతియింట
నైన వెదకిన లేవనుట గలిగి

గీ. తమకులాచార వర్తన(?)ము గొఱకు
సంగడుల యొప్పునకును బేహారుమాట
గాని లాభమునకు గాదనంగ
వఱలుదురు పురవరమున వైశ్యవరులు.

ఈ పద్యమును బ్ర. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ ప్రబంధ రత్నావళి పీఠికలో నుదాహరించుచు, పై పద్యములలో నొకటి వైశ్య వర్ణన మున్నది ఇదియు వైశ్యవర్ణనమే. రెండు పద్యములును విజయ సేనములోనివే యగునా? యని శంకించినారు. పై పద్యములలో గజపతి స్తోత్రమును రెండుపద్యములలో నున్నది. పాఖావర్ణనము రెండు పద్యములలోఁ గన్పట్టుచున్నది. జగ్గనకవి సమకూర్చుటలో నేదైన పొరపాటు జరిగెనా? లేక తక్కినయే యట్లు రచించెనో? చెప్పఁ జాలము. చిమ్మపూడి అమరేశ్వరుఁడను మహాకవి విక్రమసేన మను నొక ప్రబంధమును రచియించియుండెను. అందలి నాయకుఁడు విక్ర మసేనుఁడు. నాయిక విషయశ్రీ. తక్కిన విజయసేనములోని నాయ కుఁడు విజయసేనుఁడు. నాయికపేరు లభింపలేదు. ఈ గ్రంథముల నామాక్షరములలో రెండవ మూఁడవ యక్షరములు దక్కఁ దక్కినవి సమానము లగుటచే జగ్గకవి గ్రంథనామముల నిచ్చుటలో పొరపాటు పడెనో నేమో!

అప్పకవియును, కస్తూరిరంగకవియును, నీక్రిందిపద్యము విజయ సేనములోనిఁ దని సంశయస్థలత యతికి లక్ష్యముగా నిచ్చియున్నారు.

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూని యిమ్మెయిన్
జల్లన నుండె దేల యుచితస్థితికి న్మనుఁ బొంచఁ జూపినన్

దల్లియు బంధుశోకమును దండ్రియు నే మనవా రెఱింగిరే
నెల్లను యిల్లు వీకుఁ దగునో తగదో పరికించి చూడుమా!

కాని యాంధ్రమున నె చిన్నప్రొడి యమరేశ్వరుని విక్రమసేనములోనిదని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున నుదాహరించి యున్నాఁడు. దీనినిబట్టి విజయసేన విక్రమసేనములను జెప్పుటలో తారుమారు జరుగుచున్నదని నిశ్చయింపవచ్చును. అట్లయినచోఁ గైకొని వ్రాసిన వానిలో నొకే విషయవర్ణనముగల రెండుపద్యములలో నొకటి తిక్కనసోమయాజియు నొకటి యమరేశ్వరుఁడును రచియించి యుందురు. గజాననస్తోత్రపద్యములు రెండింటిలో నుత్పలమాలను దిక్కనయు శార్దూలము నమరేశ్వరుఁడును రచియించి యుందురు. పరీక్షావర్ణమున సీసపద్యమును వైశ్యవర్ణనముగఁ జంపకమాలయు దిక్కన రచితములని నాయభిప్రాయము. తిక్కన విజయసేనమును రచియించి యుండుట సత్యమేని, యది నిర్వచనోత్తర రామాయణమునకుఁ బూర్వమై యుండును.

(2) కవిసార్వభౌమ ఛందస్సు.

ఈమహాకవి యాంధ్రమున నొక ఛందోగ్రంథమును వ్రాసి యుండెనని చెప్పుదురు. దానిపేరు కవివాగ్బంధన మని కొందఱును కవిసార్వభౌమ ఛందస్సు అని కొందఱును జెప్పుచున్నారు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున 3౬ పంక్తులు గల యొక చిన్న పుస్తక మొకటి యున్నది. గ్రంథాంత పద్యమిది:

క. తనరఁగ గవివాగ్బంధం
బను ఛందం బవని వెలయ బూర్ణముతోఁ ది
క్కనసోమయాజి చెప్పెను
జనులెల్ల నుతింప బుధుల సమ్మతి గాఁగన్.

అంజలిపతి రెండుపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

క. కులములు గుణములు వేళలు
నలరింగము లంగములును నా గ్రహ వేళల్
తెలియఁగ వలయును గవి తలఁ
బలికెడువర్ణంబు లైదుపదుఁకు మొదఁటన్.

క. అకచటపవర్గలు విప్రులు
ప్రకటిత యవయుపలు నృపులు రయబహళషసల్
వికసిల్లు వైశ్యకులమున
సుకవిస్తుత! క్షళ రెండు శూద్రకులంబుల్.

తంజావూరు నందున్న పుస్తకభాండాగారమున నొక తాళపత్రప్రతి యున్నది. అందలి గ్రంథాంతపద్యమును పైపద్యమును నొక్కరీతిగనే యున్నవి. ఆప్రతియందలి మూఁడు పద్యములివి:

క. విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబు సత్కవిత్వము ఛందో
వేద్యము గావునఁ జెప్పెద
హృద్యంబుగఁ గవితఛంద మేర్పడఁ గృష్ణా.

ఈపద్యము సూత్రసారమున నున్నట్లు వావిళ్ళవారి ముద్రితప్రతి వలనఁ దెలియుచున్నది. కాని సులక్షణసార గ్రంథకర్త వెల్లంకి తాతంబట్టని ప్రకటించిన వావిళ్ళవారి గ్రంథమునుబట్టి యీపద్యకర్తృత్వమును నిర్ణయింపఁజాలము.

ఆ. చాలు కాల కూలు సంహారవచనంబు
లోలి కావ్యమందు నొనరె నేని
ఫాలలోచనుఁ డయిని భస్మమయి పోవును
బాలవార్ధిశయన బాలకృష్ణ!

మ. స్వరవర్గద్రుతముల్ శకంధుగుణము తప్రాక్స్యభేదర్ణసు
స్వరభిన్న ప్రభుకాకుత్యములు దేశ్యజ్ఞోభయాఖండముల్
సరసాదేశవిభాగవృద్ధులును మాసంయుక్త వైకల్ప్యముల్
గరిమన్ బోలిచి చక్రపెక్కటి యనంగా నిర్వదేడౌ యతుల్

తిక్కనసోమయాజి యాలక్షణగ్రంథము రచించెనని నమ్ముటకవకాశములేదు. ఈతనితో సమకాలికుఁడైన కేతనకవి యాంధ్రభాషాభూషణమున నదివఱ కెవ్వరును దెనుఁగునకు లక్షణము చెప్పలేదని యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఆ. కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చ
బరఁగ దశకుమారచరితంబుఁ జెప్పిన
భోజు నన్ను వేఱ పొగడనేల

క. మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరునుఁ జెప్పరేఁ జెప్పెద వి
ద్వన్నికరము మదిమెచ్చఁగ
నన్నయభట్టాదికవి జనంబులకరుణన్.

తిక్కన లక్షణగ్రంథము వ్రాసియున్నచో గేతనకవి యట్లు చెప్పియుండఁడు. తిక్కనయే యాగ్రంథము వ్రాసియున్నచోఁ జైవస్యముగా "పాలవార్ధి" యని చెప్పియుండఁడు. 'పాలకడలి' యని యుపయోగించి యుండును.

అనంతామాత్యుఁ డిరువదినాల్గు యతులను జేసెననియు నాతని తరువాతి వారిరువదియేడు యతుల నంగీకరించిరనియు నప్పకవి యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

